# కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.
2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.
3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

# వ్యాసరచయితలకు, స్పందనలు రాసేవారికి...

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి.
2. రచనలు, వార్తలు ప్రచురణకు తీసుకోవటం సంపాదకుని నిర్ణయం ప్రకారమే జరుగుతుంది. దయచేసి ఎటువంటి సిఫార్సులు, ఒత్తిడి చేయవద్దు. అత్యవసరమైన వాటిని 15 వ తేదీలోపుగా పంపించాలి.

# అందరికీ ......

1. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని పంపించ వచ్చు. లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ఇ-మెయిల్‌కు పంపాలి. లేదా కొరియర్‌లో గాని, రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో గాని పంపవచ్చు.
2. ప్రచురణ కోసం పంపించే రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము.
3. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.


**రచనలు పంపవలసిన చిరునామా :**

**డా॥ సామల రమేష్‌బాబు**, సంపాదకుడు **'అమ్మనుడి'**

జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. ఫోన్ : 9848016136, 0866-2439466

e-mail: ammanudi@gmail.com


బ్రతుకుతెరువులను పట్టించుకోకుండా **భాషను** బతికించుకోలేం. ఇది నిత్యసత్యం. తెలుగు ప్రజల జీవితంలో భాగమైన మత్స్యకారుల వద్ద వున్న భాషా సంపదను శాస్త్ర జ్ఞానాన్ని తెలుసుకొని వాటిని పాఠ్యగ్రంథాలలోకి, సిలబస్‌లోకి తేవాలి... **పుటలు 11-14**




## లోపలి పుటలలో....




క్రైసేత: **అ. రాజ్యలక్ష్మి, శంకర్**, రేఖాచిత్రాలు: **బాలి, అలెగ్జాండర్**

పకపకలు: **సరసి** ముఖచిత్రం : **తమ్మా శ్రీనివాసరెడ్డి**





**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు**

డాక్టర్ **సామల రమేష్‌బాబు**, సంపాదకుడు, **అమ్మనుడి,**

జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com

దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక
**అమ్మనుడి**
మాసపత్రిక
• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1937 మన్మథ నామ సంవత్సర వైశాఖ *(కొంగపి) శుక్ల త్రయోదశి శుక్రవారము నుండి వైశాఖ *(ఒల్లాపి) శుక్ల ద్వాదశి గురువారము వరకు
* కొంగాపి, ఒల్లాపి = తెలుగు నెలలు

## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
**AMMA NUDI - AXIS BANK, TENALI**
అక్కౌంట్ నెం. **915020010550189**
**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆవెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను, జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా
**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, తెనాలి
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**'అమ్మనుడి' చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో పత్రికను పంపగలము. ఇందుకోసం మీ మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు తప్పనిసరి సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

## వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి రెండు సంచికలను (మార్చి, ఏప్రిల్) నడుస్తున్న చరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయిపోయినవారికీ కూడా పంపించాము. ఈ సంచిక నుండి చందా మిగిలిఉన్నవారికి, కొత్తగా చందాలు పంపించిన వారికి మాత్రమే పంపిస్తున్నాము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందాసొమ్మును పంపించకపోయి ఉండవచ్చు. అటువంటివారు దయచేసి వెంటనే పత్రిక చందా పంపమని మనవి.

## శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు.5000 లకు గాను రు.4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలం. అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

## విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తివంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరిప్రతి (శాంపుల్‌కాపి) ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.

- ప్రచురణకర్త

## ప్రోత్సాహకులకు మప్పిదాలు

రు.పదివేల చొప్పున విరాళమిచ్చి
తెలుగుజాతి ట్రస్టు ప్రోత్సాహకులుగా
చేరిన



**శ్రీ దుగ్గిరాల విశ్వేశ్వరంగారు**

**ఫోన్ : 09440156018**

ఆంధ్ర విశ్వవిద్యాలయం (వాల్తేరు)లో ఆచార్యులుగా ఉద్యోగ విరమణ చేసి, భారతీయ శిక్షణా మండలి రాష్ట్రీయ కార్యదర్శిగా పనిచేశారు. ఇప్పుడు అదే సంస్థలో జాతీయ విద్యారంగ సమన్వయ కర్తగా ఉన్నారు. నివాసం : 6-20-6. ఈస్ట్‌పాయింట్ కాలనీ విశాఖపట్టణం-500017.



**శ్రీ చుండూరి సత్యనారాయణగారు**

(తండ్రి కాశీవిశ్వనాధంగారు)

**ఫోన్ : 09440156018**

తెలుగు భాషాభిమాని, తెలుగు భాషోద్యమ సమాఖ్య శాశ్వత సభ్యులు, గతంలో నడచిన "నడుస్తున్న చరిత్ర" మాసపత్రికకు జీవిత చందాదారులు. పుట్టినతేది: 15-8-1963, కుమార్తెలు: ముగ్గురు: సుప్రియ, రమ్యశ్రీ, లక్ష్మీప్రీతి.

# తెలుగుజాతి (ట్రస్టు)

## విన్నపం

చరిత్ర' పత్రిక 20 ఏళ్లుగా నిరాటంకంగా ప్రచురింపబడుతూ, 15 ఏళ్లపాటు తెలుగు భాషోద్యమ నిర్మాణానికై చేసిన కృషి మీకు తెలుసు. తెలుగువారి చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయే పత్రికల్లో ప్రముఖమైనదిగా 'నడుస్తున్న చరిత్ర' కీర్తిని సంపాదించింది.

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే గాక, పొరుగు రాష్ట్రాల్లోనూ తెలుగువారి శ్రేయస్సుకు తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేగాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు ఈ దిశగా పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు తరచుగా కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. ఈ అవసరాన్ని తీర్చడానికే ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నిర్మాణం చేయ తలపెట్టి, ఆ సంస్థను రిజిస్ట్రేషన్ చేయించాము. (92/2014).

తమ భాషాసంస్కృతులను కాపాడుకొంటూ, పెంపొందించుకొంటూ తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు మాతృభాషగా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక చుట్టూ వున్న రాష్ట్రాల్లోనూ, దేశమంతటా అల్లుకునివున్న తెలుగుప్రజలు ఇతరదేశాల్లో వున్నవారితో కలిపి మొత్తం తెలుగు జనసంఖ్య 18 కోట్లకు పైమాటే.

'నడుస్తున్న చరిత్ర' పత్రిక ప్రచురణ 2013 అక్టోబర్‌తో నిలిచింది. దానిని మరింత సమగ్రంగా తెలుగుజాతి పత్రికగా తీర్చిదిద్దాలనే ఆశయంతో **'అమ్మనుడి'** అనే పేరుతో పత్రిక ప్రచురణను మొదలుపెట్టాము. **'అమ్మనుడి'** తొలిసంచికను మార్చి నెలలో చదువరులకు అందించాము. కొన్ని ప్రత్యేకమైన పుస్తకాల్ని కూడా ప్రచురించాలని తెలుగుజాతి ట్రస్టు సంకల్పించింది. తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'** విడుదల చేశాము. తెలుగుజాతి ఆత్మగౌరవాన్ని ప్రతిభా వ్యుత్పత్తులను చాటేందుకు కొన్ని ఇతర కార్యక్రమాల్ని కూడా ట్రస్టు చేపడుతుంది. ఇందుకోసం ఈ ట్రస్టును బలమైన పునాదులతో, వనరులతో ఏర్పరచాలని నిర్ణయించాము. దీనినొక శాశ్వతసంస్థగా రూపొందిస్తున్నాము. అందుకు మీ అందరి చేయూత కావాలి. 'నడుస్తున్న చరిత్ర' పాఠకులుగా, భాషోద్యమం పట్ల శ్రద్ధాసక్తులు కలిగివున్న తాము 'తెలుగుజాతి' ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**ట్రస్టుకు ఈ క్రింది విధంగా విరాళాలనిచ్చి ప్రోత్సహించగోరుతున్నాము.**

| | | |
|---|---|---|
| **ప్రోత్సాహకులు** | **రు.** | **10,000/-లు** |
| **పోషకులు** | **రు.** | **25,000/-లు** |
| **విశిష్ట పోషకులు** | **రు.** | **50,000/-లు** |
| **రాజ పోషకులు** | **రు.** | **1,00,000/-లు** |

వీరికి ప్రతినెలా పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.
వీరి ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.
యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136

| **పారుపల్లి కోదండరామయ్య** | **డా॥వెన్నిసెట్టి సింగారావు** | **స.వెం.రమేశ్** | **సామల లక్ష్మణబాబు** |
|---|---|---|---|
| ట్రస్టీ | ట్రస్టీ | ట్రస్టీ | ట్రస్టీ |
| 9505298565 | 9393015584 | 8500548142 | 9440448244 |

## ఉద్యమ సంస్థలకు రు.33వేల విరాళం

నేటి సమకాలీన సమాజంలో, ప్రజలలోమార్పును, చైతన్యాన్ని, అభ్యుదయాన్ని తెచ్చేందుకు విభిన్న రంగాలలోకొన్ని దశాబ్దాలుగా అకుంఠితదీక్షతో కృషి చేస్తున్న 11 ప్రజాహిత ఉద్యమ సంస్థలను, అవి నడిపే పత్రికలను గుర్తించి, ఒక్కొక్క సంస్థకు 'ముచ్చటగా 3 వేలు' అంటూ మొత్తం రు.33,000/-లను నర్సరావుపేటకు చెందిన గాంధీస్మారక సమితి వ్యవస్థాపకులు ఈదర గోపీచంద్ విరాళంగా అందజేశారు.1. అరసం (పెనుగొండ లక్ష్మీనారాయణ), 2. విరసం (నల్లూరి రుక్మిణి), 3. ప్రజాసాహితి (కొత్తపల్లి రవిబాబు), 4.జనవిజ్ఞానవేదిక (జంపా కృష్ణ కిషోర్), 5. హేతువాదసంఘం (కన్నెబోయిన అంజయ్య), 6. నిడమర్రు చార్వాకాశ్రమం (బి. గృహలక్ష్మి), 7. సమాచార హక్కు ప్రచార ఐక్యవేదిక (జగన్మోహనరావు), 8, బుద్ధభూమి (కృష్ణార్జునబోధి), . గ్రంథాలయ సర్వస్వం (రావిశారద), 10. అమ్మనుడి-తెలుగుజాతి పత్రిక (సామల రమేష్‌బాబు), 11. సంస్థాకుల్-ఢిల్లీ-గాంధీ స్మారకనిధి. జాతీయ పత్రిక - ఈ 11 సంస్థలకు చెందిన ఆయా ప్రతినిధులకు 3-4-2015న తమ కుమార్తె వివాహవేడుక (చి॥ సత్యశాంతి- చి॥ సిద్ధార్థ) సందర్భంగా వధూవరుల చేతులమీదుగా ఈ విరాళం మొత్తాలను అందజేశారు. అదేరోజు పెళ్ళిపందిరి ఆవరణలో మంచి పుస్తకాల ప్రదర్శనలో రు.5,400/-ల సాహిత్యాన్ని ఆహూతులు కొనుగోలు చేయడం హర్షణీయం. గాంధీకవి తుమ్మల సీతారామమూర్తి విరచిత నీతి పద్యాల చిరుపొత్తాన్ని 2వేల ప్రతులు ప్రచురించి ఉచితంగా పంపిణీ చేశారు. వివాహవేడుకలో ఇట్టి సత్సంప్రదాయాలను పాటించడం అభినందనీయం.

## గ్రంథాలయం, సభలు-సమావేశాలు శీర్షికలు

మా కార్యాలయానికి సమీక్షకోసం వచ్చే పుస్తకాలను కనీసం గ్రంథాలయ శీర్షికన పరిచయం చేయగలం. వచ్చే సంచికనుండి ఈ శీర్షిక మొదలవుతుంది.

సభలు సమావేశాలు శీర్షిక కూడా వచ్చే సంచికనుండి మొదలవుతుంది. ఇందులో ప్రచురణకై పంపే ఫోటో వెనుక తేదీ, సమయం, స్థలం వివరాలను పేర్కొనాలి. ఆహ్వానపత్రికను కూడా జతపరచాలి.

## జనవాణి

వివిధ అంశాలపై మీ అభిప్రాయాలు, విమర్శలు, ప్రతిపాదనలు వ్రాయండి. పత్రికలో ప్రచురించని అంశాలపై కూడా వ్రాయవచ్చు. వీటిని జనవాణి శీర్షికలో ఇస్తాము. (ఈ సంచికలో 26, 27 పుటలు చూడండి.

## సందేహాలు, సమాధానాలు

సందేహాలను, ప్రశ్నలను సంపాదకుని ఉద్దేశించి పంపవచ్చు. వాటికి పత్రికలోనే సమాధానాలు ప్రచురిస్తాము.

---

డా॥ సామల రమేష్‌బాబు, సంపాదకుడు **'అమ్మనుడి'**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి,
మాచవరం, విజయవాడ-520004.
ఫోన్ : 9848016136, 0866-2439466
e-mail: ammanudi@gmail.com

సంపుటి : 1 సంచిక : 3
అమ్మనుడి
మే 2015

సంపాదకీయం

# తెన్నాట తెలుగు నుడి పోరాటం

**తె**న్నాట (తమిళనాట) తెలుగునుడిని నిలబెట్టుకోవడానికి తెలుగువారి తపన ఏమిటో, చేస్తున్న పోరాటం ఏమిటో నిన్నటి 'నడుస్తున్న చరిత్ర' నేటి 'అమ్మనుడి' చదువరులకు తెలుసు. ఇప్పుడా పోరాటానికి ఒక తీరూ తెన్నూ ఏర్పడుతున్నది. 'తెలుగువాణి' సంస్థ తెలుగు చదువులు నేర్పుతున్న క్రమంలో సమకూడుతున్న తెలుగు లెంకల తోడ్పాటుతో ఈపని జరుగుతున్నది. తెలుగు భాషోద్యమ సమాఖ్య తీర్చిదిద్దిన తెలుగు పతాకాన్ని వారు అందుకొన్నారు. ఇప్పుడు తమదైన తెలుగుతల్లి ప్రార్థన గీతాన్ని-వేడుకోలు పాటను - వ్రాసుకొన్నారు. ఆ పాటను ఈ పత్రిక రెండవ అట్టపై చూడండి. దక్షిణదేశ ప్రాంతంలోని తెలుగు తోబుట్టువులు తమ ఉనికి పోరాటానికి స్ఫూర్తినిచ్చే తెన్(దక్షిణ) తెలుగు - తెందెలుగు తల్లిని ఆవాహన చేసుకొన్నారు. ఎంతో సుందరమైన (చెన్) ఆ తెలుగుతల్లికి వేడుకోలు పాటను పాడుకొంటూ- ఆ దక్షిణ ప్రాంతంలో మూల ద్రావిడంలోంచే పుట్టిన తమిళ తోబుట్టువులతో కలిసి బ్రతుకుతున్నారు. వేల ఏండ్లుగా నెలకొన్న ఆ తెలుగుతల్లి తియ్యని స్వరాన్ని కీర్తిస్తున్నారు. ఆ ప్రాంతంలో పారుతున్న అరుణ, పెన్నా, కావేరి, వైగా, పరణి అనే అయిదు ఏరుల నడుమ అందంగా అమరివున్న తమ భూభాగాన్నీ అక్కడి తొలిజాతి జనులుగా తమ ఉనికినీ తలచుకొని మురిసిపోతున్నారు. ఆ నదులు వడివడిగా పరుగులిడి, తమ చేనులకు ప్రాణంపోస్తూ పచ్చని పైరులనూ, పాడిపంటలనూ సమకూర్చి తమ కడుపులను నింపి తమ బ్రతుకును నిలుపుతున్నాయనీ శౌర్యవంతురాలయిన ఆ అమ్మ తమను కాపాడుతున్నదని వారు పొంగిపోతున్నారు.

పడమటి కొండలను ఆ తల్లి కుడిచేతిలోనున్న పతాకం (కొడి) అనీ, ఎడమచేతిక్రింద బంగాళాఖాతం (తూర్పు కడలి) ఉందని, తిరుమలకొండ ఆమె తల కొప్పు అనీ, వానమామల కొండలు ఆమె కాలి తొడుగు అనీ - అలాంటి గొప్ప రూపాన్ని వారి మనసులలో ముద్రించుకొని ఆ తెందెలుగు తల్లిని- ఆ నిండుజాబిల్లిని- గొంతెత్తి వేడుకొంటున్నారు.

కొంగు, మొరసు, చోళ, తొండ, పాండ్య నాడులు అయిదింటి పూర్తి భౌగోళిక రూపమే తెన్నాడు అని స్పష్టంగా తమ తావును వారు గుర్తించారు. ఈ నాడుల్లో నెలకొనియున్న ఆ తెందెలెగు తల్లి తావుతావుకూ పలుతీరుల పలుకుతున్నది అనీ ఆమె పలుకులు తమ చెవులకు తేనెలు చిలకరిస్తున్నాయి అనీ వారు పొంగిపోతున్నారు. ఆ తల్లిని ఒక నిండైన భావచిత్రంగా తలచుకొని, ఆమెను తమ ముందు సాక్షాత్కరింపజేసుకొని, 'అమ్మా, నీమీద ఒట్టు.మేం తెలుగును నిలుపుకొంటాం' అని మరీ మరీ ఒట్టు పెట్టుకొంటున్నారు.

'అమ్మనుడి' తొలిసంచిక (మార్చి) ముఖచిత్రంగా ఇచ్చిన తెలుగునుడి పటంలో ఈ తెన్నాడు విస్తీర్ణాన్ని చూడండి. ఆంధ్ర, తెలంగాణలు గాక, ఈ తెన్నాడూ గాక - ఇంకా తెలుగువారు పరుచుకొనివున్న నేలను పరికించండి.

తెలుగునేల అంటే నేటి ఆంధ్ర, తెలంగాణలు కలిసిన ప్రాంతమేనని, నిన్నటిదాకా వున్న ఆంధ్రప్రదేశ్ మాత్రమే తెలుగువారి భూమి అనీ అందరినీ భ్రమల్లో ముంచేసిన నాయకత్వం ఈ తెలుగుజాతికి దాపురించింది. ఇప్పుడు వాటిని పటాపంచలు చేసే యువజనతరంగం ఆ ప్రాంతాల్లో పొంగివస్తున్నది. నేడు ఇది తెన్నాడులో మొదలైంది. రేపు తక్కిన చోట్లకు పాకుతుంది. తెన్నాటిలో ఇప్పుడు చోటుచేసుకుంటున్న పరిణామాలు రానున్న

## సంపాదకీయం

మార్పులకు కొద్దిపాటి సూచికలు మాత్రమే.

'అస్తిత్వ ఉద్యమాలు' అని మేధావులు పలుకుతున్న మాటను మనం హాయిగా తెలుగులో ఉనికి పోరాటాలు అనుకోవచ్చు. స్త్రీలు, పీడితులు, వెనుకబడిన కులాలు, వృత్తివర్గాలు వంటి రంగాలకు చెందిన ఉనికి పోరాటాలుగా ఇవి ప్రసిద్ధం. మరి, బలమైన కారణాలతో ఒక రాజకీయ పోరాటంగా సాగే ప్రాంతీయ అస్తిత్వ పోరాటాలకు ఇటీవలి తెలంగాణ పరిణామాలే సాక్ష్యం. ఏ నుడి అయినా ప్రజల్ని కలిపి వుంచేదేగాని, వారి మనుగడకు, ఉనికి పోరాటాలకు అది అడ్డు కాదు. పైగా ఆ వర్గాల నడుమ అవగాహనను, సహకారాన్ని పెంచే తోడుగా ఉంటుంది. ఒక నుడి జాతిజనులు భౌగోళికంగా విస్తరించి వున్నపుడు వారి బ్రతుకు అక్కరలకు అడ్డుపడేదిగా అమ్మనుడి ఎప్పుడూ ఉండదు. ఈ స్వభావమే ఇప్పుడు దూరతీరాలలో నెలకొనివున్న తెలుగు ప్రజలందరి ఉనికి పోరాటాలకు కావలసిన తెగువనూ, చేవనూ ఇస్తున్నది. దీన్ని అన్ని ప్రాంతాలలోని తెలుగు జనులు, జన నేతలూ తెలుసుకోవాలి. ఒకరికొకరు తోడు నిలిచి, దేశంలో అన్ని ప్రాంతాల తెలుగువారి ఉనికి పోరాటాలకు మద్దతు ఇవ్వాలి. అలాంటి అక్కర శ్రీలంకలోని తమిళులకు ఏర్పడిందని భారతదేశంలోని తమిళులు తెలుసుకొని, వారిని సమర్థించేందుకు ఎంతగా తమ రాజకీయాలను మలచుకొన్నారో గమనించాలి. అదేవిధంగా దేశంలోనూ, ఇతర దేశాల్లోనూ ఉన్న తెలుగువారి భాషాసంస్కృతుల, జీవన హక్కుల రక్షణకు రెండు తెలుగు రాష్ట్రాలూ మద్దతు ఇవ్వాలి. ఈలోపుగా ఈ రెండు రాష్ట్రాల్లో తెలుగును బలమైన సాధనంగా తీర్చిదిద్దుకునేందుకు తగిన అన్ని చర్యలను ప్రభుత్వాలు చేపట్టేలా ఉద్యమాలు రావాలి. ఆ ఉద్యమాలే జాతిభావనను పెంపొందించగలుగుతాయి. ఎన్ని రాష్ట్రాల్లో ఉన్నా, ప్రాంతాల్లో ఉన్నా తెలుగుజాతి బంగరు భవితకు అవి దారి చూపగలుగుతాయి.

తమ 'అమ్మ నుడి'ని తల్లిగా భావించడం ఈ నేల జనుల్లో ఉన్న ఒక గొప్ప భావన. అది వారి నెత్తుటిని ఉరకలెత్తిస్తుంది. స్ఫూర్తినిస్తుంది. ఆ భావన దైవభావనతో సమం అవుతుంది. మొన్నటిదాకా తెలుగుతల్లిగానే... నిన్నటినుంచి తెలంగాణ తల్లిగా కూడా... ఇప్పుడు తెందెలుగుతల్లి గానూ... రేపు మరొకరూపం. ఊహలు, ఊహాచిత్రాలు, శిల్పాలు ఎలా ఉన్నా అందరు తల్లుల పలుకు ఒక్కటే–అది తెలుగు. ఆ పలుకు తీరులు అనేక సహజకారణాలవల్ల పలువిధాలుగా ఉంటాయి. అందుకే తెలుగువారివి 'పలునెలవులు'. అయినా 'పలుకు ఒక్కటే'. లిపి ఒక్కటే. ఈ సహజ, శాస్త్రీయ, చారిత్రక సత్యాన్ని చూడలేనివారిపట్ల కోపం వద్దు. వారే కాలక్రమంలో దారికి వస్తారు. 'అమ్మ నుడి' చేవ అటువంటిది, అమ్మ ఒడి అటువంటిది. ఆ నెనరు అటువంటిది.

విజయదశమి పండుగలో రోజుకొక్క తీరున అమ్మవారిని అలంకరిస్తారు. మూలవిరాట్టు ఆమే. ఆరోజు అలంకారాన్ని బట్టి భక్తులరాక, పూజాదికాలు, వేడుకలు ఉంటాయి. తెలుగుతల్లి కూడా అటువంటి శక్తి స్వరూపిణే. ఆమెకు తావుకొక అలంకారం... పలుకుకొక సోయగం... అంతటా మధురస్వరాలు వినిపించే పలుకులతల్లి ఆమె.

చివరగా చెప్పదలచుకొంది ఒక్కటే. వివిధ ప్రాంతాల్లోని తెలుగువారు తమ బంగరు భవిత కోసం చేసే ఉనికి పోరాటాలు జాతికి ముందడుగులే అవుతాయి. వాటిని సాటి తెలుగువారు ప్రోత్సహించాలి, తోడ్పడాలి.

తెన్నాడులో ఇప్పుడు తెలుగువారు సాగిస్తున్న పోరాటం తమ నుడి–నానుడి లను (భాషాసాహిత్యాలను) రక్షించుకోవడంకోసమే. అయితే దాన్ని తమిళనాడులోని తమిళ రాజకీయ నేతలు ఒక ధిక్కారంగా భావించవచ్చు. అయినా అక్కడి 42శాతంకు పైగా ఉన్న తెలుగువారు తమ నేలతల్లిని గౌరవిస్తూ, తమ తోటి తమిళ తోబుట్టువులతో చేయి చేయి కలిపి నడుస్తామని తమ వేడుకోలు పాటలోనే ఒట్టుపెట్టుకుంటున్నారు. ఇక వారిని శంకించడానికేముంది. వేల ఏండ్లుగా తమ నేలపైనే తామున్నందున నుడిపరమైన తమ హక్కులను సాధించుకోవడానికి, తోటివారితో కలిసి స్వాభిమానంతో మనుగడ సాగించడానికీ తెన్నాట తెలుగువారు చేస్తున్న సాంస్కృతిక పోరాటాన్ని బలపరచడం మనందరి కర్తవ్యం.

**09-5-2015**

సామల రమేష్‌బాబు

**ఏ రాష్ట్రంలో ఉన్నా ఏ దేశంలో ఉన్నా తెలుగువారంతా ఒక్కటే**

మరచిపోతున్నాం...

# మలి తెలుగు శాసనం:
# జయసింహుని విప్పర్లశాసనం

**మన చరిత్ర, సంస్కృతి, భాష, శిల్పం, చిత్రలేఖనం, ఆట, పాటల గురించిన ఒకప్పటి విషయాలను ఇప్పటి చదువరులకోసం 'అమ్మనుడి పత్రిక' "మరచిపోతున్నాం" అనే కొత్త శీర్షికను మొదలుపెడుతున్నాం. ఈ పరంపరలో మొదటి వ్యాసంగా మలి తెలుగు శాసనం (విప్పర్తిజయసింహుని శాసనం) అందిస్తున్నారు డా॥ ఈమని శివనాగిరెడ్డి గారు మరియు డా॥ మొవ్వ శ్రీనివాసరెడ్డి గారు.**

**- సంపాదకుడు**

'నాగబు' తొలితెలుగు పదమని వేటూరి ప్రభాకరశాస్త్రిగారినుంచి ఆరుద్రగారివరకు అనుకొన్నారు. ఇప్పటికీ అలానే ప్రచారం జరుగుతోంది. అయితే దాని వివరాలను తెలుపుతున్న నాగబు(ద్ధి) అనే వ్యక్తిపేరని, 'నాగబు' ముందు వరుసలోనూ, (ద్ధి)దానం రెండో వరుసలోనూ ఉన్న క్రీ.శ.1వ శతాబ్ది అమరావతి శాసనంలో ఉందని ఆమధ్య ఈమని శివనాగిరెడ్డి, జితేంద్రబాబు, సూర్యకుమార్‌లు ఒక వ్యాసం (మిసిమి)లో పేర్కొన్నారు. నాగబు పదమే కానప్పుడు తొలి తెలుగుపదం అసలే కాదని వారివాదన. అది అలా ఉంచితే, క్రీ.శ.6వ శతాబ్దికి చెందిన కనమల్ల ధనంజయుని శాసనమే తొలి తెలుగు శాసనంగా గుర్తింపు పొందింది.

గుంటూరు జిల్లా నకరికల్లు మండలంలోని విప్పర్ల (విత్పత్తి) గ్రామంలోని చెరువు కట్టపైనున్న తూర్పు చాళుక్య ప్రభువైన జయసింహవల్లభ మహారాజులు వేయించిన శాసనాన్ని మలితెలుగు శాసనంగా చెప్పుకోవచ్చు. శాసనంలో 'స్వస్తిశ్రీ మత్ సకలలోకాశ్రయ జయసింఘవల్లభ మహారాజులకున్ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబుల్ ఎణుంబొది అన్నెణ్ణి అమ్మపూణ్ణమనాండు' అని ఉండటాన, వేంగీచాళుక్య మొదటి రాజైన కుబ్జవిష్ణువర్ధనుని పెద్దకొడుకు జయసింహుడు క్రీ.శ.641లో సింహాసనమెక్కి క్రీ.శ.674 వరకూ పాలించాడు. విప్పర్ల శాసనంలో - సింహాసనమెక్కిన తరువాత 8వ సంవత్సరంలో ఆ శాసనాన్ని వేయించాడని ఉంది. ఇది. క్రీ.శ. 641+8 = 649-650వ సంవత్సరానికి సరిపోతుంది. జయసింహుడు తన పొలమూరు శాసనంలో కళింగాంధ్ర శత్రురాజులను జయించానని చెప్పుకొన్నా దండి 'దశకుమార చరిత్ర'లో, జయసింహుడు కళింగ గంగరాజుతో జరిగిన యుద్ధంలో చనిపోయాడని చెప్పాడు. ఇతనికి సర్వసిద్ధి అనే బిరుదుంది. విప్పర్ల శాసనంలో 'సకలలోకాశ్రయ' అనే బిరుదుంది. ఇంకా ఇతని శాసనాలు గుంటూరు జిల్లా మాచర్ల, కృష్ణాజిల్లా పెద్దమద్దాలి శాసనాలు కూడా ఉన్నాయని చరిత్రకారులు వి.కె.మోహన్ పేర్కొన్నారు. వి.కె.మోహన్, ఎం. సోమశేఖరరావులు 'గుంటూరు జిల్లా సమగ్రచరిత్ర - సంస్కృతి' అనే పుస్తకంలో విప్పర్ల శాసనాన్ని తూర్పు చాళుక్యుల తొలిశాసనంగానూ, భాషాపరంగా ముఖ్యమైన శాసనంగానూ' చెప్పారు.

ఇక విప్పర్ల శాసనానికొస్తే 'సంవత్సరంబుల్' 'ఎణుంబొది' 'పూణ్ణమనాండు' 'బిణిసేసిన' 'పులొంబున' 'చెఱువుపడుమాఱికోట' 'ఎణుంబొదిపుట్టు' 'ఆఱ్ఱపట్టు' 'తాళుతొంటళాయు' 'పడువారంబు ఇచ్చిరి' 'పాఱపడువారంబు' 'కుడుచువారు' 'యిఱ్ఱకాను' 'విత్పత్తిగాణంబు' 'చువ్వటూరుగాణంబు' 'మ్లావిండిరాజులముట్టు కలిముడిరాజుల్' అన్న తెలుగుపదాలు ఆసక్తికరంగా ఉన్నాయి. అక్కడేఉన్న మరో శాసనంలో 'సముద్రంబునిల్పి' 'మహిమిన్ద' 'గుద్లునన్దవనంబు' 'ప్రసాదంబుళన్నియు'

'ఇరువుట్టి ఆడ్లపట్లు' ఈ ఊడ్లందు 'ఏనువుట్లు ఆడ్లపట్టు' 'శ్రీవిత్పత్తి' 'చంద్రాదిత్యుల కలయన్తగాలంబుగ' 'కవులఆయంబు' 'దీనికివక్రంబువచ్చిన' పాఱ(బ్రాహ్మణుడు) మొదలైన తెలుగు పదాలున్నాయి. తెలుగుభాష క్రమపరిణామాన్ని అధ్యయనం చేసే పరిశోధకుల దృష్టికి తేవడమే ఈ వ్యాసం ముఖ్యోద్దేశము. కనమళ్ల ధనంజయుని శాసనం జాడ తెలియని నేపథ్యంలో కనీసం ఈ విప్పర్ల శాసనాన్నైనా కాపాడుకుని, ప్రచారం చేయాల్సిన అవసరముంది. (ఈ శాసన ఫోటోలను అందించిన విప్పర్లవాసులు కటికల రమణయ్య, జల్లిపల్లి వీరస్వామి, గాసి వెంకటేశ్వర్లు, ఆకుల కొండలు, పిడుగురాళ్లకు చెందిన శాంతిదూత నాయకురాలు పై వినూత్న పరిశోధనలు గావించిన కె.హెచ్.వై. మోహనరావుగార్లకు కృతజ్ఞతలు.

**దక్షిణ భారత శాసన సంపుటి - 6.**

**శాసన సంఖ్య - 584, 585**



**ఒకవైపు**

1. స్వస్తి శ్రీమత్ సకలలోకాశ్రయ జయసింఘ-
2. వల్లభమహారాజులాకు్ ప్రవర్ద్ధమాన విజయరా-
3. జ్యసంవత్సరంబుల్ ఎణుంబొదిఅన్నేణ్టి అమ్మ్ పూణ్ణ-
4. మనాణ్డుం మ్లావిండిరాజులముట్టుకలిముడిరాజుల్
5. మ్లావిండిసముద్రరకై నాకు బణిసేసిన కల్చివీ-
6. టరుట్ల మద్ధికదుమూటికి విత్పత్తి ఉత్తరంబున పులొ-
7. ంబున చెఱువు పడుమాటికోట్ ఎణుంబొది పుట్టు ఆ
8. ట్లపట్టుసేను (।*) తూప్పున్ నకోటితా(ఱ)తోంటళాయు పడువా-
9. రంబు ఇచ్చిరి పాఱపడువారంబు మ్లావి(0)డీశ్వరంబున కళా-
10. కణ్డుగుమిచ్చి కుడుచువారు యిట్లకాను ఏ వెఱుగవా-
11. రు విత్పత్తిగాణంబు(న్ధొ)ల్గొట్టు(న)ంగాణంబు చువ్వుటూరుగాణంబు

**అదే పలకపై...**



1. ..గొమ్మలోవిడి సముద్రంబు ని(ల్చి)మహిమిన్దమతిపా . మ...
2. ... పెరువెళ్పుగుడ్లునన్దవనంబు. న్దిఱ్ల పేవు వేపుర.(ఘ)మ్మ్..
3. ... శ్రీవి లేవని పొగఅకుడుము . సేపుటకలిముడి . .
4. ... నప్రసాదంబుళన్నియుమి ... హతకపుత్రకమునియో
5. ... (శ్రీ) (శి)లావిశాలవిపుల ... సంపూణ్ణ్గాం(భీ)
6. (శు)భ్రదభ్ర(శు)శౌచ్యస్స .. జననుత... వత్తో
7. ప్తానసప్ర . స్వసు ... లసద్భిత్తి చిత్ర(వి)రా(జ)-
8. ..థి(స్థా)వా(స)భద్ర సకలవా. (యు)త(న్ని)మ్తి్తన్ని(వ్వ్త్త్)న
9. .. శ్రీసలకుఇరువుట్టి ఆడ్డపట్టుకుటితియా(ఊ)డ్లందు
10. ఏనువుట్లుఆడ్డపట్టు . బుచేనుశ్రీవిత్పత్తి . .
11. (న్ద్రా)దిత్యుల కలయన్త(గాల)ంబుగ నడియ వాలు ...
12. ... కవుల ఆయంబు దీనికి వక్రంబువచ్చిన ...
13. ... పాఱను వేయు కవిలలా ...
14. ... వు వ్రచ్చినవారు భారనా ...

రచయితలు **డా॥ ఈమని శివనాగిరెడ్డి** (ది కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ) ఫోన్: 9848598446; **డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి** (లయోలా కాలేజి, విజయవాడ, ఫోన్: **9490333488**

అట్టపై బొమ్మ

– 'శక్తి' శివరామకృష్ణ

## బతుకుతెరువులను పట్టించుకోకుండా భాషను బతికించుకోలేం

# తీరప్రాంత మత్స్యకారుల భాష-సాధికారత

**తీ**రప్రాంత మత్స్యకారులకు సముద్రతీరం నుండి 5 కి.మీ. వరకు గల సముద్రపు హక్కులను గుర్తించేందుకు 2009లో కేంద్రప్రభుత్వం బిల్లుప్రవేశపెట్టింది. సముద్రంలో చేపలు దొరికే ప్రదేశాలు, ఉపద్రవాలను అక్షాంశ, రేఖాంశాలలో 'ఇంకోయిస్' సంస్థ జారీచేస్తుంది. అయితే మత్స్యకారుల కొలతలు, గుర్తులు ఎలా ఉంటాయో తెలుసుకోవడానికి, నేను, తెలుగువాణి వేణుగోపాల్‌రెడ్డి, స.వెం.రమేశ్, ఉమామహేశ్వరరావు ఆర్.ఎం. (తిరుపతి), మత్స్యశాఖలో పనిచేసిన గోపాలరెడ్డిగారలు బయలుదేరాము. సమాచార లోపంవల్ల సముద్రతీరానికి బదులు మొదటిరోజు పులికాట్ సరస్సులో వాటంబేడుకుప్పం గ్రామానికి వెళ్ళాము. ఈ సరస్సు ప్రస్తుతం అభయారణ్యం. కాబట్టి అటవీహక్కుల గుర్తింపుచట్టంకింద సంప్రదాయవాడుకలకు గుర్తింపు ఇవ్వవచ్చు. అందుకోసం సరస్సులో నాలుగుదిక్కుల సరిహద్దులలోగల తావులపేర్లు సేకరించాము.

మరునాడు సముద్రతీరంలో ఓడపాలెం వెళ్ళాము. అక్కడి మత్స్యకారులు 40బారలు అంటే 225 అడుగులవరకు వేటకువెళుతున్నారు. ముగ్గురిదగ్గర అక్షాంశ, రేఖాంశాలు గుర్తించే జిపియస్ పరికరాలు ఉన్నాయి. వాటిద్వారా కేవలం దిక్కులను గుర్తించటం మాత్రమే వారికి తెలుసు. తామున్న తావు అక్షాంశాలలో చెప్పలేరు. ఇంకోయిస్ వారి నివేదికలు వారికి తెలియవు. అటవీహక్కుల గుర్తింపు చట్టంద్వారా గిరిజనులలో సాధికారితకోసం ప్రారంభించిన కృషిని, మత్స్యకారులలో ముందుకు తీసుకుపోవలసి ఉంది. ఇటువంటి బతుకుతెరువులకు తోడుపడకుండా భాషను బతికించుకోలేం.

ఆచార్య దొణప్ప సంపాదకత్వంలో 1991లో మత్స్యపరిశ్రమ పదకోశం వచ్చింది. దీన్ని మత్స్యశాఖ, మత్స్యకళాశాలలకు సంప్రదింపు గ్రంథంగా తీర్చడానికి తోడ్పడవలసిందిగా 2008 నాటి మత్స్యశాఖమంత్రి, నేటి అంధ్రప్రదేశ్ శాసనసభ ఉపసభాపతి శ్రీమండలి బుద్ధప్రసాద్ ముందుంచిన ప్రతిపాదన అలాగే ఉంది.

తెలుగుభాషాభిమానుల్లో శాసన కార్యనిర్వాహక వ్యవస్థలో పనిచేసిన, చేసే వారున్నారు. శాస్త్రసాంకేతిక నిపుణులున్నారు. వారిలో కొందరైనా, ప్రకృతి వనరుల మీద ఆధారపడి సాంప్రదాయ నైపుణ్యాలతో మనుగడ సాగిస్తున్న పల్లెప్రజలు, మారుతున్న పరిస్థితులకు సర్దుకోవడానికి సాయపడుతూ, బడుగుజీవుల సాధికారితకోసం, బతుకుదెరువులలో భాషను బ్రతికించుకుంటూ, తెలుగు జాతివైభవానికి పూనుకోవాలి.

### ప్రళయకావేరి (పులికాట్) సరస్సు. వాటంబేడు కుప్పం, వాటంబేడు గ్రామం, తడమండలం, నెల్లూరు జిల్లా

ఉత్తర దిక్కులో స్థలాల పేర్లు

1. **పంబలి :** సరస్సు అంచునున్న గ్రామం.
2. **కాకియం పరప :** సరస్సులో కొంతదూరం వరకూ ఒకేలోతున నీళ్లు ఉండే ప్రాంతాన్ని పరప అంటారు. ఇక్కడ నీటి అలజడి ఉండదు, పడవలకు భద్రమైన చోటు చేపలు ఎక్కువగా దొరుకుతాయి.
3. పెద్దతోట : సరస్సులోని గ్రామం
4. **చిన్నతోట :** సరస్సులోని గ్రామం
5. **మట్టిదిబ్బ :** దీనికి పునమాల తిప్ప అని ఇంకొక పేరు. రాకెట్ ప్రయోగ కేంద్రం ఏర్పాటు కోసం శ్రీహరికోట దీవి ప్రజలను ఖాళీ చేయించగా, అందులోని కొందరు, ఈ దిబ్బమీద నివాసం ఏర్పరచుకొన్నారు. దీనికిపుడు పుండరిపురం అని కొత్తపేరు పెట్టుకొన్నారు.
6. **మాలాద తిప్ప :** ఇది కూడా పైదానిలాగా కొత్త జనావాస ప్రాంతమయింది. దీనికి కొత్తపేరు మాధవపురం.
7. **పాములతేరి :** సరస్సులోని గ్రామం.
8. **ఆలికుళి :** సరస్సులో గుంటగా ఉన్న ప్రాంతం. ఆలి అంటే ఒకరకం నత్తగుల్ల, కుళి అంటే గుంట.
9. **గొల్లపాళెం :** సరస్సులోని గ్రామం.
10. **నాగినేరి :** సరస్సులోని గ్రామం
11. **మూలపడవ :** సరస్సులోని గ్రామం.
12. **మూలపడవ కయ్య :** మూలపడవ గ్రామం దగ్గరి సరస్సు ప్రాంతం.
13. **పండ్రం :** గ్రామం
14. **మాడుకట్రవలి :** పశువులను మేపే చోటు మాడు అంటే పశువు.
15. **పాలారు :** సరస్సుకు ఒక ప్రాంతపు పేరు పాలచెట్లు ఎక్కువగా ఉంటాయి. వానాకాలంలో చేపలు ఎక్కువగా దొరికే చోటు.
16. **పేరపాటి తిట్టు :** సరస్సులో గ్రామం తిట్టు అంటే తిప్ప లేదా దిబ్బ

## నాడు, నుడి, నానుడి

### తెలుగు మాటల సమగ్ర ఆకర గ్రంథాన్ని తయారుచేయాలని తలపెట్టాం

### ఈ కృషిలో మీరూ భాగస్వాములు కావచ్చు.

## మీకు స్వాగతం పలుకుతున్నాం

మన గ్రామాలు, చుట్టుప్రక్కల స్థలాలపేర్లు, ఇంకా వాడుకలోగల 'నాడు'ల రాజకీయ పర్యావరణ, ప్రత్యేకతలు – అడవి, సముద్రం, వ్యవసాయం మీద జీవిస్తున్న వారి పద సంపద, పర్యావరణంతోపాటు సాంకేతిక ప్రగతివల్ల వాటిలో వచ్చిన మార్పులు; వీటిని మరింత తెలుసుకోవాలన్నా, గుర్తుచేసుకోవాలన్నా జిల్లాలవారీగా, కనీసం ప్రాంతం వారీగా ఒక ఆకరం లేదు. ఇందువల్ల చదువుకున్నవారిలో తెలుగువాసన అంతరిస్తుంది. రచనలలో మాండలికాలు వాడడం గుడ్డిలో మెల్ల. అయితే ఆ బతుకుతెరువులను 'సాధికారిత' వైపు నడిపించలేవు.

కాబట్టి ఈ 'నాడు, నుడి, నానుడి'లను ప్రాచీనాంధ్ర భూగోళం, గ్రామ స్థలనామాలు, వృత్తి పదకోశాలు, చాటు పద్యాలు, సామెతలు, జానపద గేయాలను అనేక గ్రంథాలనుండి సేకరించి, ముందుగా ప్రాంతానికి 100 పుటల సమాచారం సేకరించుకుని జిల్లా లోని భాషాభిమానులతో చర్చించి ఈ కృషికి తుదిరూపం ఇవ్వాలనే పద్ధతిని ఎంచుకున్నాం.

ఈ పద సంపద ఆయా వృత్తులకు చెందినది కాబట్టి, ఆయా ప్రభుత్వ శాఖలలో అధికారులు, శాస్త్రవేత్తలను సంప్రదించడం తప్పనిసరి. వారి సహకారం కొత్తపాతల కలయికను తెలుసుకోవడానికి ఉపయోగపడుతుంది.

ఈ కృషి ఉద్యమస్థాయిలో కొనసాగించడానికి, తెలుగు భాషాభిమానుల సహకారం కోరుతూ, ఈ కృషిలో పాల్గొనదలచిన వారిపేర్లను ఇవ్వవలసిందిగా కోరుతున్నాం. సంప్రదించవలసిన ఫోన్ నెం: 9441427977 / 9100931658.

బతుకుతెరువులను పట్టించుకోకుండా భాషను బతికించుకోలేం.

17. **కొండారెడ్డి కుళి :** కుళి అంటే గుంట సరస్సులో లోతయిన చోటు
18. ఎల్లమ్మ తిట్టు
19. **కందమ్మసేలమ్మ తిట్టు :** కందమ్మ, సేలమ్మ అనే దేవతలను మొక్కే చోటు
20. **జంగాలపల్లి ఆఊ :** సరస్సుకే ఒకతావున పేరు
21. **మీంజూరు ఆఊ :** మీంజారు అనే గ్రామం దగ్గరి సరస్సు ప్రాంతం
22. **సోమతాంగి :** సోమ అంటే మోపు. కట్టెల మోపులను దించుకొని సేదతీరే చోటు
23. **కడపత్ర :** సరస్సులో గ్రామం.
24. **కిళింజి :** కిళింజి అంటే గుల్ల గుల్ల దొరికే చోటు
25. **పాతిరేవువళి :** వళి అంటే దారి
26. కాటేరి దిబ్బ
27. **తిప్పకొడ :** కొడ అంటే సరస్సు కొడవలి ఆకారంలో వంపు తిరిగి ఉండే చోటు. ఇక్కడ పడవలను నిలిపితే భద్రంగా ఉంటాయి.
28. నదు తిట్టు
29. **అటకానితిప్పకయ్య :** అటకాని తిప్ప అనే గ్రామం దగ్గరి సరస్సు
30. **మదుకందు తిట్టు :** మదుకందు అంటే ముళ్లచేప
31. **కిళింజి :** గుల్ల దొరికే చోటు
32. **కిళింజి మొనతర :** ముఖద్వారాల దగ్గర ఏర్పడే ఇసుకమేటల ప్రాంతం
33. బ్రిడ్జి :
34. **పిట్టలగూడు :** వలసపక్షులను చూడడానికి, పర్యాటకుల కోసం కట్టిన కట్టడం.
35. **తిప్ప, కుదిరి :** సరస్సు అంచునున్న గ్రామాలు
36. కుదిరి కొడ
37. సూరా కాలవ
38. వాటంబేడు

(ప్రేము పాదలు, మొగళి పాదలు, ఈతచెట్ల పాదలు) (సుడికాటు పూ (స్మశాన పువ్వు) వాటి వేర్లను ఆయుర్వేదానికి ఉపయోగిస్తారు).

ఈశాన్య దిక్కు

1. **రాయదొరువు మొగుదారం :** మొగుదారం అంటే ముకద్వారం. వానాకాలంలో ఇక్కడ చేపలవేట చేస్తారు.
2. **రాయదొరువు కుప్పం :** గ్రామం
3. **ఉప్పుకలవ :** బకింగ్ హాం కెనాల్
4. **దేవళం :** శ్రీహరికోట దీవిలో ఒక ప్రాంతం. శిథిలమైన గుడి

ఉండే చోటు

5. **దేవళం గండి :** బకింగ్ హాం కాలువకు గండిపడిన చోటు
6. **దేవళం పరప :** ఒకే లోతున నీళ్లు నిలువ ఉండే సరస్సు ప్రాంతం. ఆటుపోటుల ద్వారా నీళ్లు వచ్చి చేరుతాయి.
7. **కుందికాలు తిట్టు :** తిట్టు అంటే ఇసుకదిబ్బ. తిట్టులపైన వలసపక్షులు, జాలర్లు సేదతీరుతారు.
8. **తోటకట్ల పరప :** తోటకట్ల అనే గ్రామానికి దగ్గరగా ఉండే పరప
9. **పళంగట్టు కాలువ :** పళం అంటే పాత. బకింగ్ హాం కెనాల్ పాత కాలువ.
10. **గల్ల బాయి :** రవాణా కేంద్రం
11. **కందమ్మసేలమ్మ తిట్టు :** ఈ తిప్పకు ఇంకొక కొస ఉత్తరం దిక్కున ఉంటుంది. ఉత్తరం దిక్కున వ్రాసిన తిప్ప, ఇదీ ఒకటే.
12. **సత్రం :** శ్రీహరికోట దీవిలో ఒకప్పటి గ్రామం. ఇప్పుడు షార్‌కు శ్మశానం
13. **అట్టుకొట్ట :** అంటే మేకల కొట్టం
14. **పళంగట్టు కాలువ :** పైన (9)లో వివరించినదే ఇక్కడా వుంది.
15. ఉమ్మితిట్టు
16. **రోడ్డు కట్టు :** సూళూరుపేట, శ్రీహరికోటల నడుమ వేసిన తారుబాట
17. **అటూని తిప్ప :** గ్రామం
18. నడుందిట్టు
19. తపాపతి తిట్టు
20. చిన్న తిట్టు
21. **కాలుగట్టు :** నీటిలోపల కాలువలాంటి లోతైన, పొడవైన చోటు
22. **ముందిరిపార తిట్టు :** ముందిరి అంటే జీడిమామిడి
23. రెండుగట్టు నడువ
24. ముందిరి పార ఒడ్డు
25. నక్కలమ్మ కాలవ
26. **సుడుగాడు కొడ :** సుడుగాడు అంటే శ్మశానం
27. **గొబ్బేరు మిట్ట :** వ్యవసాయ పొలం
28. ఆర్&బి
29. వాటంబేడు

ఈశాన్యానికి ఆనుకొని ఉన్న తూర్పు దిక్కు

1. శ్రీహరికోట సరిహద్దు
2. **ఉప్పుకాలువ :** బకింగ్‌హాం కెనాల్
3. **కస్పా కయ్య :** కస్పా అనే గ్రామం దగ్గరి సరస్సు
4. **మూల కయ్య :** మూల అనే గ్రామం దగ్గరి సరస్సు
5. **వేనాడు :** గ్రామం
6. **తుమ్మల మొన :** సరస్సులోకి చొచ్చుకు వచ్చిన భూభాగాన్ని మొన అంటారు.
7. సొరా తిట్టు
8. నడుందిట్టు
9. **కాలవకట్ట :** పడవలు లంగరు వేసే చోటు
10. గుల్లల తిట్టు
11. చెంచురెడ్డి కాలవ
12. **నడిచెడి :** చెడి అంటే చెట్టు నీడ కోసం ఆగే చోటు
13. **సట్టి తిట్టు :** జాలర్ల మకాం తిట్టులన్నీ కూడా జాలర్లకు, వలస పక్షులకు సేదతీరే చోట్లే
14. **మంగుళి :** వానాకాలంలో ఏర్పడే గుంట
15. ఈసగట్ట కాలవ
16. ఊరుముట్టుకొడ
17. పెనాల తిట్టు
18. గోయింద తిట్టు
19. కిళింజి తిట్టు
20. **ఒడ :** ఒడ అంటే నీరు ప్రవహించే చోటు
21. పిల్లల తిట్టు
22. **గిళిగిడు తిట్టు :** గిళజగిడు అనేది ఒకరకం చెట్టు. దీని కాయలు ఎండినప్పుడు గిలక లాగా శబ్దం చేస్తాయి. ఈ చెట్లు ఉండిన ప్రాంతం.
23. **పిల్లొడ్డు / పుల్లొడ్డు :** పుల్లు అంటే గడ్డి బాగా గడ్డి మొలిచే చోటు
24. వంగాల తిట్టు
25. **ఓల కాలవ :** ఓల అంటే ఈత ఆకు ఈతాకు ఎక్కువగా దొరికిన చోటు
26. **కోళి మొనతర :** కోళి అంటే కోడి
27. బండి రేవు
28. **ఏడా కాలవ :** ఇరకం, వేనాడు అనే రెండు దీవుల నడుమన సరస్సులో సహజంగా ఏర్పడిన కాలువ. ఇది రెండు పడవలు పోయే వెడల్పు ఉంటుంది.
29. **గాబరాతిట్టు :** గాబరా అంటే ఫ్లెమింగో కొంగ
30. వాటంబేడు రేవు
31. **వాటంబేడు పడవ కాలవ :** రేవు నుంచి ఊరి సరిహద్దు వరకూ తవ్వుకొన్న కాలువ. సుమారు 3 కి.మీ. పొడవు ఉంటుంది.
32. వాటంబేడు.

ఆగ్నేయానికి ఆనుకొని ఉన్న తూర్పుదిక్కు

1 **తన్ని పందల్ :** ఇసుకదిబ్బపేరు. తన్ని అంటే మంచినీళ్లు, పందల్ అంటే పందిరి

2. కిళింజి కొడ
3. అరంగత్తు కొడ
4. **అరంగత్తు సేరి :** గ్రామం
5. **ఒర్తి పణమరం :** అంటే ఒంటి తాటిమాను
6. కుంతి మొన :
7. **అరంగత్తు కుప్పం :** జాలర్ల గ్రామం
9. **తాళ కొడ :** తాళ అంటే మొగలి. మొగలి పొదలు ఎక్కువగా ఉండే చోటు
10. **ఆలమరం :** మర్రిమాను అని అర్థం
11. **కోట్ర మొనతర :** కోట్ర కోటహ అంటే గాజు రొయ్య. ఈ రొయ్యలు దొరికే చోటు
12. కల్లు కొడ :

13. కల్లుకొడ మొనతర
14. **పళముంజేరి :** గ్రామం
15. కరుకు మొనతర
16. **పుదు ముంజేరి :** గ్రామం
17. గుండేలు కొడ
18. గుండేలు కొడ గండి
19. **మూను ఆలమరం :** మూడు మఱ్రిమానులు
20. **వెల్లమొన :** వెల్ల అంటే తెలుపు
21. **బొమ్మకల్లు :** మూడు రాతిశిల్పాలు ఉన్న చోటు
22. **రెట్టఎల :** దీనిని రెట్టముల అని కూడా అంటారు.
23. ముల్లుచెడి మొనతర
24. అమాసరెడ్డి కొడ
25. **జోనిగపాళెం :** గ్రామం
26. తానాకొడ
27. **కస్పా :** గ్రామం
28. **చిన్నమ్మ కొట్ట :** కొట్ట అంటే కొట్టం లేదా గుడిసె అని అర్థం
29. **అమ్మగారు కోయిల్ :** కోయిల్ అంటే గుడి
30. కస్పా గండి
31. **కొత్త చేను :** గ్రామం
32. కొత్తచేను గండి
33. **తుమ్మల మొన ఆలమరం :** ఆలమరం అంటే మఱ్రిమాను
34. **మూల :** గ్రామం
35. కట్టకాలు మొనతర
36. పెద్ది కొడ
37. చిన్ని కొడ
38. **తెల్లచెడి మొనతర :** తెల్లచెట్లు ఎక్కువగా ఉండే చోటు
39. కుప్పుత్తు మొనతర
40. **చిన్నికుప్పం/పల్లిపేటుకుప్పం :** జాలర్ల గ్రామం
41. **ఎదాకాలువ :** దీని వివరణ 3వ పేజి 28లో ఉంది.
42. ఉల్లిమొన మొనతర
43. గాబరా తిట్టు
44. **తన్ని కుళి :** అంటే మంచినీళ్ల గుంట
45. **మొనకుప్పం :** జాలర్ల గ్రామం
46. **వడకోడి కుప్పం :** జాలర్ల గ్రామం
47. **ఇరకం :** గ్రామం
48. ఇరకం కొడ :
49. **సుట్టకాడు ఊడు :** ఒకప్పుడు ఇక్కడొక పెద్ద గ్రామం ఉండేది. అగ్నిప్రమాదంలో ఖాళీ అయిపోయింది. సుట్టకాడు ఊడు అంటే కాలిపోయిన ఇళ్లు అని అర్థం.
50. **తంగాసియమ్మ కాలు :** కాలు అంటే కాలువ. తంగాసియమ్మ అనేది పేరు
51. **మాడియా మొన :** మాడియ మనిషిపేరు.
52. వాటంబేడు రేవు
53. వాటంబేడు పడవ కాలవ
54. వాటంబేడు

(ముగింపు వచ్చే సంచికలో)

రచయిత ఫోన్: 9441427977 / 9100931658.

**కవిత**

# లోపలినది

అప్పుడప్పుడు బయటకు రావాలి
తప్పనిసరిగా
ఆయనకు కాఫీ పెట్టుకోవడం చేతకాదని
పిల్లల చదువులకు ఆటంకమని
కనిపించని సంకెళ్ళతో
కలల రెక్కలు విరిగిన పక్షిలా
నాలుగ్గోడల నలుచదరపు పంజరంలో
గుడి గుడి గుంజం తిరుగుతూ
నడక మరచి పోతావెందుకు
మోహాలు వ్యామోహాలు నశించి
ఆనాటి ప్రణయ సుగంధ వీచికలు
మురుగు వాసన కొడుతున్నవేళ
ఒకప్పటి రంగులచిత్రం
వెలసిపోయిన సమయాన
సాహిత్య సమావేశాలకో
కవితల పండగలకో
ఆహ్వానం వచ్చినపుడు
రెక్కలు కట్టుకొని ఎగిరివెళ్ళు
కళలవీణ నొక్కసారి సవరించు
సమావేశమంటే సంభాషణే గదా
అమ్మానాన్నల దగ్గర చెప్పుకోలేనివి
కట్టుకొన్న వాడి దగ్గర పెదవి  విప్పలేనివి
మిత్రుల దగ్గర ఆవిష్కరించవచ్చు
జ్ఞాపకాల వీధిలో సంచరిస్తూ
చిన్ననాటి స్మృతుల
పున్నాగపూలను ఏరుకొంటున్నపుడు
లోపల గడ్డకట్టిన నది
నెమ్మదినెమ్మదిగా కరుగుతూ
గలగలా ప్రవహిస్తున్న చప్పుడు

**- మందరపు హైమవతి**
**ఫోన్: 9441062732**

పెద్దల మాట

# మన భాషలకోసం మనం ఉద్యమించాలి

## ప్రొఫెసర్ బాలచంద్ర నెమడే, జ్ఞానపీఠ పురస్కార (2014) గ్రహీత

పద్మశ్రీతోపాటు అత్యున్నత సాహితీ పురస్కారమైన జ్ఞానపీఠ పురస్కారాన్ని 2014లో పొందిన ప్రొఫెసర్ బాలచంద్ర నెమడే 1960లో తన రచనలతో మరాఠీ సాహిత్యపు దిశను మళ్లించిన విఖ్యాత మరాఠీ సాహితీవేత్త, ఆంగ్ల వారపత్రిక ఆర్గనైజర్ ప్రతినిధి జరిపిన ముఖాముఖి సారాంశం:

*ప్ర: పాత విద్యావిధానం, క్రొత్త విద్యావిధానాల్లో మీకు అత్యంత బాధాకరమైన అంశమేమిటి? మరోరకంగా అడగాలంటే తన మనవడి చదువు విషయంలో ఒక తాతగారిని అన్నిటికన్నా ఎక్కువగా బాధించేది ఏమిటి?*

ఇంగ్లీషును మితిమీరి వాడటమే నాకు అన్నిటికన్నా ఎక్కువబాధ కలిగిస్తున్నది. నా మనవళ్లు మనవరాళ్లు మాత్రం మరాఠీ మాధ్యమ పాఠశాలల్లోనే చదువుతున్నారు. అన్నిరకాల బోధనాంశాలను మరాఠీలోనే (మాతృభాషలేదా ప్రాంతీయభాషలోనే) బోధించాలని నేను ప్రత్యేకంగా కోరుకుంటున్నాను. ఒక బోధనాంశంగా ఇంగ్లీషును ఐదో తరగతి నుంచి బోధించవచ్చును. ఇలాంటి వ్యవస్థలో చదివే విద్యార్థులు ఇంగ్లీషు మాధ్యమంలో చదివే విద్యార్థులకంటె కూడా ఇంగ్లీషులో రాణించే అవకాశాలు మిన్న.

*ప్ర: ఆకలైనప్పుడు ఏ భాషలో అన్నం అడుగుతావో, గాయపడినప్పుడు ఏ భాషలో ఏడుస్తావో, నిద్రలో ఏ భాషలో కలలు కంటావో ఆ భాషలో ఆలోచిస్తేనే పురోగమిస్తావు అనే సూక్తిలో నిజమెంత?*

ఇది సంపూర్ణంగా యథార్థం. ఇదే మానవచరిత్రగా వుంటూ వచ్చింది. ఇతరుల క్రింద బానిసత్వానికిలోనైన దేశాల్లో మాత్రమే విదేశీభాష బోధనా మాధ్యమంగా వుంది. చైనా, జపాన్, ఐరోపా దేశాల్లో బోధనా మాధ్యమంగా విదేశీ భాషలు లేవు. అలాంటప్పుడు మనం ఇంగ్లీషును వినియోగించటమెందుకు? కాని దేశమంతటా ఇదే జరుగుతున్నది.

*ప్ర: ఇంగ్లీషులో మాట్లాడటం, ఇంగ్లీషులో ఆలోచించడం గొప్పగా భావిస్తుంటారు. మంచి ఆలోచనలపై ఇంగ్లీషు భాషకే గుత్తాధిపత్యం*



*వున్నదని మీరు నమ్ముతున్నారా? లేక భారతీయ మనస్తత్వమే ఈ ధోరణిలో పెంపొందిందా?*

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ రకమైన భావనను సృష్టించారు. మంచి ఆలోచనలు ఇంగ్లీషు భాష గుత్త సొమ్ముగా భావించటం పూర్తిగా తప్పు అని నా అభిప్రాయం. మా చిన్నతనంలోనే ఇంగ్లీషు వైపు కొంత మొగ్గు కనిపిస్తుండేది. నా మనవళ్ల రోజుల్లో ఇది మరింత విస్పష్టంగాను, విపరీతంగాను వుంది.

*ప్ర: ఇలా పెరిగిపోతున్న ఇంగ్లీషు ప్రభావం ఎటు దారితీస్తుంది? దీని వల్ల ముప్పు ఏమైనా వున్నదా?*

ఇది చాలా ప్రమాదకరమైనది. దురాక్రమణశీలమైనదీను. ఈనాడు పెరిగిపోయి విభిన్న భాషలు, పలుకుబడుల అస్తిత్వానికే పెనుముప్పుగా తయారైంది. ఆస్ట్రేలియాలో 600పైగా భాషలుండేవి. కాని ఇప్పుడు 30-35 భాషలు మాత్రమే బ్రతికి వున్నాయి. రానున్న 50 సంవత్సరాల్లో ఇవికూడా అంతర్ధానం కావచ్చునేమో! ఇంగ్లండులో ఒక శతాబ్దం క్రిందట 6-7 భాషలువుండేవి. ఈ భాషలన్నిటినీ ఇంగ్లీషు నాశనం చేసింది. ఈ రోజున స్కాటిష్, జెల్లిక్, మాంక్స్, సెల్టిక్ మాట్లాడేవారు ఎవరూ లేరు. కొందరు వెల్ష్ భాషను మాత్రం బ్రతికించుకున్నారు. ఈసమస్యకు ఏదైనా పరిష్కారం మాతృభాషే కనుక మనం ఇంగ్లీషుకు బదులు మాతృభాషనే ఉపయోగించాలి. ఐరిష్‌వాళ్ళు ఐరిష్ భాషను వాడటం మొదలు పెట్టారు. అమెరికా, కెనడాలలో 200 భాషలుండేవి. వాటిలో 38 మాత్రమే ఇప్పుడు బ్రతికి వున్నాయి. భారత్‌కు కూడా ఇదే పరిస్థితి దాపురించేలా వుంది. కనుక, ఈ దృష్టితో చూసినప్పుడు ఇంగ్లీషు ప్రమాదకరమైనది. భారత్‌లో వివిధ ప్రాంతాలవారు తమ తమ భాషలకు మద్దతుగా ఉద్యమించి తీరాల్సిందే.

*ప్ర: మీరనన్నట్లే ఇంగ్లీషుకు ఒక రాక్షస ప్రవృత్తి వున్నది. ఆస్ట్రేలియాలో 300 జనజాతుల భాషా రూపాలను అది స్వాహా చేసింది. అదేవిధంగా మన ఈశాన్య ప్రాంతంలో ప్రత్యేకమైన సంప్రదాయాలు, సంస్కృతి, వేషధారణా పద్ధతి వున్న ఎన్నో జనజాతులవారున్నారు. వారికి బైబిల్ మతగ్రంథంతోపాటు ఇంగ్లీషు బోధించడంతో అది వారి సంప్రదాయాలనుంచి వారిని వేరుచేసింది. దీనిపై మీ అభిప్రాయం?*

ఈశాన్య రాష్ట్రాల ప్రజలకు వారి మాతృభాషలోనే విద్యాబోధన జరపాలని నేను చాలాసార్లు చెప్పాను. మతవిశ్వాసం మార్పుతోబాటు ఇంగ్లీషుకు మార్చటాన్ని ఆపాలి. సేవ ముసుగులో ప్రజలను మతం మార్చేవారిని అడ్డుకోవాలి. ఇవి రెండూ కలిసి సాగలేవు.

*ప్ర: ఇంతటి వైవిధ్యతవున్న భారత్ వంటి దేశంలో ఒకే బోధనామాధ్యమం, ఒకే పాఠ్యాంశ ప్రణాళిక వుండాలనిమీరు భావిస్తున్నారా?*

ఆయా ప్రాంతాల అవసరాలకను

గుణంగా పాఠ్యాంశ ప్రణాళిక వుండాలని నా అభిప్రాయం. మీరు గోవాలో వుండే వారైతే పోర్చుగీసు వాళ్లు చేసినదేమిటో మీరు తెలుసుకోవాలి. మీరు ఉత్తర భారత వాసులైతే మంగోలుల గురించి తెలుసుకోవాలి. పోర్చుగీసువారు ఎలా వచ్చారు. గోవా ప్రజలను ఎలా మతం మార్చారు- ఇదంతా మీరు తెలుసుకొని తీరాలి. అదేవిధంగా ఆయా రాష్ట్రాల చరిత్ర, భూగోళ శాస్త్రాలను అక్కడి పాఠ్యాంశ ప్రణాళికల్లో పొందుపరచాలి. అలాగాక అనవసరమైన వాటిని బోధిస్తున్నారు. ఉదాహరణకు బ్రిటన్‌లో పార్లమెంటు ఎలా పనిచేస్తుంది. హిట్లరు ఏమి చేశాడు వగైరా వగైరా బోధిస్తున్నారు. ఇవేవీ మనకు పనికి వచ్చేవికావు. ఈ దేశపు మహాపురుషులు ఏమిచేశారో మన విద్యార్థులకు బోధించాలి.

ప్ర: కొందరు విద్యావేత్తలు పాశ్చాత్య ప్రపంచం చేత ప్రభావితులైన కారణంగా బుద్ధిపూర్వకంగా మన చరిత్రను పనికి మాలినదిగా చూపించి దానిని అప్రదిష్ఠపాలుచేశారని మన వ్యవస్థలో ఒక న్యూనతాభావాన్ని వారు చొప్పించారని ఒక అభిప్రాయంవుంది. దీనిని మీరు నమ్ముతారా?

వాస్తవమేమిటంటే ప్రాథమిక స్థాయినుంచి ఉన్నత స్థాయివరకు బోధించే చరిత్ర యావత్తు అబద్ధాలపుట్టే. ఆ చరిత్రలో అవగింజంతైనా సత్యం లేదు. ఆ చరిత్రకు సంబంధించిన మూలాధారాలన్నీ పరాయివారివే కావటమో, లేదా అవి వ్రాయబడిన భాషయొక్క పరిజ్ఞానం లేకపోవటమో దీనికి కారణం. కనుకనే మనకున్న చరిత్ర తప్పులకుప్పగా వుంది. దీనినే బోధిస్తున్నారు.

*ప్ర: ఈ విషయంలో రాజకీయ సంకల్పం లోపించిందని అనుకుంటున్నారా?*

అవును. మన రాజకీయ సంకల్పలోపం విపరీతంగా వుంది. ఒక భాషను జాతీయ భాషగా చేయలేకపోవడమే ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు. సంస్కృతభాష అంతర్ధానమయ్యే పరిస్థితిలో వుంది. దాని స్థానంలో మరో జాతీయ భాషను మనం తీసుకురాలేదు. అందుకే ఇంగ్లీషు భాషా, దానిమీద మన పరాధీనతా- పెరిగి పోతున్నాయి. మన ప్రధాన వైఫల్యం ఇదే.

ప్ర: ఈ దుర్దశకు మూలమేమిటని చూసినప్పుడు మీ దృష్టిలో ఆక్రమణదారులెవరు?

మన చరిత్రను పరిశీలిస్తే దండయాత్రలు జరిగినట్లు గమనిస్తాం. గ్రీకులు, శకులు, హూణులు, పోర్చుగీసులు, మొఘలులు, ఇంగ్లీషువారు-అందూ దురాక్రమణదారులే. వీరిలో అత్యధికులు సమాజాన్ని విభజించి ప్రజలను అయోమయంలోకి నెట్టినవారే. బ్రిటీషువారైతే మన సమాజానికి చేయగలిగినంత చెరుపుచేశారు. వారు ప్రజానీకాన్ని కులాల ప్రాతిపదికన చీల్చారు. అంతకుముందు ముస్లింలు కూడా ప్రజలలో వృత్తిపరంగా వ్యవహరించేవారే తప్ప మత పరంగా కాదు. అదే మనలను ఒకటిగా వుంచింది.

*ప్ర: మాతృభాష ద్వారానే ప్రాథమిక విద్యాబోధన చేయాలని ఆర్.ఎస్.ఎస్. అఖిల భారతీయ ప్రతినిధి సభ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. దీనిపై మీ అభిప్రాయం ఏమిటి?*

ఇది స్వాగతించదగిన చర్య. ఈ తీర్మానానికిగాను ఆర్.ఎస్.ఎస్.ను పూర్తిగా సమర్థిస్తున్నాను. వీలైతే - ఇది నా పని కాకున్నా- దీనికి అనుకూలంగా ప్రచారం చేస్తాను. ఈ తీర్మానాన్ని అన్నిచోట్లా అమలు చేయాలి. దీనితో యువతరం మేధ ప్రక్షాళితమై దేశం కాపాడబడుతుంది.

**– 'జాగృతి' సౌజన్యంతో**

## ఇవీ ముచ్చట్లు...




చాలా హోటల్స్‌లో ప్లేట్‌మీల్, ఫుల్‌మీల్ అంటూ వాటి ధరలు 'ప్లేట్‌మీల్' అంటే "మీరు తిన్నంత" - అని గరికిపాటి నరసింహారావుగారు 'ఈటీవీ' వారి 'తెలుగువెలుగు' కార్యక్రమంలో చెప్పారు. తెలుగు భాషా ప్రియుడైన ఒక హోటల్ యజమాని ఆ మాటల్ని చెప్పినట్లు ఒక పద్యంలో వాటిని భాగం చేసి, అందరికీ తెలిసేట్లు గరికిపాటివారు తమదైన జనామోద పాండిత్య ప్రతిభతో చెప్పారు.

తెలుగు భాషాప్రియులకు ఆ మాటల్ని చూడగానే కొంత చిరాకు వేస్తుంటుంది. వాటికి తెలుగు మాటలు పెట్టొచ్చుకదా అంటారు. ఆ మాటల్లే కనీసం తెలుగులిపిలో వ్రాస్తే అంతటితో సరిపెట్టుకొంటారు, పాపం! వాటిని తెలుగులో ఎలా చెప్పాలో అర్థంకానందువల్ల. ఇలాంటి చిక్కు నాకు తారస పడుతుంటుంది. ఫిబ్రవరి 26 ఆదివారం 'తెలుగు వెలుగు' (ఈటీవి) చూడడంతో ఈ చిక్కుముడి వీడిపోయింది.

ఇక్కడ తెలుసుకోవలసిన సంగతేమిటంటే - ఇంగ్లీష్‌లోంచిగాని, ఇతర భాషల్లోంచిగాని వచ్చిపడుతున్న మాటల్ని తెలుగు చేసుకోవలసినతీరు ఇదీ అని. నోరు తిరగని, అక్కరలేని సంస్కృతం మాటలకోసం వెతక్కుండా మంచి తెలుగులో ఆ మాటల్ని ఎలా తెచ్చుకోవాలో ఎంత చక్కగా చెప్పారో చూడండి.

ఫ్లైఓవర్లు ఇప్పుడు ప్రతిచోటా వెలుస్తున్నాయి. రాకపోకల అక్కర దినదినానికీ పెరిగిపోతుండడంతో వాగుల్నీ, వంకల్నీ, రైలుపట్టాల్నీ, జనంతాకిడిని తట్టుకోవటానికి ఇప్పుడీ ఫ్లైఓవర్లు అవసరమవుతున్నాయి. దీన్ని పై వంతెన అనో పైదారి అనో తేలిగ్గా అనవచ్చు అని కొందరు అంటున్నారు. బాగుందికదూ!

- శ్రీమతి డి.పి. అనూరాధ

# అమరావతి శిల్పం అజరామరం.. అనన్య సామాన్యం..

"అమరావతి శిల్పకళ జాతి, దేశ, కాల, పాత్ర అవధులను అతిక్రమించి విస్తరించింది.. క్రైస్తవ శకోదయ కాలంలో కృష్ణానదీ తీరాన ఉద్భవించిన ఈ మహా శిల్పకళ 2 వేల ఏళ్ల కిందట ఆసియా ఖండాన్నంతా విమోహిత పరచి ఉర్రూతలూగించునట్టుగానే ఈనాటికీ మనని ఆకర్షించి తన ప్రభావంతో మనలను ముంచెత్తుతుంది" అని నార్ల వెంకటేశ్వరరావు ఈ శిల్పం గొప్పతనం విశ్లేషించారు..

అంగ్‌కార్ వాట్.. ప్రపంచంలోనే అతి పెద్ద హిందూ దేవాలయం.. కాంబోడియాలోని ఈ ఆలయంలో అణువణువూ అద్భుతంగా ఉంటుంది.. రాళ్లతో ఆకాశానికి నిచ్చెన వేసినట్టు ఉంటుంది ఈ ఆలయ నిర్మాణం.. అంగ్‌కార్ వాట్‌లోని ప్రతి శిల్పానికీ ప్రేరణ మన తెలుగు నేలే..

బొరబొదూర్.. ప్రపంచంలో అతి పెద్ద రాతి బౌద్ధ స్థూపం.. ఇండోనేషియాలో ఉన్న బొరబొదూర్ వింతల్లోకెల్లా వింత.. రాతి కొండనంతా తొలచి ఈ అద్భుతాన్ని ఇలపై నిలిపారు.. ఈ స్థూప నిర్మాణానికి ప్రేరణ కూడా మన తెలుగు నేలే..

తెలుగు రాష్ట్రాల నుంచి కాంబోడియా... ఇండోనేషియా చాలా దూరంలో ఉన్నాయి.. కానీ మనకూ ఈ ప్రపంచ వింతలకూ ఏమిటీ సంబంధం? అంగ్‌కార్ వాట్‌ను 12 వ శతాబ్దిలో కట్టారు. ఈ శిల్పాన్నీ.. చెక్కిన తీరునీ.. ఇందులో పోతపోసుకున్న భావననీ చూస్తే అమరావతి శిల్పం మాదిరిగానే ఉంటుంది.. ఇంకా చెప్పాలంటే అమరావతి శిల్పానికి విస్తృతరూపం అంగ్‌కార్ వాట్..

బొరబొదూర్ స్థూపాన్ని 9 వ శతాబ్దిలో నిర్మించారు.. దీని నిర్మాణానికి ప్రేరణ అమరావతి స్థూపం..అంతేకాదు బొరబొదూర్ స్థూపంలో బుద్ధుడి శిల్పాలు 432 ఉన్నాయి.. బుద్ధుడికి సంబంధించిన కథలు ఉన్న శిల్పఫలకాలు 120 ఉంటే సుధనుడికి సంబంధించిన కథల శిల్పఫలకాలు 460 ఉన్నాయి.. ఈ సుధనుడు ఎవరు? ఎక్కడివాడు? సుధనుడు ధాన్యకటకం అంటే నేటి అమరావతికి చెందిన వ్యాపారి కొడుకు..

ఇలా మన ఖ్యాతిని ఖండాంతరాలు దాటేలా చేసిన ఘనత అమరావతి స్థూపానికి..

**పూర్తి దేశీయం..**

అది క్రీస్తు పూర్వం 5వ శతాబ్దం..అప్పటికి మన దేశంలో అన్నీ చిన్న చిన్న రాజ్యాలే ఉండేవి.. మౌర్యుల కాలంలో బౌద్ధం దేశమంతా విస్తరించింది. ఆకాలంలోనే అమరావతి స్థూపం రూపుదిద్దుకుంది. అప్పట్లో ఇక్కడ యక్షులు..నాగజాతి వారు నివసించేవారట.. చైత్య నిర్మాణాల్లో వారిది అందెవేసిన చేయి..

ఆ తరవాత అశోకుడు ఇక్కడి బౌద్ధ చైత్యానికి రాతి ప్రాకారం నిర్మించాడు.. క్రీస్తు పూర్వం రెండో శతాబ్దిలో అమరావతి స్థూపంపై



శిల్పఫలకాలు వెలిశాయి.. ఇవన్నీ బుద్ధుడి జీవితగాథలతో కూడిన శిల్పఫలకాలు.. బుద్ధుడి ఆకృతి ఎక్కడా కన్పించదు..

ఆనాడు దేశంలో ఉన్న ఏకైక రాతి కట్టడం మధ్యప్రదేశ్‌లోని సాంచి.. దీనిని అశోకుడు నిర్మించాడు.. కానీ ఎటువంటి శిల్పఫలకాలు ఇక్కడ లేవు..అంటే దేశంలో శిల్పం అంటే ఏమిటో తెలియని కాలం అది.. అటువంటి కాలంలో అమరావతిలో శిల్పాలు వెలశాయి.. మనవాళ్లు శిలలపై శిల్పాలు చెక్కి సృష్టికే అందాలు తెచ్చారు.. ఆ శిల్పులు ఎవరు? వారికి ఈ కళ ఎలా అబ్బింది?

ఆ తరవాత వందేళ్లకు అంటే క్రీస్తు శకం 1వ శతాబ్దిలో గాంధార శిల్పానికి అంకురార్ఫణ జరిగింది.. ఆ ప్రదేశం మధ్యప్రదేశ్‌లోని బార్హుత్.. శిల్పశాస్త్రపరంగా చూస్తే భారతదేశం మొత్తంలో రెండే శిల్ప విభాగాలు ఉన్నాయి.. ఒకటి గాంధార.. రెండోది అమరావతి.. గాంధార శిల్పంలో విదేశీ ప్రభావం ఎక్కువగా ఉంటుంది.. కానీ అమరావతి పూర్తి దేశీయం.. అయితే అమరావతి శిల్ప సౌందర్యాన్ని పూర్తిగా ఆస్వాదించాలంటే లండన్ వెళ్లాలి.. లేదంటే చెన్నై వెళ్లాలి.. లేకపోతే కోల్‌కతా వెళ్లాలి..

ఎందుకంటే అద్భుతమైన అమరావతి శిల్పాల్ని బ్రిటీష్‌వాళ్లు లండన్‌కు తరలించి అక్కడి మ్యూజియంలో భద్రపరచారు. మిగిలిన కొన్ని శిల్ప ఫలకాలు చెన్నైలోని ఎగ్మోర్ మ్యూజియంలో .. కోల్‌కతా లోని ఇండియన్ మ్యూజియంలో ఉన్నాయి.. అక్కడికీ.. ఇక్కడికీ తరలించగా మిగిలినవి.. ఓ వెూస్తరు శిల్పాలు అమరావతి మ్యూజియంలో మిగిలాయి..

రాజులు పోయారు.. రాజ్యాలు పోయాయి.. శిల్పాలులూ పోయారు.. కానీ శిల్పాలు మాత్రమే మిగిలాయి.. వాటిని పరీక్షిస్తే పూర్తిగా మనసు పెట్టి చూస్తే ఆనాటి కథలు ఒక్కోటీ కళ్ల ముందుకు వస్తాయి.. వాటిని చదివితే మన పూర్వీకులు ఎంత గొప్పవారో.. మన తెలుగు



నేల ఎంత గొప్పదో అర్థం అవుతుంది..

**దాదాపు 100 అడుగుల ఎత్తు**

అమరావతి.. గుంటూరు జిల్లాలో ఓ గ్రామం.. బౌద్ధవాఙ్మయంలో ఆంధ్రపురిగా ప్రసిద్ధిచెందింది.. ధాన్యకటకం.. దీపాలదిన్నె అని వేరే పేర్లు కూడా ఉన్నాయి.. ప్రపంచ ప్రసిద్ధిచెందిన స్థూపం ఇక్కడే ఉంది.. ఇక్కడే 2006లో దలైలామా కాలచక్ర పూజలు నిర్వహించారు..

నేడు నిశ్శబ్దంగా.. నిస్తేజంగా.. నిర్జీవంగా కన్పించే అమరావతి స్థూపం సామాన్యమైంది కాదు.. చారిత్రక అధ్యయనాలను బట్టి ఈ స్థూపం ఎత్తు 90 నుంచి 100 అడుగులు.. అండం చుట్టుకొలత 435 అడుగులు.. నేల నుంచి ఉపరితల ప్రదక్షిణాపథం 20 అడుగుట ఎత్తు.. ఈ ప్రదక్షిణాపథానికి రాతికంచె ఉండేది..

స్థూపం చుట్టూ నాలుగు వైపులా సింహద్వారాలు.. పోర్టికోలు ఉండేవి.. స్థూపంపై పాలరాతి శిల్పఫలకాలు.. ఒకటి కాదు రెండు కాదు వందల కొద్దీ ఉండేవి.. అమరావతి పరిసరాల్లో పాలరాయే లేదు.. మరి శిల్పాలకు అనువైన పాలరాతిని ఎక్కడి నుంచి తెచ్చారు. అమరావతికి దాదాపు 70 కిలోమీటర్ల దూరంలో ఉన్న జగ్గయ్యపేట చుట్టూ పాలరాతి కొండలు ఉండేవి. అక్కడ రాళ్లను తొలచి బళ్లమీద అమరావతికి తరలించారని అంచనా.. ఈ రాళ్లను చదునుచేసి, పలకలు కోసి.. స్కెచ్‌గీసుకుని ఉండాలి.. బౌద్ధ భాణకులు బుద్ధుడి జీవితాన్ని కళ్లకు కట్టినట్టు కథలు కథలుగా చెబుతుంటే శిల్పులు చకచకా రాళ్లల్లో కథలను రాసేవారు..

**మూడు పరిణామ దశలు**

అమరావతి శిల్ప పరిణామ క్రమంలో మూడు దశలు స్పష్టంగా కన్పిస్తాయి.. మొదటి దశలో త్రిరత్న, స్థూపం, వృక్ష తదితర శిల్పాలు మాత్రమే ఉన్నాయి.. బార్హుత్ కంటే ముందుగానే అమరావతిలో శిల్పకళాసృష్టి ప్రారంభమై ఉంటుందని ఈ శిల్పాలను పరీక్షించిన భారతీయ పురాత్వ శాఖ మాజీ అధ్యక్షుడు ఎన్ ఘోష్ తేల్చిచెప్పారు..

క్రీస్తు పూర్వం 2 వ శతాబ్ది నుంచి క్రీస్తు శకం 1 వ శతాబ్ది మధ్యకాలం రెండో దశ.. ఈ దశలో కూడా బుద్ధుడి విగ్రహాలు తీర్చిదిద్దలేదు.. బుద్ధుడికి ప్రతీకలుగా సింహాసనం, బోధివృక్షం , ధర్మచక్రం, త్రిరత్నాలు, బుద్ధపాదాల ఆరాధన ప్రారంభమైంది. వేదిక చుట్టూ శిల్పఫలకాలను అలంకరించారు. శిల్పాలలో సహజత్వం ఉట్టిపడుతుంది.. శిల్పాలే మాట్లాడుతున్న భావం కలుగుతుంది.

ఇక మూడోది శాతవాహన రాజుల కాలం. క్రీస్తు శకం 1 వ శతాబ్ది మధ్యకాలం నుంచి క్రీస్తు శకం 3 వరకూ ఇది సాగింది. అమరావతి చైత్య శిల్పకళ మహోన్నత స్థాయి ఇదే.. ఆచార్య నాగార్జునుడు చైత్యాన్ని పునరుద్ధరించి, అభివృద్ధిపరచి, అందమైన శిల్పాలతో ప్రాకారాన్ని తిరిగి నిర్మించాడు..

అప్పుడే మహాయానం రూపుదిద్దుకోవడంతో బుద్ధుడు మహాదేవుడైనాడు.. ప్రతి జాతక కథ ఒక దృశ్యకావ్యంగా శిల్పంపై రూపుదిద్దుకుంది.. ఈ కథలలోని పాత్రలు నటించాయి.. శరీరం ఎన్ని వంపులు తిరగగలదో అన్ని వంపులు అమరావతి శిల్పాల్లో కన్పిస్తాయి.. ఈ భంగిమల ద్వారా శిల్పాల్లో చైతన్యం మూర్తీభవిస్తుంది.. శిల్పంలో వివిధ భావాలు స్పష్టంగా కన్పిస్తాయి.. ఫలకాల మీద ముఖ్యమైన అంశాన్ని ఎత్తి చూపుతూ మిగతావి చుట్టూ పరచారు.. ప్రస్తుతం 3డి సినిమాల హవా నడుస్తోంది.. కానీ అమరావతి శిల్పాలలో 4డి సృష్టించారు.. మనుషులు, జంతువులు, వస్తువులూ సందర్భాన్ని బట్టి వెనక్కి తిరిగి ఉన్నట్టు చెక్కి వాటిలో ఫోర్త్ డైమెన్షన్ చూపెట్టారు.. అంతేకాదు ఈ శిల్పాల్లో ఏనిమేషన్ వంటిది కూడా కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది.. ఒక్క అంగుళ స్థలం కూడా ఖాళీగా వదలకుండా శిల్పాలను చెక్కేశారు..

ఇవన్నీ తెలుగు శిల్పి సాహసాలు.. వారికి సున్నపురాయి కాగితంలా కన్పించిందేమో? పెయింట్ వేసినట్టుగా శిల్పాలను చెక్కారు.. కొయ్య.. మట్టి.. సుద్ధ.. దంతాలపైనా బొమ్మలు చెక్కగల నిపుణులుగా ఈ శిల్పులు కన్పిస్తున్నారు.. అందుకే కరకురాయి కూడా వారికి మెత్తటి కాన్వాస్‌లా కన్పించింది..

మేలిముత్యాలు.. హిమబిందువులు.. పసిపాపల బోసినవ్వుల్లా ఈ అమరావతి శిల్పుల కళ స్వచ్ఛమైంది.. సాటిలేనిది.. సహజమైంది. జేమ్స్ ఫెర్గుసన్ మాటల్లో చెప్పాలంటే భారతీయ శిల్పంలో సంపూర్ణ పరిణతి చెందిన శిల్పకళ అమరావతి శిల్పకళ..

ఆదుర్రు.. చందవరం.. రామతీర్థం.. గోలి.. ఘంటశాల.. జగ్గయ్యపేట.. నాగార్జునకొండ.. ఫణిగిరి ఇలా ఎన్నో ప్రదేశాల్లో ఈ అమరావతి శిల్ప ఆనవాళ్లు కన్పిస్తూనే ఉన్నాయి..మధ్యప్రదేశ్‌లోని సాంచి స్థూప ద్వారతోరణాలు.. మహారాష్ట్రలోని అజంతా, కార్లె, కాన్హేరీ, నాసిక్ రాతి గుహల్లోని శిల్పం అమరావతినే పోలి ఉంటుంది. శాతవాహనులు పరిపాలించిన ప్రతి చోటా ఇదే శిల్పం కన్పిస్తుంది.

ఇక్ష్వాకు.. పల్లవ.. చాళుక్యాది దాక్షిణాత్య శిల్పాలకు ఇదే ఒరవడైంది..

అయిహోళి.. బాదామి.. పట్టడకల్.. మహాబలిపురంలలోని శిల్పాలు ఈ అమరావతి శిల్ప ప్రభావానికి లోనై నీరాజనాలర్పించాయి.. ఆనాడు తెలుగు నేల నౌకావాణిజ్యంలో ముందుండేది.. అందుకే ఆంగ్‌కార్ వాట్.. బొరబొదూర్‌లపై కూడా అమరావతి శిల్ప ప్రభావం పడింది.

**ఫోన్: 8096999177**

# భాషామాధ్యమం - ఆచరణాత్మక దృక్పథం

ప్రజాతంత్ర ఉపాధ్యాయ సమాఖ్య (డి.టి.ఎఫ్), ఆంధ్రప్రదేశ్ 4వ రాష్ట్ర విద్య, వైజ్ఞానిక మహాసభల్లో
(ది.3-2-215 గుంటూరు తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షులు
డా॥ సామల రమేష్ బాబు ఉపన్యాసం).






ప్రజాతంత్ర ఉపాధ్యాయ సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ 4వ రాష్ట్ర విద్య, వైజ్ఞానిక మహాసభల్లో ప్రసంగించవలసిందిగా నన్ను ఆహ్వానించిన నిర్వాహకులకు కృతజ్ఞతలు. వామపక్ష ఉద్యమ సంఘాలలో ఉపాధ్యాయ రంగానికి సంబంధించి డిటిఎఫ్ (ప్రజాతంత్ర ఉపాధ్యాయ సమాఖ్య) చేస్తున్న కృషి ఎంతో అభినందనీయంగా వుంది. ఈ మహాసభలలో మాతృభాష సంరక్షణ విషయమై ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నందుకు చాలా సంతోషంగా వుంది.

“భాషామాధ్యమం-ఆచరణాత్మక దృక్పథం” అనే అంశం మీద నన్ను మాట్లాడమని మీరు కోరారు. ఆ అంశంలోకి నేరుగా వెళ్ళేముందు కొంత ఇటీవలి చరిత్రలోకి చూపు సారించాల్సిన అవసరం వుంది. భాషాప్రాతిపదికన రాష్ట్రాలు ఏర్పడాలని స్వాతంత్ర్య దినోత్సవ కాలంలోనే పలువురు ఉద్యమించారు. మార్క్సిస్టు భావజాలంలో వున్నవారు ఇతర సోషలిస్టు వర్గాలు కూడా పలు భాషాజాతీయుల సమాఖ్యగానే మన సమాజాన్ని చూశారు. భారత జాతీయ కాంగ్రెస్ ఈ విషయంలో తీర్మానం చేసింది కూడా. అప్పుడు స్వాతంత్ర్యం సాధించడమే ప్రథమ కర్తవ్యమని, దేశం స్వతంత్రమైన తరువాత భాషాప్రాతిపదికన రాష్ట్రాలు ఏర్పడాలని తీర్మానించింది. కానీ రాజ్యాంగం ఏర్పడిన తరువాత కూడా ఉద్యమాలు చేసి గానీ భాషాప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటుచేసుకోలేని పరిస్థితి వచ్చింది. ఆంధ్రరాష్ట్రం భాషాప్రాతిపదికన ఏర్పడిన మొట్టమొదటి రాష్ట్రంగా చెప్తూ వుంటాం మనం. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన కొద్దికాలానికే నిజాం రాజ్యంలోని తెలుగుప్రాంతమైన తెలంగాణని, ఆంధ్రరాష్ట్రాన్ని కలిపి ఆంధ్రప్రదేశ్‌గా చేశారు. ఈ కలయికకు ప్రాతిపదిక ఒకే భాషీయులమనే సూత్రమే. భారతదేశం పలు భాషాజాతుల సంగమంగా వుంది. ఇక్కడ రాజకీయాలను కూడా భాష శాసిస్తుంది. ఇక్కడ భాష కేవలం ఇద్దరు వ్యక్తుల మధ్య, రెండు సమూహాల మధ్య సంబంధాలను ఏర్పరచేది మాత్రమే గాక, రాజకీయమైన రాగద్వేషాలకు ఇది ప్రధానమైన కారణం కూడా అయింది. అయితే ప్రాంతీయమైన అస్థిత్వపోరాటాలు భాషాజాతుల వాస్తవ రేఖలను దాటి ఇతర రాజకీయాంశాల సాధనే ప్రధానంగా చేసుకుని సాగిన సందర్భాలున్నాయి. ఆంధ్రరాష్ట్ర ఏర్పాటు వెనుక ఈ లక్షణం వుంది. సంయుక్త మద్రాసు రాష్ట్రంలో వుండగా కూడా ఆ రాష్ట్రాన్ని తెలుగు ముఖ్యమంత్రులే పరిపాలించారు. వారు అగరం సుబ్బరాయలురెడ్డి (1920-21), పానగల్లు రాజా (1921-26), డాక్టర్ పి. సుబ్బరాయన్ (1926-30), బొల్లిని మునిస్వామినాయుడు (1930-32), బొబ్బిలి రాజా (1932-37), కూర్మా వెంకటరెడ్డి (1937), టంగుటూరి ప్రకాశం (1946-47), ఓమండూరు రామస్వామిరెడ్డి (1947-49), పి.ఎస్.కుమారస్వామిరాజా (1949-52), సి.రాజగోపాలాచారి (1952-54).

ప్రత్యేక తెలుగురాష్ట్రం కోసం ఆనాడు పోరాడిన నాయకులకు ఈ సంగతులు తెలియవని కాదు. స్థానిక నేతలతో పోటీపడి తాము ఎన్నటికీ అధికారంలోనికి రాలేమేమోనని తలచిన ఆంధ్రప్రాంతపు మేధావులు ప్రారంభించిన ఉద్యమం చివరకు ఆంధ్రరాష్ట్ర ఏర్పాటుకు దారితీసింది. దానితో మిగిలిన రాష్ట్రం తమిళ భాషారాజకీయాలలోకి కూరుకుపోయి అక్కడి అసంఖ్యాక తెలుగు ప్రజలు భాషాపరమైన అణచివేతకు గురి కావలసివచ్చింది.

మొత్తం తెలుగుజాతికి బలమైన స్థావరంగా తయారుకాగలదనుకున్న ఆంధ్రప్రదేశ్‌ను పరిపాలించిన నాయకులు తమ స్వార్థ ప్రయోజనాల కోసమే అధికారపీఠాల్ని ఆక్రమించారు తప్ప, తెలుగుజాతి భాషా సంస్కృతుల రక్షణ కోసం ఎన్నడూ చిత్తశుద్ధితో

ఆలోచించలేదు. శతాబ్దాలుగా విభిన్న పరిపాలకుల కింద నలిగిన ప్రాంతాలు తెలుగుభాష పేరున రాజకీయంగా ఒక్కటైనప్పుడు వారిమధ్య వున్న వైవిధ్యాంశాలను సమీక్షించి వారిమధ్య ఐక్యతాభావాన్ని, సంబంధాలను పెంపొందించే ప్రయత్నం ఏనాడూ చేయకపోగా విభజించి పాలించే సూత్రాన్నే వాళ్ళు అవలంబించారు. దాని ఫలితంగా రాష్ట్రం మళ్ళీ రెండుగా విడిపోయింది. ఆంధ్రప్రదేశ్ సంయుక్తంగా వున్న కాలంలో పరిపాలనలో, విద్యారంగంలో తెలుగు అణచివేతకు గురయింది. సమకాలీన అవసరాలకు తగ్గవిధంగా భాషను అభివృద్ధి చేసుకోలేకపోయాము. దానికితోడు 1990 తరువాత ప్రపంచీకరణ పేరుతో విజృంభించిన అమెరికన్ సామ్రాజ్యవాద వ్యూహాల్లో మన ప్రభుత్వాలు ఇరుక్కుపోయాయి. ఇంగ్లీషు పట్ల మోజును పెంచి పోషించాయి. ఇంగ్లీషే దిక్కని, తెలుగు ఒట్టి పనికిమాలిన భాష అని అనుకునే పరిస్థితిని తెచ్చిపెట్టారు. ప్రపంచంలోనే శక్తివంతమైన గొప్ప భాష, గొప్ప లిపి గలిగిన భాషగా నిపుణులు నిర్ణయించిన తెలుగున్ను ఆధునిక అవసరాలకు ఉపయోగించుకోలేకపోవటంతో అది క్రమంగా కేవలం మాట్లాడుకోవటానికి పనికివచ్చే భాషగా మాత్రమే జనసామాన్యం భావించే పరిస్థితిని పాలకులు తెచ్చిపెట్టారు. ఆంధ్రప్రదేశ్ పరిపాలకులకు ఒక భాషావిధానం అంటూ ఎన్నడూ లేదు. తమిళనాడు, కర్ణాటక వంటి పొరుగు రాష్ట్రాలలో పరిస్థితి పూర్తిగా మనకు భిన్నంగా వుంది. వారు వారి భాషలను అన్నిరంగాల్లో సమున్నతంగా నిలిపారు. తమ భాషాజాతీయతను చెప్పుకోడానికి అక్కడి ప్రజలు గర్వపడేట్లు చేశారు. ఆఖరుకు తమిళనాడులో 42% వున్న తెలుగు మూలాలు గల ప్రజలు తమిళీకరణ పొందేవిధంగా వారి ప్రభుత్వ విధానాలు రూపొందించుకున్నారు. ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా అదే పరిస్థితి. కర్ణాటకలో కూడా ఇంచుమించు పరిస్థితి ఇదే. ఇటువైపు ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు స్వాభిమానం కేవలం పెదవుల వరకే పరిమితమై ఆచరణలో శూన్యమైన స్థితికి కేవలం పాలకవర్గాలు కారణం. ఇక్కడ పాలకవర్గాలు అంటే నాఅభిప్రాయం ప్రతిపక్షపార్టీలు కూడా. ఇందుకు వామపక్ష పార్టీలు మినహాయింపు కాదు. ఇలా అంటున్నందుకు నన్ను క్షమించండి. ఎన్నడూ తెలుగుభాషారక్షణ విషయమై వామపక్ష పార్టీలు ఉద్యమించిన దాఖలాలేవీ లేవు. ఒకట్రెండు చిన్న చిన్న మినహాయింపులుండవచ్చు గాక. ప్రజల భాషలో పరిపాలించాలనే కనీస ప్రజాస్వామిక సూత్రాన్ని, ప్రజల భాషలో చదువు చెప్పాలనే శాస్త్రీయ అంశాన్ని పట్టించుకోని ప్రతిపక్షాలను, బాధ్యతను విస్మరించి భాషా సంస్కృతుల అణచివేతకు కారణమైన ప్రభుత్వ పక్షాలను, వారి నేతలను ఏమనాలో మీరే నిర్ణయించుకోండి.

మాతృభాషల ప్రాధాన్యాన్ని, మాతృభాషల్లోనే పరిపాలన, విద్యాబోధన వుండాలన్న శాస్త్రీయ దృక్పథాన్ని 'యునెస్కో' పరిగణనలోకి తీసుకుని, 6,000కు పైబడిన ప్రపంచ మాతృభాషల్లో సగానికి పైగా అదృశ్యమయ్యే పరిస్థితిని గుర్తించి, 1999లో ప్రత్యేకంగా సర్వేలు నిర్వహించింది. మాతృభాష రక్షణకోసం ప్రతి ఏడు ఫిబ్రవరి 21న 'అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం'గా ప్రకటించింది. నేటి బంగ్లాదేశ్ తూర్పుపాకిస్తాన్‌గా వున్నప్పుడు 1952లో పశ్చిమ పాకిస్తాన్ పరిపాలకులు తమను కూడా ఉర్దూలో పరిపాలించడాన్ని నిరసించి తమ మాతృభాష బంగాలీని రక్షించుకోవటం కోసం ఉద్యమించారు. ఫిబ్రవరి 21న ఉద్యమకారులపై ప్రభుత్వం జరిపిన కాల్పులలో కొంతమంది మరణించారు. అందువల్ల ఆ దినాన్నే అం.మా.దినోత్సవంగా 'యునెస్కో' గుర్తించింది. ఏ మాతృభాషలో అయినా బడికి వెళ్ళే పిల్లలు 30% మంది తమ మాతృభాష చదవడం మానేస్తే ఆ భాష అంతరించిపోయే దిశలో వున్నదని 'యునెస్కో' సర్వే తేల్చిచెప్పింది. ఈ నేపథ్యంలో తెలుగుజాతి పరిస్థితిని సమీక్షిస్తే, తెలిసే వాస్తవం భయంకరంగా వుంటుంది.

భారతదేశం మొత్తమ్మీద తెలుగుప్రజలు ఇప్పుడు 18 కోట్లకు తక్కువ వుండరని అంచనా. వీరిలో సగంమంది మాత్రమే నాటి సంయుక్త ఆంధ్రప్రదేశ్‌లో – అంటే నేటి ఆంధ్ర–తెలంగాణ రాష్ట్రాలు రెంటిలో కలిపి వున్నారు. తక్కిన సగంమంది ఇతర రాష్ట్రాల్లో, ఎక్కువగా పొరుగురాష్ట్రాల్లో వున్నారు. తమిళనాడులోనే 3 కోట్ల మంది; కర్ణాటకలో సుమారు 2 కోట్లు; మహారాష్ట్ర, ఒరిస్సా, ఛత్తీస్‌గఢ్ మొదలైన రాష్ట్రాల్లో కూడా పెద్దసంఖ్యలో వున్నారు. బంగ్లాదేశ్‌లోనే కొన్ని లక్షలమంది బహుశా 3లక్షలకు పైగా తెలుగువారు వున్నట్లు ఇటీవలి అంచనా. ఇప్పుడు చెప్పండి రెండు తెలుగు రాష్ట్రాల్లో వున్న 9 కోట్ల మందిలో నిరక్షరాస్యులెంతమంది? అక్షరాస్యుల్లో తెలుగు నిరక్షరాస్యులెంతమంది? మనపిల్లలు, మనుమలు ఎంతమంది ఇప్పుడు తెలుగు నేర్చుకుంటున్నారు? ఇంగ్లీషు మాటలకు తెలుగు మాటలు జోడించి మాట్లాడుతున్నారా లేదా తెలుగు మాటలకు ఇంగ్లీషు జోడించి మాట్లాడుతున్నారా? మన పరిపాలనలో తెలుగు భాగం ఎంత? ఆధునిక శాస్త్ర సాంకేతిక అవసరాలకు తెలుగుకు స్థానమంటూ వుందా? పాఠశాలల్లో, కళాశాలల్లో తెలుగు వుందా, వుంటే ఎంతవరకూ వుంది, ఎలా వుంది? ఇవన్నీ ఆలోచిస్తే స్థూలంగా అర్థమయ్యేదేమిటి? ఇంకొక్క ఆలోచన కలవండి. ఇతర రాష్ట్రాల్లో సగంమంది తెలుగువారున్నారనుకున్నాం కదా. వారిని గురించి ఏనాడూ మనమూ పట్టించుకోలేదు, ఆ రాష్ట్రాల్లో తెలుగు స్వాభిమాన ఉద్యమాలూ అంతంతమాత్రమే. భాషాపరమైన అణచివేతకు వాళ్ళంతా గురై మాతృభాషా హక్కులకు దూరమైనారు. వాళ్ళల్లో బహుశా 95% తెలుగుభాషా నిరక్షరాస్యులే. ఇప్పుడు లెక్కవేయండి. మనం మన పతనం ఏ శాతంలో వుందో?!

ఇన్ని సంగతులను – నిజాలను – చెప్పుకున్నాం. మాతృభాషకే చోటు లేని పరిస్థితుల్లో మాతృభాషామాధ్యమాన్ని గురించి ఏం చెప్పుకుంటాం? రాజ్యాంగంలో కూడా 17వ విభాగంలో అధికార భాష గురించి వివరించారు. దాన్లో 2వ అధ్యాయంలో రాష్ట్రాల అధికారభాషల గురించి, రాష్ట్రాల్లో అల్పసంఖ్యాకుల భాషలకు ప్రత్యేక గుర్తింపునివ్వటం గురించి స్పష్టంగా చెప్పారు. 350–ఎ అధికరణంలో భాషాపరమైన మైనార్టీలకు ప్రాథమికస్థాయిలో మాతృభాషావిద్యాబోధన గురించి స్పష్టంగా చెప్పారు. అంటే ఇతర భాషారాష్ట్రాల్లో వున్న పిల్లలకే తమ మాతృభాషలో ప్రాథమిక విద్యను నేర్చుకునే హక్కున్నప్పుడు, స్వరాష్ట్రంలో వున్న పిల్లలకు తమ మాతృభాషలో కనీసం ప్రాథమికవిద్యను నేర్చుకోడాన్ని ఒక హక్కుగా, ఒక తప్పనిసరి అంశంగా ఎందుకు అమలు

చేయరు? మనరాష్ట్రంలో ఒకప్రక్క ప్రాచీనభాషగా గుర్తింపు కోసం పోరాటం జరుగుతుండగానే 2006లో నాటి ముఖ్యమంత్రి జి.వో.76 ద్వారా ప్రభుత్వ పాఠశాలల్లో 6వ తరగతి నుండి 10వ తరగతి వరకు ఇంగ్లీషు మాధ్యమాన్ని ప్రవేశపెట్టారు. కనీసం ప్రాథమికస్థాయిలో తెలుగును తప్పనిసరి చేయలేదు. అంటే పిల్లవాడిని ఎల్.కె.జి.లో చేరుస్తూనే అప్పటిదాకా పుట్టి పెరిగిన భాషలో కాకుండా పరాయిభాషలో వాడికి విద్యాబోధన మొదలవడాన్ని ప్రభుత్వం అనుమతిస్తుందన్నమాట! మాతృభాష అంటే కంటిచూపువంటిదని, పరభాషలు కేవలం కళ్ళజోడు లాంటివేనని పెద్దలు చెప్పినమాటను తుంగలో తొక్కారు. తుపాకి గుండు మనిషిని చంపితే, పరాయిభాష జాతి ఆత్మను చంపుతుందన్న గూగీ వా థియాంగో వంటి భాషోద్యమకారుల హెచ్చరికలను కూడా పెడచెవిని పెట్టారు. ప్రజలు ఇంగ్లీషు భాష మోజులో వున్నారని సాకుచూపటం, ఇద్దరు తెలుగువారు కలుసుకుంటే తెలుగులో మాట్లాడుకోరని ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటారని వెక్కిరించడం మన రాజకీయనాయకులకే కాదు, కొందరు మేధావులకు కూడా అలవాటైపోయింది. ఇంతకంటే దుర్మార్గం మరొకటి లేదు. తెలుగుప్రజలకు తెలుగువారమనే స్వాభిమానం ఏ ఇతర భాషీయులకూ తీసిపోదు. ఇది అనేక సందర్భాలలో ప్రకటితమైంది. అందువల్లనే తెలుగురాష్ట్రాల్లోను, బయట రాష్ట్రాల్లోనూ వుండే 18 కోట్లమంది తెలుగుప్రజలు మాట్లాడుకునే భాషగా, పాడుకునే భాషగా, ఆడుకునే భాషగా సుఖదుఃఖాలను తెలుపుకునే భాషగా తమ తల్లిభాషలలోనే బ్రతుకుతున్నారు. ఎటుతిరిగి తమ పిల్లల భవిష్యత్తుకు తెలుగుభాష, ఆ భాషామాధ్యమం ఉపకరించదనే అభిప్రాయంతో ప్రభుత్వం, మేధావులు చూపిన దారిన నడుస్తున్నారు. దీనికి తప్పుపట్టవలసింది ప్రభుత్వాన్ని, పాలకవర్గాలను, మేధోవర్గాలను మాత్రమే గాని ప్రజలను కాదు. భాషను ఆధునిక అవసరాలకు తగ్గట్లుగా అభివృద్ధి చేయనందువల్ల, అన్ని స్థాయిల్లో తెలుగును వినియోగించనందువల్ల మాత్రమే ప్రజలు తెలుగు వాడుకకు దూరమవుతున్నారు. ఈవాస్తవాన్ని గుర్తించి ఇప్పుడు మనం ఉద్యమాలను రూపొందించుకోవలసి వుంది.

మాతృభాషామాధ్యమమే శాస్త్రీయమని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అయితే ఇప్పుడున్న వాస్తవపరిస్థితిని బట్టి ఆలోచిస్తే ఎల్.కె.జి. నుండి పి.జి దాకా, శాస్త్రసాంకేతిక విద్యలతో సహా మొత్తం విద్యారంగాన్ని వున్నపాటున తెలుగులోకి మార్చేయడం సాధ్యంగానంత అగాధంలో మనం పడివున్నాం. కనుక ఒకటి నుంచి పదో తరగతి వరకు మాతృభాషా మాధ్యమంలోనే బోధించడాన్ని వెంటనే తప్పనిసరి చేయాలి. ఇదీ ఒప్పుకోని పరిస్థితులున్నప్పుడు కనీసం ప్రాథమిక విద్యను అంటే 5వ తరగతి వరకు మాతృభాషామాధ్యమాన్ని తప్పనిసరి చేయాలి. దీన్ని కఠినంగా రాష్ట్రమంతా ప్రైవేటు స్కూళ్ళతోసహా తప్పనిసరి చేయాలి. తెలుగుభాషోద్యమ సమాఖ్య కృషివల్ల 2003లో వచ్చిన జి.వో.నెం.86 ప్రకారం ఒకటి నుంచి పదో తరగతి వరకు ఏ భాషామాధ్యమంలో నడిచే బడిలోనైనాసరే తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేశారు. కానీ దానిఅమలులో నాటినుంచి నేటి వరకు అన్ని ప్రభుత్వాలూ శీతకన్ను వేశాయి. ఇంటర్మీడియెట్ నుంచి ఆపై చదువులో తెలుగుకు దాదాపు స్థానమే లేకుండా పోయింది. మాధ్యమం ఏదైనా కాలేజీ, ఆపై దశల్లో కూడా తెలుగును ఒక సబ్జెక్టుగా బోధించాలనే డిమాండు అట్లాగే వుంది. కామన్‌స్కూలు పద్ధతి ఏనాడో అంతరించింది. ఉన్నవారికి, లేనివారికి విద్యను సమానంగా అందించాలనే సాధారణ ప్రజాస్వామ్య సూత్రం ఏనాడో మట్టిగరిచింది. అంటే మౌలికంగా జాతికి ప్రాణప్రదమైన రంగాల్లో తెలుగును వీలైనంత లోతుగా పూడ్చిపెట్టేందుకే ప్రభుత్వాలు పూనుకున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో తెలుగు జాతిని స్వాభిమానంతో అభ్యుదయమార్గంలో నడిపించడానికి వామపక్ష శక్తులు పూనుకోవాల్సిన సమయం వచ్చింది.

మొదటిదశగా కనీసం పాఠశాల స్థాయివరకు లేదా ప్రాథమిక విద్య వరకు మాతృభాష మాధ్యమాన్ని పాటించితీరేట్లుగా ఉద్యమించాలి. జి.వో.నెం.86ను కఠినంగా అమలుపరచటంతోపాటు కళాశాల స్థాయి చదువుకు కూడా ఆ సూత్రాన్నే వర్తింపజేసేటట్లు అదేవిధమైన మరొక జి.వో.ను తీసుకురావాలి. మాతృభాషలో పునాది గట్టిగా వుంటే పరభాషలనెన్నైనా "భాషలుగా నేర్చుకోవచ్చునని, మాధ్యమంగా వాటిని తీసుకోవాల్సిన అవసరం లేదనే శాస్త్రీయ సూత్రం ప్రాతిపదికపై విద్యావిధానం వచ్చేట్లు పోరాడాలి. తెలుగుభాషోద్యమ సమాఖ్య ఎంతో పోరాడి సాధించిన జి.వో.నెం.909/2013 ప్రకారం ఏర్పడిన భాషామంత్రిత్వశాఖ క్రింద తెలుగు ప్రాధికారమండలిని ఏర్పాటుచేయించి అన్నివిధాలా తెలుగు రక్షణ, భాషాభివృద్ధి బాధ్యతలను దానికప్పగించాలి. ఈ విధమైన ఆచరణాత్మక దృక్పథాన్ని చేపడితేనే ఈ జాతికి భవిష్యత్తు. వామపక్ష, అభివృద్ధికాముక, భాషాపరిరక్షణ ఉద్యమకారులంతా కలిసిమెలిసి ఈ లక్ష్యాల సాధనకు శ్రద్ధవహించి పోరాడాలి.

భాషారక్షణ అనే మాటను సరైన విధంగా అర్థం చేసుకోవటంలో విఫలమవుతున్నారో లేక కావాలనే ప్రవర్తిస్తున్నారో కాని కళాసాహిత్య సాంస్కృతిక రంగాల్ని పెంచి పోషిస్తే భాషను రక్షించుకున్నట్లేననే తప్పుడు అభిప్రాయాన్ని వ్యాప్తి చేస్తున్నారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో తమ సర్వహక్కుల్ని కాపాడుకునేందుకు ప్రజలకు బలమైన ఆయుధం తమ మాతృభాష. ప్రపంచంలోని అన్ని రంగాలలో అభివృద్ధి దిశగా దూసుకుపోయేందుకు అనువైన, శక్తివంతమైన భాష మన తెలుగు. వాడకుండా వుంటే ఏ ఆయుధమైనా, ఏ అవయవమైనా నశించిపోతుంది. భాష కూడా అంతే. పైపెచ్చు స్వంత భాషలో, స్వాభిమానంతో వ్యవహరించలేని జాతి పరాయీకరణ చెందుతుంది. బానిసజాతిగా మిగిలిపోతుంది. ఇతరభాషలను వద్దనడం లేదు. ఇప్పటిపరిస్థితుల్లో ఇంగ్లీషును వద్దనడం అసలే లేదు. కాని దాన్ని ఒక భాషగా అవసరం అనుకుంటే 5వతరగతి నుండే లేదా 3వతరగతినుండే నేర్పండి. భాషగా మాత్రమే. మాధ్యమంగా కాదు. ప్రపంచంలో అభివృద్ధి చెందిన దేశాలు అనుసరిస్తున్న విధానం ఇదే. కనుక మిత్రులారా! నేను చివరగా చెప్పదలచుకున్నది ఇదే. వామపక్ష ఉద్యమాల్లో భాషారక్షణ ఒక తప్పనిసరి భాగం కావాలని, ఆ లక్ష్యంతో పనిచేయాలని మనం కోరుకుందాం. ఆచరణాత్మక దృక్పథాన్నే నేను మీముందుంచాను. మీరంతా ఆలోచిస్తారని నమ్ముతున్నాను. నమస్తే.

పర్యావరణం

– మాదిరాజు రాంబాబు

# భూభారం తీరాలంటే...

పాపం పెరగడం వల్ల భరించలేని భారంతో తల్లడిల్లిన భూదేవి ఏ దేవదేవుడి వద్దకో వెళ్ళి మొరపెట్టుకునేది. అప్పుడు ఆయన ఒక అవతారం ఎత్తి అందుకు కారకుడైన దుష్టరాక్షసుణ్ణి సంహరిస్తేగానీ భూమాతకు ఊరట కలిగేది కాదు. యుగానికొకసారి ఆ తతంగం జరిగేదాకా భూమిని ఆధారం చేసుకొని బతికే జీవులకు ఆ భారాన్ని ఓర్చుకోక తప్పేదికాదు.



పురాణగాథల కాల్పనికత మాట ఎలా ఉన్నా నేడు ఏర్పడిన వికృత వాతావరణ మార్పుల కారణంగా ప్రళయ విధ్వంసానికి చేరువయ్యాయి. ఓజోన్ పొరకు చిల్లుపడటం, భూగోళం వేడెక్కడం, మితిమీరిన పట్టణీకరణ, పారిశ్రామికీకరణ, కాలుష్యాలు, గ్రీన్‌హౌస్ వాయువుల వెలువరింపు, జీవజాలాలు, ఉష్ణప్రాంత అడవులు క్షీణించడం, చిత్తడి నేలల వినాశనం, భూమి కోత, ఎడారుల విస్తరణ, ఎల్‌నినో, లానినో ప్రకృతి పరిణామాల వైపరీత్యాల మూలంగా కరవులు, వరదలు, జలవనరుల విధ్వంసం, భూగర్భజలాల అంతర్ధానం, హరిత విప్లవ విధ్వంసం, భూసారం క్షీణించడం, పునరుత్పత్తి కాని వనరులు (శిలాజ ఇంధనాలు, ఖనిజాలు వగైరా) అంతరించడం వగైరా పర్యావరణ సమస్యలు ప్రపంచాన్ని (ప్రకృతి+సమాజం) చుట్టుముట్టాయి. వీటన్నిటినీ నిరోధించి భూ వాతావరణ పరిస్థితుల్లో పునరుద్ధరించలేని ఆకస్మిక మార్పులు సంభవించే అవకాశాలున్నాయని పర్యావరణవేత్తలు హెచ్చరిస్తున్నారు.

మనం భూమితో 'అభిన్నత' (ఐడెంటిటీ) సంబంధంలో ఉన్నాం. అంటే, ఒక గర్భవతి, ఆమె కడుపులోని బిడ్డకు మధ్యగల 'అభిన్నత' సంబంధంలాంటిది. తల్లి ఆరోగ్య పరిస్థితిపైనే ఆమె కడుపులో బిడ్డ ప్రాణం ఆధారపడి ఉన్నట్లే భూగోళంపై ఉన్న ప్రకృతిలో అంతర్భాగంగా ఉన్న మానవుల పరిస్థితి కూడ అంతే. భూగోళ పరిణామంలో ఆవిర్భవించిన పర్యావరణం (వాతావరణం, జీవావరణం)లో మానవజాతి ఆవిర్భవించి సామాజిక వ్యవస్థలుగా కొనసాగింది. భూగోళ ప్రకృతి ఆరోగ్యంగా లేక ఆవాసయోగ్యంగా లేకపోతే మానవులతో సహా సకల జీవరాశుల ఉనికే ఉండదు. భూమిపై ఉన్న 1.5 కోట్ల జీవరాశుల్లో ఒకటైన మానవజాతి జీవపరిణామ నిచ్చెనలో అగ్రభాగాన ఉంది. మనం మిగిలిన జీవాలతో జన్యుపరంగా బాంధవ్యం కలిగి ఉండడమే కాక, అన్ని క్రియలలో వాటితో జతపడి, ఆధారపడి ఉంటాం. ఈ జీవావరణ మనుగడకు ప్రాథమిక షరతుగా ఉండే గాలి, నీరు తదితర నిర్జీవ పదార్థ వాతావరణం స్వచ్ఛతపై జీవ ప్రపంచపు ఆరోగ్యం, శక్తి ఆధారపడి ఉంటుంది. ప్రకృతితో శత్రుపూరిత స్థాయికి చేరుకున్న మానవ కార్యకలాపాలు గతంలో వలె స్థానికంగా కాక ప్రపంచ వ్యాప్త పర్యవసానాలను కలిగిస్తున్నాయి.

ప్రగతి, అభివృద్ధి అనే పేరుతో మానవుడు ప్రకృతిని తన ఇష్టం వచ్చినట్లు వాడుకున్నాడు. భూ వాతావరణాన్ని, జీవావరణాన్ని కాపాడుకుని తర్వాతి తరాలకు అభివృద్ధి చెందిన దశలో నిలబెట్టుకోకుండా మానవ మనుగడే ప్రశ్నార్థకమని తెలుసుకున్నందుకు సంకేతమే ధరిత్రీ దినం. 1970 నుంచి ప్రతి ఏటా ఏప్రిల్ 22వ తేదీని ధరిత్రీ దినంగా జరుపుతారు. పర్యావరణ పరిరక్షణకు 'మనం నాయకత్వం వహించాల్సిన వంతు వచ్చింది' అనే ఇతివృత్తంతో 45వ ధరిత్రీ దినాన్ని ప్రపంచవ్యాప్తంగా జరుపుతున్నారు. భూమి ఉపరితలం వేడెక్కుతున్న నిజాన్ని దశాబ్దాలుగా గమనిస్తున్నాం. కానీ నివారణకు చర్యలు తీసుకునే దిశగా అడుగులు పడడంలేదు. విజ్ఞానశాస్త్రం 19వ శతాబ్దంలోనే భూతాపానికి కారణాలను గుర్తించింది. పారిశ్రామిక విప్లవం తర్వాత పెరిగిన కర్బన ఉద్గారాలు రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అతిగా పెరుగుతున్న భూతాపం మానవుల పాలిట అతిపెద్ద ప్రమాదంగా నిలిచాయి. దీనికి ప్రధానకారణం మనం నిర్మించుకున్న ఆధునిక నాగరికత, ఎంచుకున్న ఉత్పత్తివిధానం. సరుకులకంటే మూడింతలు అధికంగా వ్యర్థాలు పోగయ్యే ఉత్పత్తి పద్ధతులను పాటించడం, వాటికి తోడు వనరుల క్షీణత, భూతాపం పెరగడం ప్రధానకారణాలు. భూతాపం వల్ల అధికంగా నష్టపోయే దేశాలలో మనం ఒకటి అని సైన్సు పరిశోధనలు తెలుపుతున్నాయి. ప్రజారోగ్యం, జీవవైవిధ్య వినాశనం సమస్యలు తీవ్రతరమవుతున్నాయి. ఉష్ణ, వాయు, జల, కాలుష్య సంబంధిత వ్యాధులూ, వాతావరణంలో పెనుమార్పులవల్ల కలిగే వ్యాధులూ, ఆహార కొరత వలన అనారోగ్య సమస్యలు ప్రబలుతున్నాయి. ఇప్పటికీ జీవ

వైవిధ్య వినాశనం భూగోళ పరిమితుల్ని దాటి విస్తరిస్తోంది. భూగోళ ఉష్ణోగ్రతల్ని 2050నాటికి 2 డిగ్రీల సెంటిగ్రేడ్ మించరాదని కోపెన్‌హేగన్ వాతావరణ మార్పుసదస్సు తీర్మానించింది. అయితే వ్యవసాయ పారిశ్రామిక రంగాలనుంచి విడుదలయ్యే కాలుష్యాలు ఇలాగే కొనసాగితే ఈ శతాబ్దాంతానికి భూ ఉష్ణోగ్రత 4 డిగ్రీల సెంటిగ్రేడ్‌కు పెరిగే ప్రమాదం ఉంది. భూ తాపం పెరుగుదలను ఇలాగే కొనసాగిస్తే భూమిపై ఉన్న జీవావరణ వ్యవస్థ కుప్పకూలుతుంది. విద్యుత్‌కొరత అంటూ రాష్ట్రంలో, దేశంలో కొత్త బొగ్గు, నాఫ్తా వంటి శిలాజ ఇంధనాలు, ప్రాణాంతక అణుశక్తి వగైరాలతో నడిచే థర్మల్ కేంద్రాలను విరివిగా స్థాపించేందుకు ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నాయి. ప్రత్యామ్నాయ ఇంధన వనరులపై దృష్టిపెట్టి శిలాజ ఇంధనాలపై ఆధారపడే పరిస్థితిని క్రమంగా తగ్గించుకునే విధానాలను రూపొందించకుండా భూతాపాన్నిపెంచే శిలాజ ఇంధన వినియోగ ఊబిలోకి ప్రభుత్వాలు రోజురోజుకూ వేగంగా కూరుకుపోతున్నాయి.

భూగోళానికి లేదా నేలతల్లికి, అందులోని సకలజీవకోటికి వచ్చిన కష్టాన్ని ఆదుకునే పురాణ పురుషుడు అవతరిస్తాడనే కాల్పనికత ప్రేరణతో మానవులకు అబ్బిన భరించేశక్తి నేడు వేగంగా సన్నగిల్లుతోంది. దాంతో భూగోళంపై సంభవిస్తున్న వివిధ పర్యావరణ విపత్తుల్నీ వివిధ సందర్భాల్లో, ప్రాంతాల్లో విడివిడిగా వ్యక్తులుగానో, సమూహాలుగానో భరించలేని స్థితిలో ప్రతిఘటించారు. బతుకు చెర అనుకొని విముక్తికోసం ఎవరికివారు లేదా ఒకరికొకరు కొందరు వ్యక్తులుగానో సమూహాలుగానో విముక్తి దారులు వెదుక్కుని విఫలమయ్యారు. విశిష్ట సమూహాలు విడివిడి పరిష్కారాలద్వారానే అంతిమ సత్యానికి (పరిష్కారానికి) చేరుకోగలమనే ఆధునికానంతరవాద (పోస్ట్ మాడర్నిజం) విముక్తి స్వప్నం పీడకలగామారి సమస్యను మరింతజటిలం చేసింది. సాంఘిక ఉద్యమాలు, వర్గపోరాటాలు, పర్యావరణ ఉద్యమాలతో సహా వివిధ అస్తిత్వ ఉద్యమాలు వేటికవే విడివిడిగా పరిష్కారమవుతాయన్న అధిభౌతికవాద భావనలకూ ఆచరణలో కాలం చెల్లింది. ఈ సమస్యలకు పరిష్కారంగా కొత్త అంతర్జాతీయ ఒప్పందాలు, జనాభా పెరుగుదల వినిమయవాదం పెరుగుదల సంబంధించి వ్యక్తిగత నియంత్రణలు పర్యావరణానికి హాని చేయని పద్ధతులు సాంకేతిక పరిజ్ఞానం ఆచరణకు పిలుపు ఇవ్వడం వంటి విఫల పరిష్కారాలను కొన్ని పర్యావరణ సంస్థలు సూచించాయి. అంతర్జాతీయ ఒప్పందాలు అమలులోకి రాకుండా బహుళజాతి సంస్థల ప్రయోజనాల నేపథ్యంలో అభివృద్ధి చెందిన దేశాలు అడ్డుకుంటున్నాయి. ఇది ప్రకృతి సంక్షోభం కాదు. సామాజిక సంక్షోభమని గుర్తించాలి. ఈ వాతావరణ సంక్షోభానికి కారణాలు సామాజికమైనవీ చారిత్రకమైనవిగాప్రజలు క్రమంగా గుర్తిస్తున్నారు. సమస్యను పరిష్కరించాలంటే చిన్నచిన్న సాంకేతిక కారణాలను సరిదిద్దటంకాక పర్యావరణ క్షీణతకు కారణమైన ప్రధాన సామాజిక కారణాలను మార్చవలసి ఉంది. ప్రస్తుత సామాజిక సంబంధాలను ప్రశ్నించనంతవరకు పర్యావరణం పట్ల ఆందోళన చెందేవారు కొన్ని ఉద్యమాలు, కొన్ని వ్యక్తిగత నిర్ణయాలకు (రీసైక్లింగ్, పర్యావరణానికి హాని చేయని వస్తువుల్ని కొనడం, సుస్థిర వ్యవసాయం, సంక్షోభానికి మూలకారకులైన కార్పొరేట్లకు, రాజకీయ నాయకులకు, శాస్త్రవేత్తలకు విన్నపాలు అందించడం) మినహాయించి ఏమీ చేయలేరు. భూగోళ వ్యాప్తంగా విస్తరించిన వ్యవసాయ, పారిశ్రామిక తదితర మానవ కార్యకలాపాలు, వాటినుంచి లబ్దిపొందుతున్న ఆధిపత్య శక్తుల స్వార్థపూరిత, పర్యావరణ పరిహరణ రాజకీయార్థిక విధానాలకు స్వస్తి చెప్పనిదే ఈ పర్యావరణ ప్రళయానికి పరిష్కారం ఉండదు. ప్రజా ఉద్యమాలు, ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించి అంతర్జాతీయ ఒప్పందాలను సాధ్యం చేయాలి. ఉమ్మడిగా ప్రకృతి ధర్మాలకు లోబడిన సామాజిక, ఆర్థిక వ్యవస్థని నిర్మించుకునేందుకు ప్రగతిశీల శక్తులు కృషి చేయాలి. ప్రస్తుత రాజకీయ, ఆర్థిక విధానాలతో భూ తాపాన్ని నివారించడం అసాధ్యమన్నది రోజురోజుకీ స్పష్టమవుతోంది.

'సమస్య సృష్టికి కారణమైన ఆలోచనలలో దానికి సమాధానం సాధ్యం కాదు' అని ఐన్‌స్టీన్ చెప్పారు. అలాగే భూగోళంలో వాతావరణ మార్పులు ఇలా జరుగుతున్నాయి. అలా జరుగుతున్నాయి. ఇందుకు ఈ సాంకేతిక విషయాలు కారణమంటూ ప్రమాదపు అంచనాలతోను, శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని కట్టడి చేసే చర్యల్ని సూచించడంతోనూ పొద్దు పుచ్చితే లాభం లేదు. 'సమస్య మూలాల్ని సరిగా అర్థం చేసుకుంటే దానికి సగం పరిష్కారం లభించనట్లే లెక్క' అనేది నానుడి. భరించలేని బాధతో తల్లడిల్లే భూదేవి భారాన్ని పెంచే పాపాత్ములు నరులే. అయితే నరజాతి ఒక ముద్దగా లేదు. వారిలో పర్యావరణ విధ్వంసకర విధానాలను అమలు చేస్తూ సామాజికంగా లబ్ధిపొందే వ్యవసాయ, పారిశ్రామిక శక్తులే కీలక సూత్రధారులు, ఆర్థికాభివృద్ధి, లాభాలే ప్రధానమనే కార్పొరేట్ శక్తుల స్వార్థం, పాలకుల హ్రస్వ దృష్టి తీవ్ర పర్యావరణ విధ్వంసకర పరిణామాలను కలిగిస్తోంది. సామాజిక ఉమ్మడి వనరులను, శ్రమశక్తి సృష్టించే అదనపు విలువను భుక్తం చేస్తున్న ఆ ఆధిపత్య శక్తులే ప్రధాన దోషులు. మానవజాతి ఉనికి ప్రశ్నార్థకంగా మారిన ఈ తరుణంలో ఉనికిలో ఉన్న రాజకీయ, ఆర్థిక విధానాలు మార్చుకోక తప్పని పరిస్థితి ఏర్పడింది. ప్రకృతి మాన సమాజానికి మధ్యగల తల్లి-బిడ్డ(గర్భంలోని)ల సంబంధం చెదిరిపోని రీతిలో, పర్యావరణహిత వ్యవసాయ పారిశ్రామిక విధానాలను మానవజాతి ఎంచుకోవాలి.

ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో కొనసాగుతున్న వ్యవసాయ, పారిశ్రామిక విధానాల కారణంగా మితిమీరిన పట్టణీకరణ జరుగుతోంది. దాంతో కోట్లాదిమంది పల్లెలు వదిలి పట్టణాల్లో కేంద్రీకృతమవుతున్నారు. ఈ కారణంగా రెండు పరిణామాలు చోటు చేసుకుంటున్నాయి. ఒకటి- కార్పొరేట్ శక్తులకు చౌక శ్రమశక్తి అందుబాటులోకి వస్తుంది. రెండవది- కోట్ల మంది ప్రజలు తీసుకునే ఆహారం రూపంలో గ్రామసీమల భూముల్లోని భూసారం పట్టణ ప్రాంతాలకు తరలివెళ్ళి మానవ విసర్జితాల రూపంలో ఆ భూములకు తిరిగి చేరకుండా పోతోంది. పట్టణ ప్రాంతాలకు తరలిపోయిన భూసారం విసర్జితాలుగా డ్రైనేజీల్లో ప్రవహించి పర్యావరణ విధ్వంసకారులుగా మారుతున్నాయి. ఏ భూమి నుంచి భూసారం మానవులకు ఉపయోగపడిందో, వారి విసర్జితాలు తిరిగి ఆ భూమికి చేరుతుంటేనే భూసారం నిలకడగా ఉంటుంది. ప్రకృతి- సమాజానికి మధ్య ఇచ్చిపుచ్చుకునే చర్యలు సజావుగా సాగుతాయి. గ్రామసీమల్లో జనాభా విస్తరించి ఉంటే ప్రకృతి-సమాజానికి మధ్య ఆదాన ప్రదానాల ప్రక్రియకు గండిపడే అవకాశం ఉండదు. పెట్టుబడిదారీ పారిశ్రామిక విధానం వల్ల పట్టణీకరణ పెరగడంతో ఈ సహజ ప్రక్రియకు గండిపడింది. కార్పొరేట్ శక్తులు చౌక శ్రమశక్తినే కాకుండా భూ సారాన్ని కూడా దోపిడీ చేస్తున్నారని, పర్యావరణ

*(తరువాయి 36వ పుటలో...)*

పిట్టచూపు

– చలసాని నరేంద్ర

# తెలుగు రాష్ట్రాలపై పెత్తనం కోసం వారసుల హంగామా

**రాష్ట్ర** విభజన తరువాత రెండు తెలుగు రాష్ట్రాల్లో రెండు ప్రాంతీయ పార్టీలు అధికారంలోకి వచ్చాయి. సుదీర్ఘ రాజకీయ అనుభవం గల రెండు పార్టీల అధినేతలు ముఖ్యమంత్రులు అయ్యారు. దానితో వారిద్దరూ రెండు రాష్ట్రాల అభివృద్ధిపై దృష్టి కేంద్రీకరించ గలరని, ముఖ్యంగా ఎన్నికల సమయంలో ప్రజలకు ఇచ్చిన హామీల అమలు పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపగలరని అందరూ ఆశించారు. అయితే అధికారం చేపట్టినప్పటి నుండి ముఖ్యమంత్రులు ఇద్దరూ తమ వారసులకు వచ్చే ఎన్నికల అనంతరం పట్టాభిషేకం చేయడం గురించే తపన చెందుతున్నట్లు కనబడుతున్నది. ప్రాంతీయ పార్టీలు దేశ వ్యాప్తంగా కుటుంబ పార్టీలుగా మారిపోవడం, వంశ పారంపర్యంగా పార్టీల నాయకత్వం చేపట్టడం జరుగుతూనే ఉన్నది. ఆ వరవడిలోనే ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి యన్ చంద్రబాబు నాయుడు తన కుమారుడు యన్ లోకేష్ ను తన రాజకీయ వారసుడిగా అనధికారికంగా ప్రకటించారు. ప్రస్తుతం పార్టీ వ్యవహారాలకే పరిమితం అవుతున్నట్లు కనిపిస్తున్నా పరిపాలనలో సహితం తెర వెనుక ఉండే చక్రం తిప్పే ప్రయత్నం చేస్తున్నారు. అదే వరవడిలో తెలంగాణ ముఖ్యమంత్రి కె చంద్రశేఖర్ రావు సహితం తన కుమారుడు తారక రామారావు ను రాజకీయ వారసుడిగా అనధికారికంగా ప్రకటించారు. ఎన్నికల అనంతరం మేనల్లుడు టి హరీష్‌రావు తో పాటు రామారావు ను సహితం మంత్రి వర్గంలోకి తీసుకోవడం ద్వారానే కుమారుడు తన వారసుడు అనే సంకేతం ఇచ్చారు. మరో వంక కుమార్తె కవిత ను పార్లమెంటు కు పంపి ఢిల్లీ లో తన ప్రతినిధిగా కేంద్ర ప్రభుత్వం వద్ద పలుకుబడి పెంచుకొనే ప్రయత్నం చేయనిస్తున్నారు.





**రా**జకీయ పార్టీలలలో సహజంగా కుమారులు నాయకత్వ స్థాయి పెంచుకొంటే అభ్యంతరం ఉండకపోవచ్చు. అయితే తమ వారసులకు మార్గం సుగమం చేయడం కోసం తొలి నుండి పార్టీకోసం కష్టించి పనిచేసిన వారిని క్రమంగా ప్రక్కకు తప్పించడం, మధ్యలో అధికారం కోసం సిరి సంపదలతో దరి చేరిన వారిని అందలం ఎక్కించడం జరుగుతున్నది. మరోవంక ఇతర పార్టీలకు చెందిన వారిని పార్టీ ఫిరాయింపులకు ప్రోత్సహించి, వారికి పార్టీలో, ప్రభుత్వంలో ప్రాధాన్యత కల్పిస్తున్నారు. అటువంటి వారంతా తమ కుమారుల అదుపులో ఉంటారని ముఖ్యమంత్రులు భావిస్తున్నారు.

పార్టీ ఆవిర్భావం నుండి పార్టీ కోసం శ్రమిస్తున్న నాయకులు, సీనియర్ లు ఉంటే వారసుల మాట చెల్లుబాటు కావడం కష్టం కాగలదనే భావనతో వీలయినంత వరకు అటువంటి వారిని ప్రక్కన పెట్టే ప్రయత్నం చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ లో లోకేష్ ప్రస్తుతం తెలుగు దేశం పార్టీ, ప్రభుత్వంలో కీలక అధికార కేంద్రంగా మారిపోయారు. గత ఎన్నికల సమయంలోనే అభ్యర్థుల ఎంపికలో ఆయన కీలక పాత్ర వహించారు. ఎన్నికల అనంతరం పార్టీ కార్యకర్తల సంక్షేమ నిధి ప్రముఖ్ పేరుతో పార్టీలో, ప్రభుత్వంలో కీలక నిర్ణయాలు ఆయన ప్రమేయం లేకుండా జరగడం లేదు. పలువురు మంత్రులు, అధికారులు, పార్టీ ప్రముఖులు ఆయనను కలుస్తూ సమాలోచనలు జరుపుతున్నారు. మంత్రులు అందరి పేషిలలో లోకేష్ ప్రతినిధులు వివిధ హోదాల్లో ఉన్నారు.

ఇటీవల 20 మంది జర్నలిస్ట్ లను సమన్వయ కర్తలుగా నియమిస్తూ ఒక జి ఓ విడుదల అయింది. వారంతా ఒకొక్క మంత్రి వద్ద పని చేస్తారు. వారందరినీ లోకేష్ నియమించారనే ప్రచారం జరుగుతున్నది. ఇక లోకేష్ కు సన్నిహితుడైన ఒక వ్యక్తి ముఖ్యమంత్రి కార్యాలయంలో ఓ యస్ డి గా పని చేస్తున్నారు. కీలక ఫైల్స్ అన్నీ ఆయన చూపు లేకుండా కదలడం లేదు. జూనియర్ అధికారి అయినా సీనియర్

అధికారులు పలువురిని పిలిపిస్తూ ఉండడం అధికారులల్లో అసంతృప్తికి దారి తీస్తున్నది. లోకేష్ అమెరికా పర్యటనలో సహితం ఈ అధికారి ప్రముఖంగా పాల్గొనడం విశేషం.

ఇక తెలంగాణ రాష్ట్రంలో మొన్నటి వరకు ముఖ్యమంత్రి మేనల్లుడు, నీటి పారుదల శాఖ మంత్రి టి హరీష్ రావు, తారక రామరావు ల మధ్య ఎవ్వరు వారసులనే అప్రకటిత పోరు కొనసాగింది. ఈ మధ్యనే తారక రామారావు అటు పార్టీపై, ఇటు ప్రభుత్వంపై పట్టు పెంచుకొనే ప్రయత్నం చేస్తున్నారు. టి ఆర్ యస్ పార్టీ ని స్థాపించినప్పటి నుండి చంద్రశేఖర్ రావు నీడలో పనిచేస్తూ, పార్టీ సంస్థాగత వ్యవహారాలపై పట్టు సాధించిన హరీష్ రావు కు ఇటీవల ప్రాధాన్యత తగ్గిపోవడం కనిపిస్తున్నది. ఇటీవల జరిగిన పార్టీ ప్లీనరి లో ఆయన అసలు ముందు వరుసలోనే కనిపించలేదు. చాలా నిర్లిప్తంగా వ్యవహరించారు. చంద్రశేఖర్ రావు వాస్తవానికి కుమారుడిని పార్టీ కార్యనిర్వాహక అధ్యక్ష పదవి తీసుకొని, పార్టీ వ్యవహారాలు చూడమన్నారని, హరీష్ రావు కు ప్రభుత్వ వ్యవహారాలు అప్పచెప్పాలి అనుకున్నారని తెలుస్తున్నది.

అయితే కుమార్తె కవిత, తారక రామరావు కలసి వత్తిడి తేవడంతో చంద్రశేఖర్ రావు సహితం కుమారుడి హంగామాకు అడ్డుచేప్పలేక పోతున్నారని తెలుస్తున్నది. టి ఆర్ యస్ ప్రభుత్వాన్ని కూలదోయగల సామర్ధ్యం ప్రతిపక్షాలలో ఎవ్వరికీ లేకపోయినా, తొలి నుండి పార్టీ సంస్థాగత వ్యవహారలలో పట్టు గల్గిన హరీష్‌రావు వారసత్వ పోరులో తిరుగుబాటుకు పాల్పడితే ప్రభుత్వాన్ని కాపాడు కోవడం కోసమే ఇతర పార్టీలకు చెందిన శాసన సభ్యులను పెద్ద ఎత్తున ఫిరాయింపులకు ప్రోత్సహిస్తున్నారని ఈ సందర్భంగా పలువురు భావిస్తున్నారు.

తొలి నుండి పార్టీ కోసం, తెలంగాణ ఉద్యమం కోసం పనిచేసిన సీనియర్ లను మంత్రివర్గంలో చేర్చుకోకుండా, తెలంగాణ ఉద్యమానికి వ్యతిరేకంగా పనిచేసి, తామే గతంలో తెలంగాణ ద్రోహులు అని నిందించిన వారిని అక్కున చేర్చుకొనే మంత్రి పదవులు ఇచ్చారు. తెలుగు దేశంకు చెందిన కడియం శ్రీహరి, తుమ్మల నాగేశ్వర రావు, శ్రీనివాస్ యాదవ్ వంటి వారికి కీలక మంత్రి పదవులు ఇవ్వడం సహితం తారక రామారావుకు అండకోసమే అని తెలుస్తున్నది. పార్టీ కార్యకర్తలతో సన్నిహిత సంబంధాలు ఉండటమే కాకుండా అందరిని కలుపుకు పోగల హరీష్ రావు వ్యవహారాలను ఎక్కడికక్కడ కట్టడి చేసే ప్రయత్నం చేస్తున్నారు.

తెలుగు దేశం లో సహితం పరిస్థితులు ఈ విధంగానే ఉన్నాయి. నాలుగైదు సార్లు గెలిపొంది, తొలినుండి పార్టీ కోసం పనిచేస్తున్న శాసన సభ్యులను వదిలి వేసి కాంగ్రెస్ వారితో, ప్రతిపక్ష నాయకుడు వై యస్ జగన్ మోహన్ రెడ్డి తో వ్యాపార, ఆర్థిక సంబంధాలు సహితం ఏర్పరచుకున్న వారికి కీలక మంత్రి పదవులు అప్పచెప్పడం, అసలు పార్టీతో –ప్రజలతో సంబంధం లేని సంపన్నులకు కీలక పదవులు అప్పచెప్పడం అంతా లోకేష్ కు పార్టీలో, ప్రభుత్వంలో ఎదురు లేకుండా చేయడం కోసమే అని భావిస్తున్నారు.

గత ఎన్నికల సమయంలోనే అవసరం లేకపోయినా పెద్ద ఎత్తున కాంగ్రెస్ వారిని చేర్చుకొని లోక్‌సభ, అసెంబ్లీ అభ్యర్ధులుగా సీట్లు ఇచ్చి గెలిపించారు. తెలుగు దేశం పార్టీ ఏర్పడినప్పటి నుండి పార్టీలో ఉన్న వారు ఇద్దరు, ముగ్గురు మించి ప్రస్తుత మంత్రి వర్గంలో లేరు. ఎన్నికల అనంతరం కూడా శాసన మండలి, ఇతర కీలక పదవులకు పార్టీతో సంబంధం లేని, ఇతర పార్టీలతో సాన్నిహిత్యం కలిగిన వారికే ప్రాధాన్యత ఇస్తున్నారు. తెలుగు దేశం పార్టీలో తొలి నుండి ఉన్నవారి ప్రాధాన్యతను పూర్తిగా తగ్గించే ప్రయత్నం చేస్తున్నారు. ఇదంతా లోకేష్ కు ఎదురులేకుండా చేయడం కోసమే అని తెలుస్తున్నది.

ఇప్పటికే ఆరు పదులు వయస్సు దాటిన తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు 2019 ఎన్నికల నాటికి ఏడు పదులకు దగ్గరలో పడతారు. ప్రతిపక్షాలు యువనాయకులను రంగంలోకి తీసుకు వస్తున్నాయి. అందుకనే ఓటర్లను ఆకట్టుకోవడం కోసం యువ నాయకత్వం అవసరమని గ్రహించిన వీరు తమ కుమారులనే ప్రజల వద్దకు ముఖ్యమంత్రి అభ్యర్ధులుగా పంపే యోచనలో ఉన్నట్లు తెలుస్తున్నది.

రెండు తెలుగు రాష్ట్రాల్లో మంత్రులు దాదాపుగా ఉత్సవ విగ్రహాల వలే మిగిలి పోయారు. వారికి సంబంధం లేకుండానే వారి మంత్రిత్వ శాఖలలో నిర్ణయాలు జరిగి పోతున్నాయి. ముఖ్యమంత్రుల వారసులు అంతా తామే అయి నడిపిస్తున్నారు. కీలకమైన కాంట్రాక్టు లు ఖరారు చేయడంలో, విధాన నిర్ణయాలలో, పోస్టింగ్ లలో వారి మాటలే చెల్లుబాటు అవుతున్నాయి. వారసులకు ఇబ్బందులు లేకుండా చేయడం కోసమే పార్టీతో అనుబంధం, కార్యదక్షత కలిగిన నాయకులను పదవులకు దూరంగా నెట్టే ప్రయత్నం ముఖ్యమంత్రులు చేస్తున్నారు.

ఇద్దరు వారసులు ఒకేసారి అమెరికా పర్యటనకు వెళ్ళడం గమనార్హం. తమ రాష్ట్రాల్లో పెట్టుబడులను ఆకర్షించడానికి అని చెబుతున్నారు. అదే అయితే సీనియర్ మంత్రులను పంపకుండా వీరిని పంపడమే తమ వారసులుగా వారికి తగు ప్రచారం కల్పించడం కోసం అని స్పష్టం అవుతున్నది. తారక రామారావు రాష్ట్ర మంత్రి హోదాలో వెళ్ళారు. లోకేష్ అయితే కనీసం శాసన సభ్యుడు కుడా కాదు. అయితే ప్రభుత్వం ఇద్దరు అధికారులను ఆయన వెంట పంపడం గమనిస్తే వారసత్వం ఖరారు చేయడం కోసం అధికార దుర్వినియోగం ఏ రీతిలో జరుగుతున్నదో స్పష్టం అవుతున్నది.

తమ వారసులకు సొంత పార్టీలో వ్యతిరేకత కొంత వ్యక్తమైతే అణచి వేయడం కోసం కేంద్ర ప్రభుత్వంతో సన్నిహితంగా వ్యవహరించే ఎత్తుగడ వేస్తున్నారు. ముఖ్యమంత్రి అయిన కొత్తలో నరేంద్ర మోడీ ప్రభుత్వంపై చంద్రశేఖర రావు నిప్పులు చెరిగినా ఇప్పుడు నోరెత్తి ఒక్క మాట అనడం లేదు. రాష్ట్ర విభజన చట్టంలోని అంశాలను అమలు చేయడం పట్ల నరేంద్ర మోడీ ప్రభుత్వం తగు శ్రద్ధ చుపకపోతున్నా, భూసేకరణ వంటి ప్రజా వ్యతిరేక బిల్లులను తీసుకు వస్తున్నా నోరెత్తడంలేదు.

చంద్రబాబు నాయుడు సహితం ఆంధ్ర ప్రదేశ్ కు ప్రత్యేక ప్రతిపత్తి కల్పించే విషయమై పార్లమెంటు సాక్షిగా భా.జా.పా. నాయకులు తామిచ్చిన హామీలను గాలికి వదిలి వేస్తున్నా, స్వయంగా ఎన్నికల ప్రచార సభలో రాష్ట్రానికి వచ్చినపుడు నరేంద్ర మోడీ ఇచ్చిన హామీని మరచి పోతున్నా నోరెత్తలేక పోతున్నారు. తమ కుమారుల రాజకీయ భవిష్యత్తు కోసం రాష్ట్రాల ప్రయోజనాలను విస్మరించడానికి వీరు సిద్దపడుతున్నారని భావించ వలసి వస్తున్నది.

**రచయిత ఫోన్ : 9849569050**

## ఇవి పూర్తిగా చదువరుల పుటలు...

'అమ్మనుడి'లో వచ్చిన అంశాలపైన, రాని ఇతర అంశాలపైనా చదువరులు తమ స్పందనలను, అభిప్రాయాలను, ప్రతిపాదనలను ఈ శీర్షికలో తెలుపవచ్చు. రాజకీయాలకు, శాస్త్ర సాంకేతిక ప్రగతికీ ఏదైనా కావచ్చు. క్లుప్తంగా వ్రాయండి. చెప్పదలచుకొన్నదానిని నేరుగా వ్రాయండి. విమర్శ వ్యక్తిగతంగా గాక, విషయంపైనే ఉండాలి. ద్వేషపూరిత వ్యాఖ్యలకు తావులేదు. చదువరుల అభిప్రాయాలు కేవలం వారివే. పత్రిక సంపాదకునికి, ప్రచురణకర్తలకు ఏమీ వర్తించవు.

### జాతీయ పార్టీగా తెలుగుదేశం?

తెలుగుదేశం పార్టీ అధినేత తమ పార్టీని జాతీయపార్టీగా గుర్తింపు తెచ్చుకోవడంకోసం ఆ పార్టీకి తెలుగు మాట్లాడే ప్రజలున్న తమిళనాడు, కర్నాటక, మహారాష్ట్ర, ఒడిసా రాష్ట్రాలలో విస్తరింప పూనుకొన్నారు. మన రాష్ట్రంలో తమిళ, కన్నడ, మరాఠీ, ఒడిసా మాట్లాడే ప్రజలు సరిహద్దు జిల్లాలలో వున్నారు. కర్నాటక, తమిళనాడులలో కొన్ని తెలుగు కులాలవారిని 'బిసి' కేటగిరిలో చేర్చారు. తద్వారా వారు రిజర్వేషన్ ప్రయోజనాలను పొందుతున్నారు. అక్కడి తెలుగు వారందరూ మెజారిటీ భాష మాట్లాడేవారితో మమేకమై ఆ రాష్ట్రాలలో వున్న పార్టీ సభ్యులుగ, ఓటర్లుగా కలిసి, మెలిసి ఉంటున్నారు. ఇప్పుడు అటువంటి వారిని ప్రాంతీయపార్టీ అయిన తె.దే.పా.లో చేర్చుకుంటే వారందరూ ఆయా రాష్ట్రాలలో వివక్షతకుగురి అయ్యే ప్రమాదం వుంది. "మా రాష్ట్రంలో వుండి, మా సంక్షేమాన్ని పొందుతూ, రిజర్వేషన్లు అనుభవిస్తూ, మీ భాష ప్రాతిపదికన పార్టీ పెట్టుకొని, మాతో పోటీ చేస్తారా? మీరెలాగూ అల్పసంఖ్యాకులు,మీ భాషాభిమానంతో, మా ఉప్పుతింటూ,మాకు వ్యతిరేకంగా పోటీచేసి, మమ్ములను బలహీనపరుస్తారా?" అని వారడిగితే, మన తెలుగు సోదరులు ఏ విధమైన జవాబు ఇవ్వగలరు? మీది వేర్పాటువాదం అని నేరాన్ని ఆపాదించరా? చిత్తూరు జిల్లాలో ఎంతో మంది తమిళులున్నారు, వారు ద్రవిడ పార్టీల శాఖలు పెట్టి తే.దే.పా.కు వ్యతిరేకంగా పోటీ చేస్తుంటే అటువంటి తమిళులను తెలుగువారు ప్రేమిస్తారా? ద్వేషిస్తారా?

దివంగత నందమూరి తారక రామారావుగారు తెలుగుదేశం పార్టీని ఎందుకు పెట్టారంటే, మనకు ప్రత్యేక అస్థిత్వం ఉందని, మనజాతి గౌరవాన్ని దేశమంతటా చాటటంకోసం మనలను పదే పదే అవమానపరుస్తున్న కాంగ్రెస్‌కు బుద్ధి చెప్పడానికి తే.దే.పాను స్థాపించి-కాంగ్రెస్‌ను మట్టి కరిపించి 1989-సంవత్సరంలో ఢిల్లీలో కాంగ్రెసేతర ప్రభుత్వాన్ని నిర్మింపజేశారు. దాంతో తెలుగువారంటే, రామారావుగారంటే భారతదేశమంతటా గుర్తింపు వచ్చింది. రామారావుగారిది ప్రాదేశిక ఆత్మగౌరవంతో కూడిన సమగ్ర భారతీయత. ఆయన తర్వాత తె.దే.పా.కి ఒక నిర్దుష్టమైన రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, సిద్ధాంతపరమైన భావజాలం కనిపించదు. కేవలం తెలుగునేలమీద కాంగ్రెస్-దుష్టపాలనను అంతమొందించడం, రాష్ట్ర వనరులను ఉపయోగించుకుని రాష్ట్ర ప్రజల అభివృద్ధికి మాత్రమే కట్టుబడిఉన్నది. మన పొరుగు రాష్ట్రాలయిన తమిళనాడు, కర్నాటక, మహారాష్ట్ర, ఒడిషాలతో నదుల విషయంపై తీవ్రమైన విభేదాలున్నాయి. కలహాలున్నాయి. చివరకు ఇప్పటివరకు కలిసి వున్న మన తెలుగు రాష్ట్రం తెలంగాణాతోనే ఒక నదులేకాదు. మరెన్నో విషయాలలో కలహిస్తున్నాం. తెలంగాణాని ఏలుతున్న తెలంగాణా రాష్ట్ర సమితి, తె.దే.పా. మా నేలమీద ఎందుకు ఉండాలని, అక్కడినుండి తరిమిగొట్టేస్తామని, పదేపదే చెబుతున్నారు. తెలుగు ఆధిక్యం ఉన్న తెలంగాణాలోనే ఉనికి క్లిష్టతరమౌతున్న పరిస్థితులలో, ఏవిధంగా తె.దే.పా సరిహద్దు రాష్ట్రాలలో కార్యకలాపాలు ప్రారంభించి తెలుగువారికి మంచి చేయగలదు?

**త్రిపురనేని హనుమాన్ చౌదరి**

98490 67359 , hanuman.chowdary@tes.com

### కంప్యూటర్ లో వాడకానికి తెలుగు రాతలో మార్పులు రావాలి.

ఇప్పుడున్న స్థితిలో తెలుగును కంప్యూటర్లో రాయటం చాలా ఇబ్బందిగా ఉన్నది అన్న మాటను అందరు ఒప్పుకొంటారు. అక్కరాలు చాలా ఎక్కువగా ఉన్నాయి. వాటి వత్తు మాటలతో గుణింతాలతో కొన్ని వందల గుర్తులౌతున్నాయి. వత్తులు ఒక దాని కింది ఒకటి వచ్చి వరుస చోటును అసౌకర్యంగా పెంచుతున్నాయి. ఎప్పుడూ వాడని అక్కరాలకు కూడా మీటలను వదలవలసి వస్తున్నది.

ఇటీవల జరిగిన భాషా శాస్త్రజ్ఞుల సమావేశంలో ఆచార్య కనకయ్యగారు తెలుగు రాతలో పెను మార్పులను సూచించారు. తెలంగాణా భాషలో మహాప్రాణాలుండవు. చిన్న పిల్లలు వీటిని నేర్చుకోవడానికి ఇబ్బంది పడతారు. కాబట్టి వీటిని తీసివేయవచ్చు. అలాగే అచ్చుల్లోని దీర్ఘాలన్నింటిని ఒకే గుర్తుతో చూపవచ్చు. మొత్తం మీద 25 అక్షరాల వర్ణమాల సరిపోతుంది అని వారు చెప్పారు.

తెలుగుకోసం నిక్కువంగా పనిచేస్తున్న కేంద్రీయ విశ్వవిద్యాలయం ఆచార్యులు ఉమామహేశ్వరరావు గారు తెలుగు భాష సంగణనం పేరిట కంప్యూటర్లో తెలుగు వాడకంలో వస్తున్న ఇబ్బందులు వాటి పరిష్కారాలపై వివరంగా ఒక పొత్తమునే రాశారు. పైగా వారు చెప్పిన, తెలుగు రాతలో అవసరమైన మార్పులను ఆ పొత్తంలో వాడి చూపించారు.

**పారుపల్లి కోదండరామయ్య**

*9505298565, korapa4@gmail.com*

### సమాచార కమీషనర్ల తీర్పులుతెలుగులో రావాలి

1) ఆంధ్ర రాష్ట్ర సమాచార కమీషన్ లో 9 మంది కమీషనర్లు ఉన్నా అందులో ఒకరైన తాంతియా కుమారి గారు మాత్రం తెలుగులో తమ తీర్పులు వెలువరిస్తున్నారు. వివరాలు పరిశీలించండి. 9 మందిలో ఎవ్వరూ తెలుగులో తీర్పులు ఇవ్వడంలేదు. కానీ తాంతియాకుమారిగారు మాత్రము తెలుగులోనే తన తీర్పులన్నీ ఇస్తున్నారు. ఈ అంశంలో వారి అనుభవాలు లేక ఎదురైన కష్టనష్టాలు గురించిన వివరాలతో ఒక వ్యాసం మన పత్రికలో ఇవ్వవచ్చుని నా ఆలోచన.

2) కేంద్ర సమాచార హక్కు కమీషనర్ అయిన తెలుగువారు మాడభూషిశ్రీధర్ గారు కూడా కేంద్ర కమీషను స్థాయిలో మొదటిసారిగా పోలవరం సంబందిత కేసులో తమ తీర్పును ఆంగ్లముతో పాటు తెలుగులో ఇవ్వాలని ఆలోచిస్తున్నట్లు 8-5-15 తేదీ నాటి సాక్షి దినపత్రికలో తన వ్యాసం ద్వారా తెలిపారు. ఈ విషయమై కూడా మీరు చొరవతీసుకుని వారు తెలుగులో కూడా తీర్పు

ఇచ్చేటట్లు వత్తిడితేవడానికి మీ పలుకుబడిని ఉపయోగించగలరు. వారు తీర్పు తెలుగులో ఇచ్చి ఉంటే ఆ అంశంపై కూడా మన పత్రికలో విశేషాలతో వ్యాసాన్నిచ్చి తెలుగు భాషకు సేవచేస్తున్న వ్యక్తులకు గుర్తింపు కలిగించి తెలుగు ఉద్యమానికి ప్రోత్సాహము ఇవ్వగలరు.

**కేతిరెడ్డి లక్ష్మీధర్,** కావలి,

## ఏప్రిల్ సంచిక వ్యాసాలపై స్పందన

1993నుంచి 2013 వరకు 20 ఏండ్లు మాతృభాష 'తెలుగు' పరిరక్షణకై దీక్షగా నడిచిన 'నడుస్తున్న చరిత్ర'ను ఆపినందుకు విచారించినా, ఇప్పుడు మార్చి 2015 నుంచి అదే ధ్యేయంతో 'అమ్మనుడి' పేరుతో అదేస్థాయి మాసపత్రికను వెలువరిస్తున్నందుకు మీకు నా అభినందనలు.

మొదట 'అమ్మనుడి' పత్రికకు, దాన్ని నడిపేందుకు ఏర్పడిన ట్రస్టుకు నా అభినందనలు. మార్చి, ఏప్రిల్ రెండు పత్రికలూ బాగున్నవి. 2వ సంచిక ఏప్రిల్ 2015లోని కొన్ని వ్యాసాల సమీక్షాలేక నా ఈ స్పందన.

"కొత్త రాజధాని..." డా॥ ఈమని శివనాగిరెడ్డిగారి వ్యాసం సహృదయ సందేశం. అందులోని 'ఆంధ్ర' పద ప్రస్తావన – విశ్లేషణ సరే. రెండవ పేరాలో క్రీ.శ.1వ శతాబ్దిలో గౌతమీపుత్ర శాతకర్ణి రాజధాని ధనకటకం (ధాన్యకటకం) అని, యజ్ఞశ్రీ శాతకర్ణి పాలనలో నాగార్జునుడు నడయాడిన అమరావతి, ఇక్ష్వాకుల తర్వాత పల్లవుల కాలంలో ధరణికోట. 1797లో రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు (చింతలపల్లినుంచి) తన రాజధానిని ధరణికోటకు మార్చుకొని 'అమరావతి' పట్టణాన్ని నిర్మించినట్లు వివరణ ఉంది. సరి! నా అనుమానాలు ఇవి. ఆయనకు పూర్వం– 18వ శతాబ్దికి ముందు అమరావతి పేరులేదు. కాబట్టి శాతవాహనుల (ఆంధ్రభృత్యులు) కాలంలో దీన్ని ధనకటకం అని తప్ప అమరావతి అనే పేరుతో ముడిపెట్టుట తగదు. అమరేశ్వర ఆలయ నిర్మాణం ఎప్పుడు ఎవ్వరు చేసింది తెలుపలేదు. వెంకటాద్రినాయుడు రాజధానిని ఇక్కడికి మార్చే కాలానికి ముందే ఆ ఆలయం ఉన్నట్లు మెకంజీ కైఫీయత్తులో ఉంది. దాని పొడవైన శివలింగం బౌద్ధస్థూప ఆయక స్తంభమే కదా. ఇటువంటివి ఇంకా పాలకొల్లు, భీమవరం, సామర్లకోట, ద్రాక్షారామ లింగాలు – పంచారామాలు.

వ్యాసం మొదటి, మూడవ పేరాలలోని అశోక చక్రవర్తి ప్రస్తావన – క్రీ.పూ. 3వ శతాబ్ది నాటికి ఈ ప్రాంతాన ఆంధ్రులు లేరు. శాతవాహన రాజ్యస్థాపన క్రీ.పూ.230.అదీ కరీంనగర్ జిల్లా కోటిలింగాలలో. చిముకుని నాణాలు కోటిలింగాలలో తప్ప మరెక్కడా లభించలేదు. అటునుంచే ధూళికట్ట, కొండాపురం, ప్రతిష్ఠానం, పాటలీపుత్రం వారి ప్రయాణం. క్రీ.శ.1, 2 శతాబ్దాల్లోనే ధరణికోట వాళ్ళ రాజధాని. అశోకుని కాలం వారు స్థానిక తెలుగు ప్రజలు–రాజులు. స్తూప నిర్మాణం వాళ్ళదే. ఈ స్తూపం (దీపాలదిన్నె) విస్తరణ మాత్రమే. క్రీ.శ. 2వ శతాబ్ది రెండవ నాగార్జునునిది,

మూడవ పేరా విషయం గజిబిజి. బౌద్ధ సాధులు ఏ కాలంవారు? 'క్రీ.పూ. 3వ శతాబ్దినాటి శైవ స్థావరమైనవడ్లమాను వల్ల జైనులు...' ఏమిటిది? క్రీ.పూ.లో శైవం ఉందా? జైన బౌద్ధాల తర్వాతనే కదా వైదికం శైవ వైష్ణవాల హిందూ పురాణాల మతమైంది. పైగా శైవస్థానం వల్ల జైనులెట్లా? కానయితే, అనేక జైన మందిరాల వలె జైనబసతి మారి శైవ మతం అయి ఉండవచ్చు. 'వైకుంఠపురం వెంకటేశ్వరస్వామి' పూర్తిగా నవీనుడు కదా. పూర్వ చారిత్రక విషయాలలో ఆధునిక అంశాలు కలిపితే ఎట్లా? ఇక, నాటి చర్మకారుడు బహుకరించిన పూర్ణకలశ శిల్ప శిలాఫలకం 1వ శతాబ్దిదన్నరు. నాగార్జునునిది 2వ శతాబ్ది. డా॥ రెడ్డిగారు స్థపతి, పురా చరిత్ర పరిశోధకులు. వారి నిర్ణయాలను ప్రామాణికంగా భావిస్తం. కాబట్టి, ఎంత పని ఒత్తిడిలో ఉన్నా ఆషామాషీగా రాయవద్దని మనవి. మరొక్క అంశం– కొత్త రాజధాని (ఆంధ్ర) ప్రదేశాల–విగ్రహాల పేర్లలో కాకతీయ చక్రవర్తుల ప్రస్తావనలేదు. వాళ్ళువద్దా? సీమాంధ్ర వేంగి చాళుక్యులు, రెడ్డిరాజులు, విజయనగరం రాయళ్ళు తెలంగాణకు ఏమీ కాకపోవచ్చును కాని, ఓరుగల్లు కాకతీయ సామ్రాట్టులు సమస్తాంధ్ర దేశానికి ఏలికలు కదా. ఆలోచించండి!

**రెండవవ్యాసం– డా॥ వావిలాల సుబ్బారావుగారిది.** వీరిది అమరావతి. బౌద్ధ ధర్మావలంబి. హిందూ పురాణాల స్వర్లోక పురిగా 'అమరావతి'పై వారి హర్షాతిరేకం వింతే! వారి తండ్రిగారి పద్యాలకు అభినందనలు, నావద్ద ఆ కావ్యముంది. వారుపంపిందే. 11వ, పుటలో ఒకలేఖ అని రచయిత సుహృల్లేఖ – రత్నావళి పేర్లు ఉటంకించుట వచన భంగం కదా. అవి లేఖారూప సంస్కృత రాజనీతి కావ్యాలు. రాజ సంబోధన (ఏ రాజో) పేరు మాత్రం లేదు.

**కె.శ్రీనివాస్‌గారి 'రెండు రాష్ట్రాలు–ఒక తెలుగు'** (13వ పుట) వ్యాసంలోని వారు వెలిబుచ్చి మాతృభాషాభిమానం ప్రశంసనీయం. 'రుద్రమదేవి' సినిమా నటుని డైలాగులకేంగాని, తెలంగాణ ఉద్యమ ప్రస్తావన సరియైనదే. ఒకమాట – 'తిరునాలలు' సరికాదు. తిరు తమిళ పదం. శ్రీ లేదా పవిత్రమైన అని దాని అర్థాలు. ఉ॥ తిరుమది–శ్రీమతి, తిరుపది–శ్రీపతి. తిరునాల అంటే తిరునాళ్ళు–జాత్రలు అని రచయిత ఉద్దేశ్యం. తిరు సరే, నాల సరికాదు. నాడు–దినం, దేశం, పూర్వం అని మూడర్థాలు. నాడులు, నాళ్ళు, తిరునాళ్ళు అనే పదం సరియైన రూపం. తల్లినుడిపై వారి అభిమానానికి ధన్యవాదాలు.

15వ పుట – డి.పి.అనూరాధగారి వ్యాసం ఆలోచనీయాంశం.శ్రీలంక తెలుగువాళ్ళు ఆదరంతో పలుకరిస్తే యాత్రకై వెళ్ళిన మన తెలుగు వాళ్ళు (ఒక వ్యక్తి) కసురుకున్నరట. తలతిక్క వ్యక్తులు ఎక్కువో తక్కువో అన్ని ప్రాంతాల్లో ఉన్నరు. అది ఆ వ్యక్తి స్వభావం. విషయం వివరణ సరే కాని, పలానా ప్రాంతం (ఆంధ్ర, సీమ, తెలంగాణా) అని ప్రత్యేకంగా చూపుట జరిగింది. అది తగదు. సున్నితమైన విషయం. ఆ ప్రాంతీయుల మనసులు నొచ్చుకుంటవి. సంపాదకులు ఇటువంటి పదాలపై శ్రద్ధ పెట్టవలె మరి.

**బొర్రా గోవర్ధన్ గారి బౌద్ధవ్యాసం** 18, 19పుటలు చారిత్రక విషయాలు – పాళీ, తెలుగు పదాల విషయంలో చర్చ అవసరం. ఆ పనికి ప్రస్తుతం పూనుకోను.

***గంగులబాబు గారి గల్పిక*** విషయమేదైనా ఆ భాషపై (గ్రామ్యం) ఒక పుస్తకం వ్రాయవచ్చు. సంతోషం!

**డా. ఎన్.గోపిగారి** బ్రౌన్‌కు నమస్కారం మన తెలుగువాళ్ళందరిదీ అనవచ్చు.

***తమిళనాడు తెలుగువాళ్ళు*** తమ మాతృభాషా సంస్కృతుల పరిరక్షణకు సాగిస్తున్న ఉద్యమానికి అభినందనలు.

**డా॥ మలయశ్రీ, (భౌతికవాది సంపాదకుడు)**
**కరీంనగర్. హస్తవాణి: 9866546220**

నివాళి

- శ్రీమతి సురవరం పుష్పలత

# తెలుగుజాతి వారసత్వ దినోత్సవం : మే28 సురవరం ప్రతాపరెడ్డి పుట్టినరోజు

**2015 మే 28న సురవరం ప్రతాపరెడ్డిగారి 129వ పుట్టినరోజు. ఆనాడు ప్రతి ఏటా జరుగుతున్నట్లు ఉదయం టాంక్‌బండ్‌పైనున్న ప్రతాపరెడ్డిగారి విగ్రహంవద్ద బంధుమిత్రులు అభిమానులు సమకూడి, ఆ మహావ్యక్తికి పూలదండలు సమర్పించి, వారి గొప్పదనాన్ని తలచుకొని తమ నివాళులర్పిస్తారు. సాయంత్రం ఆంధ్రసారస్వత పరిషత్తులో సభ జరుగుతుంది. ఆ రోజున తెలుగు భాషోద్యమ సమాఖ్య కార్యకర్తలు రెండు రాష్ట్రాల్లో, పొరుగు రాష్ట్రాల్లోనూ ప్రతాపరెడ్డిగారి పుట్టిన రోజును తెలుగు వారసత్వ దినోత్సవంగా జరుపుతారు. ఈ సందర్భంగా ప్రతాపరెడ్డిగారి సోదరుని కుమార్తె శ్రీమతి సురవరం పుష్పలతగారు ప్రతాపరెడ్డిగారి జీవనరేఖలలో కొన్నిటిని 'అమ్మనుడి' చదువరులముందుంచుతున్నారు.**



*బహుముఖ ప్రజ్ఞాశాలి సురవరం ప్రతాపరెడ్డి*

*"భాండాగారమె నడచిన - పగిది నడచునాతడు*
*గతచరిత్ర రూపొందిన - కరణితోచునాతడు*
*కథాకథనశక్తియొకట - కవిత్వానురక్తియొకట*
*విమర్శనాయుక్తియొకట - కలగలసిన రచయిత*
*పాత్రికేయుడో అతడు - రాజకీయ దురంధరుడో*
*పండితుడో వ్యాఖ్యాతయో - అన్నీ ఒక్కటైనవాడో"*

అని దాశరధి ప్రతాపరెడ్డిగారి సమున్నత వ్యక్తిత్వాన్ని వర్ణించారు. నిద్రాణమైన తెలంగాణాను వెన్నుతట్టి మేల్కొల్పిన వైతాళికుడు, తెలుగుజాతి పునరుజ్జీవన వికాసానికి అంకురార్పణ గావించిన మహామనిషి, సురవరం ప్రతాపరెడ్డి ఉత్తమ రచయిత, పండితుడు, పరిశోధకుడు, విమర్శకుడు, సంఘసంస్కర్త, మాతృదేశాభిమాని, దేశభక్తుడు.

రెడ్డిగారు గోలకొండ పత్రికలో ఒక సంపాదకీయంలో 'మేము మాసపత్రిక స్థాపనకాలంనుండి రెండంశాలను దృష్టిపథంలో ఉంచుకొని దేశీయుల సేవచేయుచున్నాము. మొదటిది ఆంధ్రభాషాసేవ, రెండవది జాతికుల వివక్షత లేక నిష్పక్షపాతముగా ఆంధ్రులలో సర్వశాఖలయొక్క సత్వరాభివృద్ధికి పాటుపడడం' అని పత్రిక ఆశయాలను స్పష్టం చేసిరి.

ఆనాటి తెలంగాణా ప్రజల పిరికితనం, దైన్యం, దరిద్రం, తెలుగుభాషకు పట్టిన అధోగతి, కనీస ప్రాథమిక విద్యనైన మాతృభాష ద్వారా ఆర్జించలేని అవమానం, అతికొద్ది మాత్రమే మాట్లాడే ఉర్దు భాషను తొంబదిశాతం ఉన్న తెలుగు వారిపై రుద్దడం, ప్రాథమిక సత్వాలు ప్రజలకివ్వని నిరంకుశపాలన రెడ్డిగారి మనసు కలచివేసింది. ఆత్మాభిమానం, దేశాభిమానం, మాతృభాషాభిమానం నరనరాలలో జీర్ణించుకున్న రెడ్డిగారు నిరుపమాన ధైర్యసాహసాలతో నిజాం నిరంకుశ పాలనను పత్రికలలో తీవ్రంగా విమర్శించారు. నిద్రాణమైన తెలంగాణాను వెన్నుతట్టి జాగృతం చేసిన వైతాళికుడు. విమర్శలు, కవితలు, కథానికలు, మారుపేర్లతో, భావకవిరామమూర్తి, బి. గద్వాల సిద్ధాంతి, వెట్టివెంగళప్ప, యుగపతి, చిత్రగుప్త, గ్రామసింహ వంటి పేర్లతో వ్రాసేవాడు. గోలకొండ పత్రిక పాలకులకు భయాందోళన కలిగించి, ప్రజలలో నూతన భావాంకురార్పణకు కారణభూతమైంది. వారిది విశిష్టమైన విలక్షణశైలి, నిర్దిష్టమైనభావం. విషయ వైభవంతో చదువరునాకట్టుకునే రచన వారిది.

"తెలంగాణాలో కవులు లేరు. వారిలో కవితాశక్తి మృగ్యం." అన్న వార్త కోస్తా ప్రాంతంనుండి వెలువడిన ఒక వారపత్రిక ముద్రించింది. కర్ణకఠోరమైన ఆ మాటలు రెడ్డిగారి మనసుకు ములుకులవలె గుచ్చుకున్నవి. తెలంగాణాకవుల పట్టిక తయారుచేసి, గ్రామాలలో నివురుగప్పిన నిప్పువలెనున్న అజ్ఞాత మహాకవులను గుర్తించి, వారి కవితలనాహ్వానించి గోలకొండ కవుల

సంచిక ద్వారా వెలుగులోకి తెచ్చిన ఘనత వారిది. ఇందులో 183 మంది పూర్వకవుల కవితలు, 354 ఆధునిక కవితలు ప్రచురింపబడినవి. ఇటి బృహత్కార్యం, ఏ సంపాదకుడుగాని, ఏ పత్రికాధిపతిగాని, అంతకుపూర్వం చేపట్టదు. రెడ్డిగారి అకుంఠితదీక్షకు, కృషికి, పట్టుదలకు, సాహితీజిజ్ఞాసకు గీటురాయిగా నిలిచింది 'గోలకొండ కవుల సంచిక.

రెడ్డిగారికున్న ఒకేఒక వ్యసనం పుస్తకపఠనం. శ్రీ వానమామల వరదాచార్యులు తన ప్రతాప ప్రశంసలో

'అతడు నడయాడు గ్రంథాలయంబొమూర్తి
గొనిన విజ్ఞాన సర్వస్వఖనియొకాని
అతడు జదువని పుస్తకమ్మునుటలరుదు
క్షితిని సర్వజ్ఞుడనరాదా యతని బిరుదు". అని పొగడిరి.

ఆనాటి అరాచక ప్రభుత్వ విధానాలను నిర్భయంగా, నిర్మొహమాటంగా తీవ్రమైన పదజాలంలో విమర్శించడంతో నిజాం నిరంకుశపాలకులు కన్నెర్రచేసి రెడ్డిగారిపై చర్య తీసుకొనవలెనని భావించినప్పుడు శ్రీకృష్ణుడు చక్రం అడ్డువేసినట్లు కొత్వాలుగారు వారిని సమాధానపరచి రెడ్డిగారికి రక్షణ కల్పించేవారట. కాని రెడ్డిగారిని అంత ఘాటుగా వ్రాయడం మాత్రం మాన్పలేకపోయారట. తెలుగువారు తెలుగుమాట్లాడక పోవడంపట్ల రెడ్డిగారు మిగుల ఆవేదన చెందేవారు. వచ్చీరాని ఉర్దూభాషలో దేశ్‌ముఖ్‌లు వెలమదొరలు ఒకరిలోఒకరు మాట్లాడుకొనడం హేయమని పలికి 'ఇక ఆంధ్రభాషామతల్లి కాటుకకంటినీరు చనుకట్టు పయింబడనేలయేద్వదో ఆలోచించుకొమ్మనిరి.

అలంపురీనందనామ విభ్రాజి – మల్గోబ ఫలరాజ మధుర రుచికి – అని తమతాలూకా అలంపురంలో పండే మామిడిపళ్ళ తియ్యదనంతో తెలుగుభాషా మాధుర్యాన్ని మధురంగా గర్వంగా పోల్చిన మాతృభాషాభిమాని రెడ్డిగారు.

హన్మకొండలో పద్మాక్షీ దేవాలయం, సిద్దేశ్వరాలయం, సహస్రస్థంభ దేవాలయం, వరంగల్‌కోట, బొంబాయిలోని ఎలిఫెంటా గుహలు మున్నగునవి దర్శించి వాని పుట్టుపూర్వోత్తరాలు, చరిత్రకాంశములను, వాటి వైభవాలను తెలుగువారిరందించారు. 3–3–1930లో జోగిపేటలో వైభవంగా జరిగిన ప్రథమాంధ్ర సభలో రెడ్డిగారు చక్కటి ఉపన్యాసమిచ్చి ఆంధ్రులకు నూతనోత్సాహం కలుగజేసిరి. వేమన గ్రంథాలయం, గౌలిగూడలోని బాలసరస్వతీ గ్రంథాలయంలకు కూడ రెడ్డిగారు చేయూతనిచ్చిరి. విశాల దృక్పథంగల రెడ్డిగారు ఆంధ్రులు అన్న పదము ఆంధ్రము (తెలుగు) మాట్లాడువారు అను అర్థమిస్తుందని, కులమత వర్ణములకు వర్తించనిదని, కొత్త అర్థమునిచ్చుట సరికాదని ఆక్షేపించిరి.

గోలకొండ పత్రికా సంపాదకుడుగా 23 సంవత్సరాలుగా పనిచేసి ఉత్తమ పాత్రికేయుడుగా కొత్తపుంతలు తొక్కి, తరువాతి తరాలవారికి మార్గదర్శకుడయ్యాడు రెడ్డిగారు.

రెడ్డిగారు అనేక పరిషత్తులకు సృష్టికర్త, వ్యవహర్త. విజ్ఞానవర్ధిని తనకు ప్రాణాధికమని మిత్రులతో చెప్పేవారట. 1953– ఉస్మానియా విశ్వవిద్యాలయ పాఠ్యపుస్తక నిర్ణయ సభ్యులుగానుండి చక్కటి సూచనలచ్చి సహాయపడిరి. రెడ్డిగారికి లలితకళలన్న అభిమానం మెండు. అనేక ప్రాచీన చిత్రములను సేకరించిరి. అడవి బాపిరాజుగారు అమూల్యమైన రాజపుత్ర చిత్రలేఖనము రెడ్డిగారికి బహూకరించిరి. ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితల సంఘం, లక్ష్మణరాయ పరిశోధకమండలి, విజ్ఞానవర్ధిని పరిషత్తు–స్థాపన నిర్వహణలలో రెడ్డిగారికి ప్రత్యక్ష సంబంధం కలిగియుండిరి. శ్రీకృష్ణ దేవరాయాంధ్రభాషా నిలయము, వేమనాంధ్ర భాషా నిలయము, గ్రంథాలయోద్యమాలకు ఇతోధికంగా సేవలనందించారు. ఆంధ్ర విద్యాలయ అవతరణకు, విశేషకృషిచేసిరి. ఆయుర్వేద విద్యాలయం, సంస్కృత విద్యాలయం, బాలికోన్నత పాఠశాలవంటి సంస్థల రూపకల్పనకు, ఆవిర్భావానికి రెడ్డిగారే కారణభూతులయ్యారు. రెడ్డిగారు నిర్మలమైన ప్రేమకు కులమత భేదముగాని రాజుపేద అను భేదభావముండదని ప్రేమార్పణము అన్న కవితలో తేటతెల్లము చేసిరి. సోమనాథ దేవాలయ వినాశకారకుడైన మహమ్మదు ఘజ్నీని విజ్ఞతను గూర్చి 135 పంక్తుల గీతమాలికను, ధర్మాసనం అన్న యమునితీర్పువంటివి, గార్ధభేశ్వర స్తోత్రము, వరునవేదివంటి ఖండకావ్యాలను రచించిరి. దేశమాత పద్యాలువారి దేశభక్తిని చాటుచున్నవి. మద్యపానము వలన కలుగు కష్టనష్టములను సరళ సుందరంగా బోధించిరి.

'ధనమా వ్యయమై పోవును
మనమా చుఱుకుందనమును మానును; యశమా
దినదినము క్షీణించును
తనువా చెడిపోవు కల్లు త్రావుటచేతన్.

## ఆంధ్రుల సాంఘిక చరిత్ర

ప్రతాపరెడ్డిగారి నిశిత పరిశీలనాదృష్టికి, పరిశోధనా పాటవానికి గీటురాళ్ళుగా నిలిచి వారికత్యంత కీర్తిప్రతిష్టలనార్జించిన గ్రంథరాజములు మూడు ఆంధ్రులసాంఘికచరిత్ర, రామాయణ విశేషాలు, హిందువులు పండుగలు.

'ఆంధ్రుల సాంఘిక చరిత్రయను మహోత్కృష్ట గ్రంథము సురవరం ప్రతాపరెడ్డిగారి వ్యక్తి విజ్ఞాన సర్వస్వమని నొక్కి వక్కాణింపదగియున్నదని "శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారు ప్రశంసించిరి. "రాజులచరిత్రలు మనకంతగా సంబంధించినవికావు. సాంఘిక చరిత్రలు మనకు పూర్తిగా సంబంధించినట్టివి. మన ముత్తాలెట్టివారైయుండిరో, మన అవ్వలు ఎట్టి సొమ్ములు ధరించిరో, మన పూర్వులేదేవతలనుగొల్చురో, ఏయాటలతో వినోదించిరో, క్షామము మొదలగు ఈతిబాధలు కలిగినపుడెటుల రక్షణచేసికొనిరో, ఎట్టి కళలయందు ప్రీతికలిగియుందురో, అవన్నియు తెలిసికొనవలెనని మనకు కుతూహలముండును. అదేవిధముగా మన తరమును గూర్చి ముందు తరమువారు, తెలిసికొననభిలషింతురు. సాంఘిక చరిత్రయే మన చరిత్ర. మనముకూడ చరిత్రకెక్కదగినవారమే" – ఆ పుస్తకంలో వ్రాశారు ప్రతాపరెడ్డిగారు.

రెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో ప్రధానంగా

పరిశీలించిన అంశములు. మతము, సంఘసంస్కారము, యుద్ధతంత్రము, సైనిక వ్యవకస్థ, వ్యాపారము, పరిశ్రమలు, కళలు, ప్రజాజీవన విధానము, (జనుల ఆచార వ్యవహారములు, వారి వినోదములు, పిల్లల ఆటలు, స్త్రీల ఆటలు, జాతరలు, అచ్చట-ముచ్చట్లు, కళలు-సంగీతము, నృత్యము, చిత్రలేఖనము, విద్యలు, బ్రాహ్మణవిద్యలు, వృత్తివిద్యలు, పంచాయతీ విధానము, సభలు, నాణెములు, కొలతలు, లిపులు, ఆర్థికస్థితి-బోగభాగ్యములు, క్షామములు- కరువుకాటకములు, వైద్యము, గ్రహచికిత్సలు, మూఢాచారములు, రెడ్డిగారు ప్రజాజీవిత చిత్రణకు గేయములకు, వీరగాథలను పల్లెపదాలను ప్రామాణికంగా గ్రహించిరి. ఎన్నో గ్రంథాలను పరిశీలించిరి.

ఆంధ్రుల సాంఘిక చరిత్రను కొన్ని ప్రకరణాలుగా విభజించిరి. తూర్పు చాళుక్య యుగము, కాకతీయుల యుగము, రెడ్డిరాజులయుగము, విజయనగర సామ్రాజ్యకాలము, విజయనగర పతనానంతరకాలముగా విభజించిరి. రెడ్డిగారి, కార్యదీక్ష, పరిశోధనాకౌశలం అశేష శేముషీ వైభవాన్ని చాటి చెప్పే గ్రంథరాజము ఆంధ్రులసాంఘిక చరిత్ర. దాదాపు ఇరవై సంవత్సరాల నిర్విరామకృషి, ఫలితంగా రెడ్డిగారు రూపొందించిన ఆంధ్రుల సాంఘిక చరిత్ర అత్యుత్తమగ్రంథంగా కేంద్ర ప్రభుత్వం గుర్తించి రూ.5,000లు బహుమతిని ప్రకటించి వారి మరణానంతరం వారి కుటుంబసభ్యులకందచేసింది. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు ఈ గ్రంథంనుచదివి - "స్వాతంత్ర్యము సిద్ధిఇంచిన తరువాత ఆంధ్రసాహిత్యములో వెలువడిన అనర్ఘరగంథాలు కొన్నింటిలో ఈ గ్రంథము అగ్రగణ్యమని నమ్ముతాని" వ్రాసిరట.

"రాజుల వైభవంబులును రాణులు ప్రేమకథా కలాపపున్
మోజుల దేలువేల్చరి తముల్లదవ న్వినరోసి వ్రాసెన
వ్యాజలివిధాన తన్నొడరి యాంధ్రుల సాంఘిక సచ్చరిత్రముల్-
క్ష్మాజనముల్ నుతింపు బహుమానముల గురిపింప పండితుల్

అని వానమామలై వరదాచార్యులు రెడ్డిగారిని పొగడిరి.

సి. నారాయణరెడ్డిగారు

తన పరిశోధనాత్మను పిండి 'ఆంధ్రుల
సాంఘిక చరిత "సంతరించె
తననేల సారస్వతశ్రీల "గోల్కొండ
కవులసంచిక "లోన నవదరించె
తన కవితా చణత్వమును "హంవీరస
భవ" కావ్యఖండాన పాదుకొల్పె
తన రాజకీయ నైపుణ్యమును పత్రికా
సంపాదకత్వాన చాటిచూపె
తనప్రజాహిత మలిని గ్రంథాలయోద్య
మ ప్రసారమ్ము కొరకు ధామమ్ముజేసె;
తనదు సర్వమునొడ్డి ప్రతాపరెడ్డి

1925 సంవత్సరము వనపర్తి నియోజక వర్గమునుండి శాసనసభ్యుడిగా ఎన్నుకొనబడినను రాజకీయాలలో రాణించలేదు రెడ్డిగారు. తన యావజ్జీవితము భాషాభివృద్ధికి తద్వారా దేశాభివృద్ధికి పాటుపడిన కర్మవీరుడు సురవరం ప్రతాపరెడ్డిగారు 1953 25నాడు తనువు చాలించిరి.

**రచయిత ఫోన్: 8897597523**

## ఇవీ ముచ్చట్లు...




ఒక సాహిత్య సభ జరిగింది. ఆ సభలో అలతి అలతి తెలుగు మాటలతో ఒక కుర్రాయన ఒక కవితను చదివాడు. అందరూ చప్పట్లతో అభినందించారు. ఆ తర్వాత ఒక పెద్దాయన తన పాండిత్య ప్రతిభనంతా నింపి ఒక కవితను చదివాడు. అందులో ఆయన గుదిగ్రుచ్చిన పదాలు దాదాపుగా సంస్కృతానివే. రెండో మూడో మాటలు - కంప్యూటర్స్, ఆన్‌లైన్, డౌన్‌లోడ్ అనేవిమాత్రం ఇంగ్లీష్ ఉపయోగించాడు. నుంచి, లో, ఉంచి, తీసి, నవ్వు వంటి మాటలు ఆరో ఏడో తప్ప తక్కినవన్నీ కఠినమైన పదాలూ, సమాసాలూ. ఆయన ఆ కవితను చదువుతుంటే అద్భుతంగా ఉందని సంతోషిస్తూ సభికులు చప్పట్లు కొట్టారు.

ఇద్దరు తెలుగు ఉపాధ్యాయులు ఆ సభలో పాల్గొని, బయటకు వస్తూ మాట్లాడుకొంటున్నారు. వాళ్లకొచ్చిన సందియం ఏమిటంటే జనం ఆ కుర్రాడి కవితకూ చప్పట్లు కొట్టారు. ఈ పండితుడికీ చప్పట్లు కొట్టారు. ఇంతకీ వీళ్లు ఎవర్ని మెచ్చుకున్నట్లు? అంటూ వాళ్లలో ఒక మాస్టరుగారు అన్నాడు. రెండో ఆయన దానికి నవ్వేస్తూ "మాస్టారూ, మొదటి కవిత పూర్తిగా జనానికి అర్థమయింది. మనసులు కదిలి, చప్పట్లుగా మ్రోగాయి. పండితుని కవితలు ఎవరికీ అంతుబట్టలేదు. అయినా, ఆయన పెద్దగొంతుతో అన్నన్ని సమాసాలతో చెప్పేసరికి ఆయన పాండిత్యానికి దిమ్మతిరిగి చప్పట్లు కొట్టారు" - అన్నాడు. దానికి మొదటి మాస్టారు "కుర్రాడిది జనపక్షం - అంటే గిడుగుపార్టీ! పండితుడిది గ్రాంథికవాదుల పార్టీ అన్నమాట! ఇంకా ఇలా ఉన్నారన్నమాట!!" అని నిట్టూర్చాడు.

కడప కత

- శ్రీ బత్తుల ప్రసాద్

# బొటికనేలు దరువు కత

**ఎండా**, కాలం ఉడుకుతాంది .. ఆకులు రాలుతాండాయి..మా చర్చికాంపౌండులో ఉండే యాప చెట్లు ఆకు రాలుచ్చాండాయి..మా యమ్మ మా యక్కోళ్ళు రోజూ తెల్లారతానే లేసి ఆకులు అన్నీ ఊడ్సి దిబ్బకు ఏచ్చాండారు.. అప్పుడప్పుడే శింత శిగురు మొలుచ్చాండాది. ఒక రోజు పొద్దన్నే మా ఇంటి కాడికి అవులక్క కూరగాయల గంప ఎత్తుకోని వచ్చింది. వంకాయలు తమేట కాయలు తీసుకోని వచ్చింది. మా యమ్మ వంకాయలు తీసుకున్నెది అవులక్క కాడ ఆ వంకాయలు సూచ్చానే నాకు నోరు ఊరింది. అంతే మా ఇంటికాడ ఉండే శింత శెట్టు ఎక్కితి..నేను అట్ట శింత శెట్టు ఎక్కడం జూసి మాయమ్మ .. సూచ్చివా అవులక్క నా కొడుకు శెప్పకుండానే ఎట్ట శెట్టు ఎక్కుతుండాడో వంకాయలు సూచ్చే వానికి బో కుశాల .. అన్నెది ...అవులక్క కూడా నేను శెట్టు ఎక్కడం జూసి ఓరినీ పిల్లోడా అన్నెది.. నేను మాత్రం చింత శెట్టు కొమ్మల శివర్లకు పొయి యాలాడతా శింత శిగురు తెంపితి..రెండు నిక్క జోబులు నిండినాక సొక్కా నిక్కర్లోకి తోసి శింత శిగురు కడుపు కాడ పెట్టుకుంటి..ఇంగ పెట్టుకోడానికి ఎక్కడా లేక దిగి వచ్చి మంచం మీద చాట పెట్టి నా జోబుల్లోది సొక్కా లోది శింత శిగురు ఇదిలిచ్చి అప్పుటికే మాయమ్మ వంకాయలు .. కోచ్చాంది నేను ఏటికి పోయి వచ్చి .. నేను వచ్చార్కనే మాయమ్మ వంకాయ వట్టిశాపలు శింత శిగురు కూరాకు శేచ్చాంది.. ఒక పక్క సంగటికి పెట్టింది...సంగటి కుత కుతా ఉడుకుతాంది.. ఇంగొొక పక్క వంకాయ వట్టిశాపల కూర గమాయిచ్చాంది. రాగిపిండి వాసన..వాసన ..ఇంగొొక పక్క వంకాయలు వట్టిశాపలు శింత శిగురు కూరాకు వాసన నాకు ..కడుపులో ఎలకలు పరిగెత్తాండాయి.. మా యమ్మ నీళ్ళు పోసుకో పో నాయినా అనె .. సరేలే మా అనుకుని పోయి గబ గబా రెండు శెంబులు నీళ్ళు గుమ్మరిచ్చుకోని వచ్చి... గబ గబా తుడ్సుకుంటి. నేను వచ్చారకనే మా యమ్మ సంగటి కుండకు పంగల కర్ర ఆనిచ్చి దాని మీద కాలు పెట్టి తాటి తెడ్డుతో సంగటి గెలుకుతాంది ..నేను నెత్తి తుడ్సుకోని గుడ్డలు ఏసుకోని వచ్చారక మాయమ్మ సంగటి బండమీద బోర్లిచ్చి బోలు తీసుకోని .. సంగటి ముద్దలు శేచ్చాండాది.. మా యన్నోళ్ళు మా యక్కోళ్ళు అందరూ వర్సగా వచ్చి కూచ్చుండిరి ..మాయమ్మ ఒక గిన్నెలో సంగటి పెట్టి కూరాకు ఏసి నాకు ముందు ఇచ్చింది.. మా చంద్రక్క ఏమ్మా వానికి ముందు ఇచ్చాండవే అంటే నా శిట్టి కొడుకు పొద్దనే అడక్కుండానే .. శింత శిగురు కోసుకోని వచ్చినాడు నువ్వు అట్టున్న పుల్ల ఇట్ట తియ్యవు.. వానికి పెడితే ఏడుచ్చావు అని మా యక్కను తిట్టింది. మా యక్క అలిగింది.. అలుగు పో నీ కడుపే కాలుతుంది అన్నెది. అది రోజూ జరిగేదే.. నేను మాత్రం ఉడుకుడుకు రాగి సంగటి.. వట్టిశాపలు వంకాయ శింత శిగురు కూరలో అద్దుకోని మింగితి.. ఆ కూర సంగటి అదొొక అమృతం .. జీవితంలో మర్సిపోలేని కూరాకు అది .. అందరం సంగటి తింటిమి.. అందరు తిన్నాక

ఒక రోజు మా నాయన మూకట తీసుకోని రెండు మెరప కాయలు .. నాలుగు కరెప్పాకు ఆకులు రెండు మూడు తెల్లబాయలు.. కళ్ళు ఉప్పు తీసుకోని ఒక శిన్న గ్లాసులో నీళ్ళు తెచ్చుకోని మంచం ఎల్లెలక ఏసి దాని మీద కూచ్చోని మూకట ఒళ్ళో పెట్టుకోని .. ఒట్టి మిరప కాయలు .. ఉప్పు కరెప్పాకు అన్నీ ఒకటి అయినాక ఒకటి మూకట మీద రుద్దుతా ఒక శేత్తో నీళ్ళు శేతిలోకి తీసుకోని .. ఒక్కొ సుక్క ఇడుచ్చా .. ఉండాడు ...అట్ట శానాసేపు రుద్దితే అయన్నీ అరిగి పోయి .. రసం అయింది ఎర్రగా. దాన్ని అట్టనే మూకట్లో పెట్టి శెయ్యి కడుక్కున్నాడు మా నాయన



**ఆ రోజు మాపిటేల మా నాయన మంచం కాళ్ళ కట్ట బిగిచ్చాంటే మా నాయనకు వరసైన ఆయప్ప వచ్చి ఏం మామా వానలు పడక పాయ అన్నాడు.. దానికి మా నాయన ఒరే నన్నడిగితే కురుచ్చాయా ఆ దేవుడిని అడుగు అన్నాడు.. అది కాదు లే మామ నీకు శెతురు ఎక్కువ గాని ఇంతకు ఏమి తింటివి ఇయ్యాల అన్నాడు.. ఏముందోయ్ కూరా నారా ఏమి లేకుంటే బొటికనేలు దరువేచ్చి ... అన్నాడు మా నాయన ..నాకు ఆ మాట అప్పుడు తెలిసింది..**

మిగిలిన సంగటిలో కూరాకు ఏసుకోని మాయమ్మ కూడా తినింది. ..మా యమ్మ తువ్వాలుతో శెయ్యి తుడ్సుకోని ..ఇంగ పా నాయనా అనె నేను మా యమ్మ మా యక్కోళ్ళు కొంగల రామాపురం తిట్టు దావబడ్తిమి ..కొంగల రామాపురంలో యారో పెద్దయ్య గారి కల్లంలో శెనక్కాయులు తెంవడానికి పోతిమి...మా యమ్మ మా యక్కోళ్ళు శనక్కాయ కట్ట తెంపుతాంటే ...నేను కాసేపు తెంపి ఒక సంచి తీసుకోని శెనక్కాయ శేనితట్టు పోతి ..అప్పటికే సోమయ్యాగాడు ఆడికి శేరుకున్నాడు .. నన్ను జూసి నవ్వినాడు నేను కూడా నగితి ..సుబ్బారెడ్డి ఎద్దులను అదిలిచ్చా పీకేసిన శెనక్కాయ శేనుదున్నుతున్నాడు..శెనక్కాయ పీకినాక కొన్నికాయలు భూమిలోనేమగిలి పోతాయి.. ఆ కాయలను శేనిగల్ల వారు తీసుకోరు.. కాకులు .. పిట్టలతో పాటు కొందరు ఏరుకుంటా ఉంటారు..నేను సోమయ్య గాడు సాలంబడి శనక్కాయలు పోటీ పడి ఏరుకుంటిమి .. అది అర ఎకరా కయ్య కాడంతో పయిటాల కల్లా దున్నడం అయి పోయింది. సుబ్బారెడ్డి కాడిని అట్టనే వదిలేశి సద్ది తినడానికి పోయినాడు..నేను సుబ్బారెడ్డిని అడిగి మడక దున్నడం తిరుక్కుంటి..పగ్గం పట్టుకోని ఎద్దులను అదిలిచ్చాంటే ఆ ఆనందం యాడ గూడా రాదు.. పగ్గాలు ఒక శేత నాగలి ఒక శేత పట్టుకోని ఎద్దులను అదిలిచ్చా.. పా..ఓ.. అహె అహె అనుకుంటా .. ఉంటే అలవాటయిన ఎద్దులు తోక అట్ట ఇట్టా కదిలిచ్చా తమ మీద వాలుతాన్న ఈగలను ఇదిలిచ్చుకుంటా.. బో వయ్యారంగా నడుచ్చాంటాయి ..ఒక అరగంట ఇరుసాలు దున్నితి.. నేను దున్నుతాంటే సోమయ్య గాడు సాలంబడి శెనక్కాయులు ఏరినాడు ఆ శెనక్కాయలు ఇద్దరం బాగం పంచుకుంటిమి ..నేను కల్లం కాడికి పోయి ఇంటికి పోతాండమా అని శెప్తి మా యమ్మ శేచ్చాన్న పని ఇడ్సిపెట్టి నా కాడికి వచ్చి నేను ఏరిన శనక్కాయలను జూసి నన్ను దగ్గరికి తీసుకోని ముద్దుకున్నెది.. ఇది జూసి మాకు వర్సకు శిన్నమ్మ అయిన సంతోషమ్మ .. అబ్బ ఏమి కొడుకును కంటివే లైసక్కా అన్నెది.. నన్ను కడుపుకు అదుము కోని మా యమ్మ అమాశరోజు పుట్టినాడు కదా.. ఈ నా కొడుకు మంచి సంసారి అవుతాడు ..అంటాఉంటే .. మా శిన్నమ్మ నవ్వి ఇప్పుడు సంసారే పెద్దయినాక సూడాలి ..ఈ మొగనాబట్టలు ఆడోళ్ళ ఎంటంబడి తిరగడం తిరుక్కుంటారు .. అని అన్నెది...ఇంతలో ఆ తట్టు నడ్సుకుంటా వచ్చిన మాకు వర్సయినాయమ్మి. ...నన్ను చూసి ఓత్తా ఏంది నీ కొడుకు బుడ్డ మీరప కాయ మయిన నా మోకాళ్ళ ఎత్తుగూడా లేడే అన్నెది..మా యమ్మ నా నెత్తి నిమురుతా.. బుడ్డ మీరపకాయ కొరికి సూడే నీకే తెలుచ్చది అని మా యత్త కూతురును రెండు మూడు శెడ్డ మాటలు తిట్టింది.

నేను సోమయ్య గాడు ఇద్దరం ఇంటి దావ బడ్తిమి .. ఇంటికాడ శెనక్కాలు బానలో పోసిసంచి తీసి సూర్లో పెట్టి .. సగిలేటి దావ బడ్తిమి. అప్పుటికేమా సావాస గాళ్ళు ఈత కొడతా ఉండారు.. మేము ఏటి కాడికి పోయి గుడ్డలు ఇప్పి కంప శెట్టు కింద పెట్టి ఉరుకుతా పొయి గార గడ్డ మీద నుండి ఏట్లోకి పల్టీ కొడ్తి.. సామయ్య గాడు కొర్రు కొట్టినాడు... ఆ ఏట్లో అట్ట దూకేది మేమిద్దరమే మాకు పల్టీ కొట్టడం కొర్రు కొట్టడం అలవాటు ఒక రోజు వాడు పల్టీ కొడితే నేను కొర్రు కొడతా.. నేను పల్టీ కొడితే వాడు కొర్రు కొడతాడు నీళ్లలో దూకి మునిగీత ..ఎనకీత కొడితిమి ..అదయినంక అందరం కల్సి తాకేసుకు నే ఆట ఆడితిమి మాపటేల దాకా ఈత కొట్టి ఇంటికివచ్చారక మా యమ్మ వాళ్ళు గూడా ఇంటికి వచ్చిరి మా యక్కోళ్ళు పెద్ద రోట్లో రోకళ్ళు తీసుకోని వడ్లు దంచుతాంటే మా యమ్మ దంచిన ఒడ్లను శాటలోకి తీసుకోని శెరుగుతాంది.. నేను పోతానే మా యమ్మ మెత్తటి తౌడు పెట్టినాది ఒడ్లు దంచినాక దాంట్లో తౌడు వచ్చది అది బరుగొడ్లకు నీళ్ళలో కలపి తాపిచ్చారు...
మొగపిల్లోళ్ళు బలంగా తయారు కావాలని అట్ట మా యమ్మనాకు తౌడు పెట్టేది.. ఆ యాల మా యమ్మ వరికూడు వండినాది .. ఆ ఒరికూట్లో శింతాకు వంకాయ వట్టి శాప కూరాకు ఏసుకోను సంపితి..

అట్ట రోజుకో వంట శేచ్చాన్నది మా యమ్మ .. ఒక్కోరోజు గోవాకు కారెం ఒక్కోరోజు .. ఇంగొకటి.. ఇట్ట తింటాంటిమి .. వానా కాలం వచ్చినా కూడా వానలు కుర్సక పాయ ..కూరా నారా తినడం తక్కువాయ ..ఎండా కాలం అయి పోయినా కూడా ఇంగా వానలు పడక పాయ సగిలేట్లో నీళ్ళు కూడా ఇంకి పోయినాయి ..గుండాలు కూడా ఎండి పోయినాయి ..ఉన్న ఒక్కరవ్వ నీళ్లలో బరుగొడ్లు కడగడం సాకలోళ్ళు .. గుడ్డలు ఉతకడం తిరుక్కండార్క నీళ్లు గబ్బు పట్టినాయి.. కూరగాయులు రావడం లేదు.. ఇంట్లో కూరాకులు తగ్గి పోయినాయి. నేను మాత్రం రోజూ ఏటికి పోయి ఆడ ఈడ శిన్న శిన్న గుంతల్లో శాపలు పులమకచ్చాంటి... అట్ట ఆ నీళ్లు కూడా ఎండి పోయినాయి.. ఇంట్లో శెనక్కాయల కారెం.. ఆ కారం ఈ కారం దంచు తాండారు..

ఒక రోజు మా నాయన మూకట తీసుకోని రెండు మెరప కాయలు .. నాలుగు కరెప్పాకు ఆకులు రెండు మూడు తెల్లబాయలు.. కళ్ళు ఉప్పు తీసుకోని ఒక శిన్న గ్లాసులో నీళ్ళు తెచ్చుకోని మంచం ఎల్లెలక ఏసి దాని మీద కూచ్చోని మూకట ఒళ్ళో పెట్టుకోని .. ఒట్టి మిరప కాయలు .. ఉప్పు కరెప్పాకు అన్నీ ఒకటి అయినాక ఒకటి మూకట మీద రుద్దుతా ఒక శేత్తో నీళ్ళు శేతిలోకి తీసుకోని .. ఒక్కొ సుక్క ఇడుచ్చా .. ఉండాడు ...అట్ట శానాసేపు రుద్దితే అయన్నా అరిగి పోయి .. రసం అయింది ఎర్రగా. దాన్ని అట్టనే మూకట్లో పెట్టి శెయ్యి కడుక్కున్నాడు మా నాయన ఇంతలో మా యమ్మ సంగటి గెలికింది. ..రెండు ముద్దలు నాకు మా నాయనకు ఏసి ఇచ్చినాది.. మూకట్లో

ఉన్నదాంట్లో నేను మా నాయన. ఇద్దరం అద్దుకోని సంగటి మింగినాము.. అది కారం కారంగా బో కమ్మగా అనిపిచ్చింది. మేము మిగిలిచ్చిన దాంట్లోనే మా యమ్మ ఒక ముద్ద సంగటి ఏసుకోని తిన్నాది ..ఆ రోజు మద్యాన్నం నుండి ఒక్క రవ్వ మోడం పట్టినాది..నేను నా సావాస గాళ్ళతో కలిసి సమాధుల్లో ఉండే శెట్టుమీద కోతి కొమ్మచ్చి ..ఢీండార్ ...దొంగా పోలీస్ ఆట అడుకుంటిమి... నా సావాస గత్తె నేను ఒక సాట చెట్టు వెుదట్లో ముడుక్కుంటిమి.. సోమయ్యాగాడు మమ్మల్ని ఎంత సేపటికి కనుక్కోలేక పోతే తూచ్ చెప్పి బయిటికి వచ్చిమి.. ఆ రోజు మాపిటేల మా నాయన మంచం కాళ్ళ కట్ట బిగిచ్చాంటే మా నాయనకు వరసైన ఆయప్ప వచ్చి ఏం మామా వానలు పడక పాయ అన్నాడు.. దానికి మా నాయన ఒరే నన్నడిగితే కురుచ్చాయా ఆ దేవుడిని అడుగు అన్నాడు.. అది కాదు లే మామ నీకు శెతురు ఎక్కువ గాని ఇంతకు ఏమి తింటివి ఇయ్యాల అన్నాడు.. ఏముందోయ్ కూరా నారా ఏమి లేకుంటే బొటికనేలు దరువేచ్చి ... అన్నాడు మా నాయన ..నాకు ఆ మాట అప్పుడు తెలిసింది.. ఇంతకు నువ్వేమి తిన్నావోయ్ అంటే ఎఱ్ర కోడి కూర మామా అన్నాడు ఆ మనిషి తలకాయ ఎగరేచ్చా .. అవునులే మీ ఇంటిదావన వచ్చాంటే ఒట్టి మిరపకాయలు ఏంచుతాన్నె వాసన వచ్చాన్నది లే అని ఇద్దరూ శతురు మాటలు ఏసుకుండిరి. పేదరికంలో ఉండి వాళ్ళు తినే సామాన్యమైన తిండికి ఇట్టాటి గొవ్వ గొవ్వ పేర్లు పెట్టుకుంటారు అనేది తెలుస్సుకుంటి అప్పుడే ..ఆ రోజు బాగా ఆడి ఆడి అల్సి పోయినాను రాత్రి బువ్వతిని పడుకున్నాను..రోజూ మాదిరే మా ఇంటి ముందు వరసగా నులక మంచాలు ఏసుకోని పండుకుంటాము.. ఆరోజు గూడా మా నాయున నంకలో దూరి పడుకున్నాను..రోజు మాదిరే గాలి ఆడకుంటే మా నాయన పై పంచె తీసి ఇసురుతాన్నాడు .. ఉన్నట్టు ఉండి వాన అందు కున్నెది ..అందరూ లేసి మంచాలను ఇంట్లోకి ఎత్తక పోతాండారు.. నేను మాత్రం గోడ పక్కకు పొయి ఉచ్చ పోసుకుంటా ఉండాను..అంత వరకే మతికి ఉంది.. అందరూ మంచాలు లోపల ఏసుకోని పిల్లోళ్ళు అందరూ పండుకున్నారా... ఎవురు యాడ పండుకున్నారు .. అని ఒకసారి చూసుకుంటాంటే... నేను మా రెండో అక్క కాడ పండుకుంటాను. అప్పుడప్పుడు .. మా నాయన ఏమ్మా కళ్యాణి శిట్టి నీ కాడ పండుకున్నాడా అని అడిగినాడంట లేదు నాయనా అన్నెదంట మా యక్క అందరి మంచాల మీద ఎతికితే ఎక్కడ కూడా కనడలేదు అంట.. దాంతో ఆ జోరు వానలో మా యమ్మ నాయన మా యక్కా వాళ్ళు తలోదిక్కు ఎతుకులాడితే యాడ కూడా కనపడలేదంట .. మా యమ్మ వాంకిళ్లు పెట్టి ఏడుచ్చాందంట... ఏమయినాడమ్మా నా కొడుకు అని మేము ఉండే కాడనే ఒక పెద్ద బంగళా ఉంది దానికి బీగాలు ఏసి ఉంటారు.. బడి పిల్లోళ్ళు వచ్చినప్పుడే తెరుచ్చారు దాన్ని .. ఆ బంగళాలో ఒక హాలు ఉంటది దాంట్లో బెంచీలు వేసి ఉంటారు.. వర్సగా.. ఆ హాలుకు ఉండే ఒక తలుపుకు చిన్న బొక్క ఉంది . అంతా ఎతికి వీడు మద్యాన్నం ఆడుకున్నాడు గదా అని దాని తాళాలు తెప్పిచ్చి దాంట్లో ఎతికితే .. ఆ బెంచీల మీద పండుకోని ఉన్నానంట .. మా యమ్మ నన్ను ఎత్తుకోని గట్టిగట్టిగా ఏడుచ్చాంటే నాకు మెలకవ వచ్చినాది.. మా నాయన నన్ను ఎదకు కరిపిచ్చుకోని .. ఇంటికి తీసుకోని వచ్చి పక్కన పండేసుకున్నాడు.. మళ్ళా రోజు నేను ఎందుకు అట్ట పోయినానో మతికి లేదు అయితే .. బొటికనేలు దరువు అనేది ఎప్పుడు ఇన్నా గూడా ఆ రోజు మా నాయనతో కూకోని తిన్నె ఆ సంగటి ఆ రుచి .. ఆ రోజు నేను కనపడక పోడం మాత్రం మతికి వచ్చానే ఉంటది..మా నాయన జ్ఞాపకం మాదిరి !


**సినీ పాత్రికేయుడుగా 24 ఏళ్ళ అనుభవంగల శ్రీ బత్తుల ప్రసాద్ కథా రచయితగా తన ప్రత్యేకతను కనబరచిన వ్యక్తి. తను వ్రాసిన కథలను సగిలేటి కతలు, గంజిబువ్వ- అనే రెండు సంపుటాలుగా వెలువరించారు. ఫిల్మ్ జర్నలిస్టుగా అంతర్ముఖం, నాణేనికి మరోవైపు- అనే కథాసంకలనాలను ఆయనే కూర్చరి.**

**ఫోన్ : 7382076061**

ఇ-మెయిల్:bathulaprasad@gmail.com


కవిత

# అమ్మను చూడాలి

కడియాల కాళ్లతో
యిల్లంతా కలియ తిరుగుతూ
లక్ష్మీ కళను సంతరించి పెట్టేది
చేతులు ఇటు-అటు తిప్పినప్పుడల్లా
గాజుల గలగలలతో
సంగీత లయల్ని కూడబెట్టేది.
ఒక్కసారి ఘల్లుమని నవ్వితే
మణిమతి చిన్నబోవాల్సిందే!
దుర్గమ్మ ముక్కుపుడక సాక్షిగా
మాఅమ్మ ముక్కెరసైతం తళుక్కుమన్న గుర్తు!
మెడలోని తాళిబొట్టంత పురువుతో
నుదుట నిత్యం ఐదోతనం మెరుస్తూ
ఆమె సౌభాగ్యాన్ని చాటి చెప్పను
జడలో మల్లెలు పూయని వేళ లేదు!

ఇంటికొచ్చిన దేవుళ్లందరికీ
వున్నంతలో వండి వడ్డిస్తుంటే
కాశీ అన్నపూర్ణమ్మే మా అమ్మ అనిపించేది!
ఎంత అర్థరాత్రయినా అపర రాత్రయినా
వీధిలో కఱ్ఱ నడిచే శబ్దానికే
పళ్లెంలో అన్నమై ప్రత్యక్షమయ్యేది!
ఎన్ని మాంసం ముద్దలు
అమ్మ చేతులు మీదుగా బొజ్జుకోసుకొని
ప్రాణం పూచిన పువ్వులై నవ్వాయో!
ఎన్ని తలంబ్రాలు
అమ్మచేయి తాకిన ముత్యాలై
నూరేళ్ల పచ్చని కాపురాలైయ్యాయో!
అమ్మ అడుగు విత్తిన ప్రతిచోటా
మంగళకర శుభాలు మొలకెత్తేవి
కానీ-
అమ్మే యిప్పుడు ఆకులు రాల్చుకున్న
అడవి చెట్టై మిగిలింది.
నాన్న పోయాడన్న వార్త
అమ్మను మోడు చెట్టుగా మార్చింది.
అష్టలక్ష్ములు, నవదుర్గలు ఏకమై
అవతరించిన అమ్మను యిప్పుడు
శిథిలమైన దేవతావిగ్రహంలాగ
ఎలాచూడాలో?
ఎంత కూడగట్టుకున్నా-
గుండెనెలా సముదాయించాలో!
అయినా సరే అమ్మను చూడాలి!


**- ఈతకోట సుబ్బారావు,**
సెల్‌నం. 94405 29785

గోదావరి లోయలో
కొండరెడ్ల
బతుకు కతలు - 3

- శ్రీ పల్లాల బొర్రంరెడ్డి

# ఆలుమగలు

**మొర్రివాడు**

ఒకే ఇంటిపేరు ఉన్న పిల్లను చేసుకుంటే మొర్రి అంటరు. మొర్రి అనగ వరదలు వచ్చినపుడు కొండచివరభాగం కరిగి విరిగిపోయిన భూమి అని అర్థం. అలాగే కులంలో కొంత వెలితి ఏర్పడిది. అతని సంతానం ఎవరూ చేసుకోరు.

'దుడ్డువద్దు దూపంవద్దు - దూరపు దండలందుకుందారా
చెంబువద్దు చెల్లంవద్దు - చేతిదండలందుకుందారా'

వరసలైన పిల్లను వలచిన మొగవాడు బలవంతంగ కాకుండ ఇద్దరు ఒకటై ఇంటివారికి ఈడివారికి కులంకు తెలియకుండ ఇతర గ్రామానికి వెళ్ళిపోపుట. ఇందులో పిల్ల తల్లిదండ్రులకి, పిల్లకి అపతలి అల్లుడుకు ఇచ్చుటకు ఇష్టం ఉండదు. కొడుకుగల తల్లిదండ్రులకి ఆ పిల్లను పెండ్లిచేయుటకు ఇష్టం ఉండదు అందుకే ఇరుపక్కలవారి తీర్పులను వ్యతిరేకించి సొంతంగ పడుచులు తీసుకున్న తీర్పు.

**వెలి**

మన్నెప్రాంతంలో కొండరెడ్డి, కోయ, కొండకమ్మరి, మాల అని నాలుగు జాతులు ఉన్నవి. ఇందులో రెడ్డికులంవాడు మాలపిల్లనుగాని, కమ్మరిపిల్లనుగాని, కోయపిల్లనుగాని రహస్యంగ చేయిపట్టి ఉంటే ఈ సంగతి కులంకు తెల్సినట్లైతే తెల్సినవెంటనే కులంనుండి ఆ గ్రామమునుండి ఏ కులంపిల్లను చెయ్యిపట్టి చేసుకొనియున్నాడో ఆ గ్రామముకు తోలివేస్తారు. అతని ఇంటిలో కులపువారు భోజనం చేయరు. బంధురికలు ఉండవు కులసంబంధమైన కార్యాలను జరిపినప్పుడు అతనినిగాని అతని బంధువులనుగాని పిలువరు.

'చీమలు దేరిన మన్ను - చీమరాజు లేలుంబడి'
'కులపట్టెపట్టు - వల పట్టెపట్టు'

**కళనీళ్ళు**

ఇష్టమైన అమ్మాయిని మగవాడు తన స్వాధీనం చేసికొని తన ఇంటిలోపెట్టి ఉంచుకుంటడు. వీరు ఇద్దరిపని అయితే పూర్తి అయినది కాని కష్టసుఖాలలో పాలుపంచుకొనే గ్రామప్రజలకి విందు ఇచ్చుకొనవలె. లేనియెడల చనిపోయినప్పుడు, పెండ్లి జరిగినప్పుడు, ప్రమాదాలు ఆకశ్మికంగ జరిగినప్పుడు ఎత్తిపట్టి ఏరిపట్టి చూడరు. అందుకని విందు పెడతడు. ఇద్దరిని ఒకచోట పెట్టి పసుపుకల్పిన నీళ్ళతో ఒకరికొకరు వారికివారే పోసుకుంటరు. వారిని ఇద్దరిని నిలబెట్టి నీళ్ళు పోయించుతరు. వీటిని కళనీళ్ళు అంటరు. కళ అంటే సభముందు ఇద్దరిని ఒకటిచేసినట్లు కల్పినట్లు ఋజువు.

'కుండెడు కూటికి దాటగలడు గాని కులానికి దాటలేడు'

**కాలుదొక్కి**

తల్లిదండ్రులు, కులపెద్దలు దారినడిచి అనగ ఇతరుల మేనవారి పిల్లగాని, మేనరికము కాని పిల్లనుగాని మగవాడు అడిగించకుండనె. పెండ్లి సంబరంకు, పండుగు వేడుకలకి పోయినప్పుడు పిల్లకి ఇష్టం లేకపోయిన మగవాడు బలవంతంగా ఆ నిండు సభ చూస్తుండగా పండుగ, పెండ్లిలకి వచ్చినవారి పక్కలో ఉండగానే ఆ పిల్ల కాలుమీద ఇతని అడుగువేసి అనగ కాలువేసి తొక్కుతడు. ఆ అమ్మాయి ఒప్పుకుంటే ఈ రోజునుండి నా భార్య అని చాటుకుంటడు. ఆ రోజునుండి ఎవరు ఆ పిల్ల సంబంధంకు రారు, వెళ్ళరు. ఇతని పేరులో పెండ్లి జరిగెవరకు ఉండిపోతది. ఇతనికి తర్వాత పెండ్లి జరుగును.

'వేటలకు వెళ్ళి తెచ్చే వేడుకల ముంగిపిల్ల
కుడుపెట్టి పెంచుదమనగ కులముతోడి చెప్పుకున్నది
పాలుపోసి పెంచుదమనగ పారిపోయిది ముంగిపిల్ల'

**బోరన తోనడు**

కన్నెపిల్లను వలచిన గోవు మగవాడు. పెండ్లి సంబరం, పండుగు వేడుకలకి వెళ్ళినప్పుడు ఎవరిదారి వారిది, ఎక్కడ నిద్రపోతరొ తెలియదు. ఎక్కడ తింటరో తెలియదు. వేడుకలు రాత్రి అంత చూస్తుండి, ఎచ్చట బడితె అచ్చట దరిదాపులో ఆడ మగ వేరువేరుగా పడుకుంటరు. ఈ నిద్రమత్తులో ఉన్న ఆడపిల్లల ఒడిలోనికి చీకటి సమయంలో పోయి పడుకుంటడు. తెల్లవారినక ప్రజలు బోరన తోనడని ఆ పిల్లపేరు, ఇతనిపేరు సాటింపు అగుతది. ఈ పిల్ల అతనికె చెందుతది.

'ఈయేడు ఈలాగుందాం - కన్నెకు కలుసుకుందాం - దసరాకు దంచుకుందారా'

**పాపను ఉంచుకోవడం**

ఒకే కుటుంబంలో 5,6 గురు అన్నదమ్ములు ఉంటరు. ముందుపుట్టిన అన్న కొంతకాలం బతికి కారణంలేకుండ చనిపోతడు. అతని భార్య పిల్లలతో బతుకుతు ఉంటది. ఆమెను పాప అంటరు.

ఆమె సొంతంగ కష్టపడి జీవించుతు ఉంటది. ఆమెకి దిక్కులేనప్పుడు పోషించుకొను శక్తి లేనప్పుడు మరిదితో కలసి బతుటకు ఇష్టపడినప్పుడు మరిది వదినెను చేసుకుంటడు. మరిదిభార్య, వదినె ఒకే ఇంటిలో వేరువేరు గదులలో కాపురం ఉంటరు. ఆమె ఇతరుల పాలు అయి కష్టలు పడరాదని భావం.

'కన్నమరిది వత్తుడని - కణతబొట్ట కాసి పెట్టిదా'.

**పెండ్లి చేసుకొను మార్గాలు:**

1. లాగడం - కోరిన మగడు జనంతోపోయి తెచ్చుట.
2. మొగనాలు - ఇద్దరు కలిసి వెళ్ళిపోవుట.
3. కాలుదొక్కడం - జనంముందు పిల్లకాలు తొక్కుట.
4. బొరనతొండడం - ఆకస్మికంగా పడుకొనుట
5. దారితొక్కి పెండ్లిచేసుకొనుట.
6. ఇల్లరికం.

## పెండ్లికి మొదట – ఎదురు పోలు సంబురం

పెండ్లికూతురుకు పేరంటాలు ఇద్దరు వారిభుజాలమీద ఎత్తి కుగుడబెట్టి, పెండ్లికూతురు చేతికి కుంకుమపొట్లం కాగితంలో కట్టి ఇస్తరు. పెండ్లికొడుకును పెండ్లిపెద్దలు ఇద్దరు వారి భుజాలమీదికి ఎత్తి కుగుడబెట్టి, పెండ్లికొడుకు చేతికి కుంకుమపొట్లం ఇస్తరు. పేరంటాలు, పెండ్లిపెద్దలు ఎదురుఎదురుగ నిలిచి పెండ్లికూతురుకు, పెండ్లికొడుకు కుంకుమపొట్లాలు విప్పి, ఆ కుంకుమతో పెండ్లికూతురు పెండ్లికొడుకు పోటీగ బుగ్గలలో పూసుకుంటరు. పోటీ పూర్తి అయిన పిదప. పెండ్లిపందిరి కింద నేరేడుకొమ్మ ఇంటిముంగిట భూమిలో పాతి, పాతిన నేరేడుకొమ్మ మొదట మట్టితో పీనెపోసి పసుపు, తెలుపు రంగుల ముగ్గు వాల్చి, చెక్కిన నేరేడు బల్ల, పోలుబల్ల(బెమ్మపీట) ఉంచి, పెండ్లికూతురు పెండ్లికొడుకును పందిరిచుట్టు 3సార్లు తిప్పి, ఆ బెమ్మపీటల మీద ఊతన వధువరులను కుగుడబెడతరు.

పుత్తెలతాడు జనం అందరిని ముట్టనిచ్చుతరు. పసుపు కలిపిన బియ్యం అందరిచేతికి ఇస్తరు. పెండ్లికొడుకు పుత్తె, పెండ్లికూతురు మెడలో కడతడు. పుత్తె కట్టిన వెంటనే అక్షింతలు వేస్తరు. సీతకి శ్రీరాములవారికి పెండ్లి అయిందయ్య అని పెండ్లిపెద్దలు అనగ, అయిందయ్య అని జనం అందుకుంటరు. బెమ్మపీటనుండి పైకి లేపి ఇంటికి తీసుకొనివెళ్ళి, పుట్టినింటినుండి తెచ్చిన ఒడుబలబియ్యం విప్పి భార్యభర్తలను ఒకగదిలో పెట్టి, పోటీగ కొలతలు వేయించుతరు (వీటిని తలంబ్రాలు అంటరు). తరువాత అరన్‌జ్యోతి చుక్కను తూర్పుదిశలో వధువరులను నిలబెట్టి, అభిలేష, పునర్వస అంటు 27 నక్షత్రలను చదువుతు మొక్కుతరు. తరువాత ఇంటికి తీసుకొనివెళ్ళి వేరేబట్టలు కట్టుతరు. ఇద్దరిచేత తానలు చేయించుతరు. రెండుబిందెలలో ఉంగరలు వేసి ఉంచి పోటీలు పెడతరు. ప్రతి బిందెలో ఇద్దరు ఒకేసారి నీటిలో చేతులుముంచి ఆ ఉంగరం తీయవలెను. ఎవరు ముందు తీయగలిగితే వారిది పైచేయి. ఆ పోటి అయిన తరువాత ఆ బెందలనీళ్ళను ఒకరికొకరు సభముందు పోసుకుంటరు. ఆ స్నానంను 'కలనీళ్ళు' అంటరు. కలనీళ్ళు అంటే ఇద్దరు సభముందు బుజువు చేయుట. ఇద్దరిలో ఒకరికొకరు సాక్ష్యం ఇచ్చుకొనుట.

అవి అయిపోయిన తరువాత దుక్కులు. పెండ్లిపోలుబల్ల తీసి అక్కడ పూజ చేస్తరు. నేరేడుకొమ్మ పాతిన మొదట. తెల్లముగ్గు పచ్చముగ్గు నల్లముగ్గ వాల్చుతరు. దేవతలకొరకు నైవేద్యం బోనంకూడు చిన్నపిడతలో వండి, ఎర్రకోడిపిల్లను ఆ కూడును పట్టుకొని ముగవాల్చి ఉంచిన నేరేడుకొమ్మ దగ్గరకి వధువరులు దుక్కిమోకులకట్ట(నారలు), ములికర్ర(వెదురుకర్ర ఇనుపముళ్ళు ఉన్నది), మేడినాగెలి మగడు భుజన పెట్టుకొని, భార్య పిడతతో బోనంకూడు, సీముంతతో నీళ్ళు, వాయుపదునులేని కత్తి ఇత్తరు. ఇచ్చినట్లు ఆమెకి తెలియది. వాల్చిన ముగ్గుముందు కొమ్మకింద వారు కుగిడి దూపం నిప్పులో వేసి వెలిగించి భూమి ఆకాశం తూర్పు పడమరకి ఇద్దరు చేతులెత్తి దండాలు పెడతరు.

ఆ ఎర్రకోడిపిల్లకు వట్టిలో ఉంచిన బోనంఅన్నం తాగించి(తినిపించి), భర్త కోడికాళ్ళు పట్టుకొని ఉండగ భార్య కోడిని కోస్తది. మంచి పంటలు, మంచి వర్షాలు, మంచిసుఖాలు, మంచి సంతానం కలగాలని తలచుకొని కోస్తది. ఎంత కోసిన కోడిమెడ తెగది. కారణం కత్తి పదునులేకుండ చేసి ఇచ్చిరి కదా. ఎలగైతే భాదపడి కోస్తది. అదే కొమ్మలో ఊయలికట్టి జో అని కర్రముక్క(చాటుబల్ల) ఊయల కట్టిన గుడ్డలో నీళ్ళుపోసి, ఉచ్చులు పోసిదని నవ్వించుతరు. దాని తరువత కొబ్బరికాయ, శనగపప్పు, అరటిపండ్లు, బెల్లం చేతబట్టుకొని దేవుండ్లకి మామిడిచెట్టు ఉన్నచోటకి వెళ్ళి, చెట్టుమొదట తెల్లముగ్గు, పసుపుముగ్గు పట్టువాల్చి అరటిపండ్లు, బెల్లం, శనగపప్పు అక్కడ ఉంచి, కొబ్బరికాయలు కొట్టి దేవుడుకు మంచిసంతనం, సుఖంగ ఉండుటకు ఆరోగ్యం ఇవ్వమని కోరి దండాలు పెట్టి ఇంటికి వస్తరు.

ఈ పనులన్ని పూర్తిచేసి పేరంటాలు, పెద్దలు వారిని విడిచి ఇండ్లకి వస్తరు. పెండ్లి వారి ఇద్దరికి జరిగినట్లు పసుపుకలిపిన నూలుపోగు, రావిఆకు పికచుట్టి, ఈ రెంటిని ప్రతిగ్రామానికి పంపుతరు. పెండ్లీపీటలలో చేసుకున్నవారికి నూలుతో రావిఆకు కట్టి కుడిచేతికి కట్టుతరు. పెండ్లిజరిగిన ఊరిలోని ఎత్తుకొనిపోయి చేసుకున్న మగనాలివారికి, ఎరుకున్నవారికి వర్తించది. వారికి నూలుపోగు ఇవ్వరు, రావిఆకు కట్టరు. వారు వెలివేసినవారితో సమానం.

## కుట్రవాడగ్రామంలో జరిగినది

పెండ్లికూతురును పుట్టినింటినుండి పెద్దలు, పేరంటాలు పిల్లగల ఊరిపెద్దలు, చిన్నలు పెండ్లి ఊరికి తీసుకొని వస్తరు. పెండ్లికూతురును తీసుకొని వచ్చేటప్పుడు పెండ్లిఇంటివారు దూలికూడు(కూరలేని ఒట్టి అన్నం) వండి ఒక దాగెరిబుట్టతో పట్టుకొని వస్తరు. దూలికూడు పప్పుఅన్నంలో వేసి వండుతరు. ఉప్పు ఉండదు. బెల్లం మంచినీళ్ళలో వేసిన ఊట పానకం కావడి వేసి ఎదురుగ దారికి వెళ్ళి నిలబడుతరు.

పెండ్లింటి అత్తగారు ఇత్తడిపల్లెంలో నూనెపోసి అందులో వత్తులువేసి వెలిగించి ఎర్రకోడిపిల్లను చేతపట్టుకొని ఎదురుగ వెళ్ళి పల్లెంలో వెలుగుతున్న జ్యోతితో పెండ్లికూతురు కండ్లచుట్టు తిప్పి దీవించి, ఎర్రకోడిపిల్లను పెండ్లికూతురు చుట్టు తిప్పి, పెండ్లికూతురు నెత్తిమీద కోడితలకాయ ఇడింపితరు(తెంపడం). పెండ్లికూతురు దిక్కు తిరిగి చూడకుండ ఇంటికి వెళ్ళిపోతది. దానివెంటనే పెండ్లికూతురును తీసుకుపోయి ఆ గ్రామములో అన్నదమ్ముల వరుస కలిగిన ఇంటిలో పెండ్లిజరిగెవరకు ఉంచుతరు.

పిల్లతో వచ్చిన జనంకు దూలికూడు అడ్డఆకుచెరకలలో పంచుతరు. ఆ అన్నం వారు తింటరు. బెల్లంపానకం తాగుతరు. ఒక ఇంట్లో ఈ జనంకు ఉంచుతరు. పొగాకుచుట్ట తాగువారికి తాగనివారికి కలిపి తప్పకుండ ఒకరేకు ఇస్తరు. అన్నం వడ్డించుతరు, అందరు తింటరు అనుకున్న సమయంకు పెండ్లి మొదలు పెడతరు.

ఇంటిముందు నేరేడుకొమ్మలు పాతి పందిరి వేసినకింద నేరేడుకొమ్మ మొదలులో మూడురకాల ముగ్గులు వేసి అలికి. దానిమీద కుంచెడి సామలు పోసి దానిమీద పోలుబల్లవేసి బల్లకి కుంకుమ, పసుపు, తెల్లముగ్గు వేసి దానిమీద ఒక తెల్లటి పంచె పరుచును. పెండ్లికూతురుకు గొల్లచీర, గొల్లరవికె కట్టి, ముఖం కనుబొమ్మలమీద వరిబియ్యంతో కట్టిన బాసికలు(జాలెలు) కడుతరు. పెండ్లికొడుకుకు పంచెకట్టి బంచెవేసి పులిచేతుల కమిజిన్ తొడిగి. ముఖంమీద వరిబియ్యంతో కట్టిన బాసికలు కడుతరు. ఇద్దరికి ఎదురు పోలు అయిన తరువాత బెమ్మపీటలో కుగుడపెడుతరు. మంగలి ఇద్దరికి కాలిగోళ్ళు తీసి, కాళ్ళు కడుగుతడు. ఎదురుపోలు సంబురంలో వ్రాసినట్లు అక్షింతలు వేస్తరు.

**రచయిత ఫోన్ : 08864 244873, 8500935424**

*మిగతా వచ్చే సంచికలో...*

ప్రకృతి-3

– డా॥ కొప్పుల హేమాద్రి

# సమన్యాయం !

ఆది సృష్టికర్త ఎవరైతేనేం? సృష్టించిన ప్రతిదాన్నీ తన చెప్పుచేతల్లోకి తీసుకునేది ప్రకృతే! నిజానికి ప్రకృతేమనమొదటి శాస్త్రవేత్త! పైగా,పరిపాలనా దక్షత కలిగిన శాస్త్రవేత్త! పంచ మహా భూతాలయిన నేలా, నింగీ, నిప్పూ, నీరూ, గాలీ – వీటిని సమస్థితిలో ఉంచేలా ఆరు ఋతువులను ఏర్పాటు చేసుకుని, వాటిని సమన్వయపరుస్తూ ఒకకాలచక్రాన్ని రూపొందించింది. ప్రకృతికి దయాదాక్షిణ్యాలూ, అభిమానాలూ, అసూయలూ ఉండవు. తన సిద్ధాంతం సమన్యాయం. దానిది సమదృష్టి. ఎప్పుడు




ఎవరినిఎలా నియంత్రించాలో ప్రకృతికి తెలుసు. సమన్యాయంకోసం ప్రళయాలను సైతం సృష్టించగల శక్తి ఒక ప్రకృతికే ఉంది.

ఇంతకుముందే చెప్పుకున్నట్లు, ఈ మానవుడున్నాడే- ఇతగాడికి హితకరమైన జీవనంకన్నా సుఖప్రదమైన జీవనం అంటే మోజు! అందుకు తగినట్టుగానే సుఖజీవనానికై ప్రకృతి విరుద్ధమైన సవాలక్ష అడ్డదారులు వెదుక్కున్నాడు. దానికి ప్రతిచర్యగా ప్రకృతి తనదైన పద్ధతిలో (క్లోరో–ఫ్లోరో–కార్బన్‌ల శాతం పెంచేసి), ఆకాశానికి (హీలియం పొరకు) బొక్కపెట్టింది. తత్ఫలితంగా ఉష్ణోగ్రతలు పెరిగి ఉత్తర, దక్షిణ ధ్రువాల్లో మంచు కరగడం; వరదలు, వర్షాలు, తుఫానులు, సునామీలు చెప్పాపెట్టకుండా ముంచెత్తడం; సామాన్య జనజీవన వ్యవస్థ అతలాకుతలమై పోవడం మొదలయ్యాయి. ఇదంతా గమనిస్తున్న మన బుద్ధిజీవి 'చేతులారా చేసుకున్న ప్రకృతి విరుద్ధమైన చర్యలను సరిదిద్దుకోవడమే తక్షణ కర్తవ్యం'గా భావించి, ఆ దిశగా దిద్దుబాటుకు ఉపక్రమించవలసి వుంది. దిద్దుబాటు అంటే మరేమీలేదు- ప్రకృతికి సహకరించడమే! ప్రకృతిని అనుకరించడమే!!

పరిణామ సిద్ధాంతం ప్రకారం మానవుడికన్న ముందునుంచి ఉన్నవన్నీ (కొన్ని ఆకారంలో పెద్దవైనా) అల్పజీవులే! కాని మానవుడు ఆ చరాచర జీవాలను, ఉభయ చరాలను, వాటితోబాటు జడపదార్థాలను సైతం గమనించి, కొద్ది కొద్దిగా అవగాహన చేసుకుంటూ, 'బుద్ధిజీవి'గా మార్పుచెందాడు. బుద్ధిజీవి ఆదిలో ప్రకృతిని ఆరాధించినవాడే! ఇప్పటికీ ఆరాధిస్తున్నాడు. ఇతని ఆవిర్భావంతోనే అన్ని పనుల్లోనూ వేగం పుంజుకుంది. ఈ వేగాన్ని 'దృక్, స్పర్శాది ఆనందానుభూతులకు అనువుగామార్చుకోవడంలో సఫలీకృతుడయ్యాడు. ఆ ప్రయత్నంలో తాను ప్రకృతినే ఎదురిస్తున్నాడన్న సంగతిని అంతగా పట్టించుకోలేదు. నిజానికి ప్రకృతిని ఎదిరించడం అత్యంత వ్యయ, ప్రయాసలతోకూడుకున్న వ్యవహారం! ప్రకృతిలో జరిగే ఏ ఒక్క పనిని మనంఅనుకరించాలనుకున్నాఎన్ని తిప్పలుపడాలో ఒక చిన్న ఉదాహరణ: లండన్ (ఇంగ్లాండ్)లో తాటిచెట్లు పెరగడానికి ఆ ప్రాంతపు ప్రకృతి సహకరించదు. కాని వృక్ష శాస్త్రవేత్తలు నానాతంటాలుపడి, కొన్ని చెట్లను 'క్యూ' గార్డెన్‌లో కృత్రిమ వాతావరణం కల్పించి పెంచారు. అవి ఆ గార్డెన్‌లో బ్రతికి బట్టకట్టడానికి- అంటే, వాటికి కావలసిన నిర్దుష్ట ఉష్ణోగ్రతను, భూసారాన్ని, తదితర సదుపాయాలను ఏడాది పొడుగునా అందించడానికివేలకొలది డాలర్లు ఖర్చుపెట్టారు. ఇప్పటికీ ఖర్చుపెడుతూనే ఉన్నారు! ఇక ముందూ ఖర్చుపెట్టాలి! ప్రకృతితో పోటీ అంటే ఇలాగే ఉంటుంది! కాని ఒకటి మాత్రం నిజం. కొంతకాలం గడిచేటప్పటికీ ప్రకృతే గెలుస్తుంది.

ఫోన్: 09848296865

**ఇదే మాదిరిగా మీరూ శాస్త్రీయ అంశాలను పత్రికకు రాయవచ్చు. - సం॥**

## భూభారం తీరాలంటే...

*23వ పుట తరువాయి...*

విధ్వంసానికి ఇది దోహదం చేస్తోందని రాజకీయార్థశాస్త్రం చెబుతోంది. భూసారం సంక్షోభాన్ని గుర్తించిన పారిశ్రామిక వేత్తలు కృత్రిమ ఎరువులతో పరిష్కరించేందుకు ప్రయత్నించారు. తాత్కాలికంగా కొంతకాలం ఆ ప్రయత్నాలు ఫలించినా ఆ తర్వాత క్రమంగా వ్యవసాయోత్పత్తి క్షీణించింది. ఎరువులు, పురుగుమందులు లేని సేంద్రియ వ్యవసాయ (ఆర్గానిక్ ఫార్మింగ్) ఉత్పత్తుల వైపు ప్రజలు క్రమంగా మొగ్గుచూపుతున్నారు. పట్టణీకరణ ద్వారా అందుబాటులోకి వచ్చే చౌక శ్రమశక్తిద్వారా పారిశ్రామిక అదనపు విలువను సమీకరించవచ్చుననే ఉద్దేశ్యంతో భూసార విధ్వంసానికి పారిశ్రామిక వర్గాలు పాల్పడటం క్షమించరాని విద్రోహం. విచక్షణారహిత పట్టణీకరణ మూలంగా శ్రమశక్తి, భూసారం వ్యర్థాలుగా మారి సమాజానికి, పర్యావరణానికి ప్రమాదకరం కాని పరిస్థితులకు షరతుగా నిలిచే సామాజిక నిర్మాణం ఉనికిలోకి రావాలి. శ్రమశక్తి దోపిడీకి తావే లేని, భూసారం విషతుల్యమైన వ్యర్థంగా మారడానికి అవకాశంలేని సామూహిక ఉత్పత్తిదారుల (అసోసియేటెడ్ ప్రొడ్యూసర్స్) జనావాసాలు భూగోళమంతా విస్తరించాలి. ఈ పరిణామం భూదేవి భారాన్ని దించుతుంది. అందుకు ప్రజల సమిష్టి సంకల్పమే వాస్తవ ప్రపంచంలో ఆ కల్పిత పౌరాణిక అవతారం పాత్ర పోషిస్తుంది. కాబట్టి సమాజం, ప్రకృతి మధ్య సుస్థిర సంబంధాన్ని సాధించే పరిష్కారంకోసం ప్రపంచవ్యాప్తంగా సామాజిక సంబంధాల్లో మార్పులు రావాలి.

*'భూమి మనకు చెందినదికాదు. మనమే భూమికి చెందుతాము. మనిషి జీవుల గూడు నేయలేదు. అతనందులో దారం మాత్రమే. అతడా గూడుకు ఏమి హాని తలపెట్టినా అది తనకు తాను చేసుకున్నట్లే' – ఒక పర్యావరణవేత్త.*

**రచయిత ఫోన్ : 9441829339**

చదువతగిన పుస్తకం

# ఆలోచనా పేటికలు 'శివారెడ్డి పీఠికలు'

- సన్నిధానం నరసింహశర్మ




ఉత్తమ గ్రంథాలు ప్రచురించే సంస్థల్లో హైదరాబాదులోని 'పాలపిట్టబుక్స్' ఒకటి. ఆ సంస్థవారు పెన్నాశివ రామకృష్ణ, గుడిపాటి సంపాదకులుగా ప్రచురించిన అందమైన గ్రంథం - శివారెడ్డి పీఠికలు:

ఇప్పుడు 72 ఏళ్ళున్న శివారెడ్డిగారు - తమ 30వ ఏటినుండి కవితారంగంలో సంచలనాత్మక పాత్ర వహిస్తూనే వున్నారు. ఇప్పటికి 21గ్రంథాలు వెలుగు చూశాయి. హిందీ, కన్నడ అనువాద గ్రంథాలు వచ్చాయి. సంఖ్యానేక పత్రికారచనలు చేసిన శ్రీ శివారెడ్డి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం సైతం పొందారు.

వీటిని మించి వీరి ఎన్నో కవితలు సామాజిక విప్లవ సంఘర్షణా కోణాలనుండి సమకాలీనులను, వందల యువకవులను, రసజ్ఞులైన ఆలోచనాపరులను ప్రభావితం చేశాయి.

విమర్శక విచికిత్స వీరి 'ఆసుపత్రిగీతం' ఆరోగ్యకరమైన సామాజిక కవిత్వాన్ని ఆవిష్కరించుకుంది. విద్యార్థి ఉద్యమాలలో సాహితోద్యమాలలో వీరు పాత్ర వహించారు.

అంతర్జాతీయంగా ఆంగ్లాది భాషల సాహిత్య కవిత్వాలను అధ్యయనంచేసి గొప్పకవిగా అనేక అభిమాన హృదయ పీఠారోహణ చేసిన రెడ్డిగారి గొప్పతనం ఏమిటి? తాజా తాజా సాహిత్య కవిత్వ గ్రంథాల అధ్యయనంతో ఎర్రటి క్రొత్తరక్తాన్ని ఎప్పటికప్పుడు ఎక్కించుకుంటూ వర్తమాన కవిగణాలకు ప్రేరణరంగంగా ఉండటం. సమకాలీన తరాన్ని స్వాగతించడంలో, కవుల్ని ఆప్యాయంగా వారి కవితా హృదయాల్ని హత్తుకోవడంలో రసవివశులు కావడం. బ్లాటింగ్ పేపరుపై సిరాపడితే ఎంత వేగిరంగా హత్తుకుంటుందో అంతవేగంగాను అసలు సిసలు

కైతలకు స్పందించడం కవిత్వగ్రంథాలకు ఆచితూచి పీఠికలు వ్రాయడం

అందువల్లే 500 పుటల పీఠికల గ్రంథం రావలసిన సాహిత్యావసరం వచ్చింది.

కవిని, కవిత్వాన్ని, ఆయన స్థానాన్ని ఆ కవిత్వ సామాజిక ప్రయోజనాన్ని మనం ఆయా గ్రంథాలు చదవాలనిపించేలా పీఠికా నిర్మాణాలుండడం.

86 గ్రంథాలకు రాసిన శ్రీ శివారెడ్డి పీఠికలు చదివితే ఆయా పట్టుల్లో ఎక్స్‌రేలు చూస్తాం. సమయ సందర్భాలలో అవసరం కలిగి ఆయన వాడే ఉట్టంకింపులవల్ల, విశ్లేషణలవల్ల ఎన్నో జ్ఞానాంశాలు తెలుస్తాయి. కిటికీలు తెరువబడతాయి. భూగోళంపై నిల్చున్నామనే వర్తమాన కాలీన స్పృహ కలుగుతుంది.

వచనంలో సౌందర్యం అనే శీర్షికలో గుడిపాటివారు అనేక అంశాలు ప్రస్తావించారు. అందులో ముందుగా కొందరు అమాయకంగా కవిత్వానికి, వచనానికి పోటీ పెడుతుంటారుగానీ రెండింటిలోనూ తమ ప్రతిభాసంపత్తిని కనబరచిన సృజనశీలురు తెలుగు సాహిత్యరంగంలో ఉన్నారు' అన్నారు. ఆయా కాలాల నడుమ నడుమ ఇట్టి తలపులు గలవారు ఉంటూనే వున్నారు.

పద్యానికి నన్నయ, గద్యానికి చిన్నయ అంటూ ఒకానొక సందర్భసభలో ఒకరంటుండగా బెజవాడ గోపాలరెడ్డిగారు తమ ప్రక్కనున్న విశ్వనాథ సత్యనారాయణగారితో అయితే మన వచన చరిత్ర, చిన్నయ్యసూరితోనే ఆరంభమా అనే భావంతో అడిగితే - కాదు ఎప్పటినుండో మనకు గద్యం వుంటూనే వుంది. అది వ్రాస్తే ఓ గ్రంథం అవుతుందంటే రాయమని సూచించారు, రాశారు. అదే 'ఆంధ్రగద్యచంద్రిక'. అయితే ఇందులోనన్నయాది సంప్రదాయ కవుల గద్యాలకు ప్రాధాన్యమిచ్చారు. అది విశ్వనాథ, మల్లంపల్లి శరభయ్య, జె.వంటివారి సంపాదకత్వంలో వచ్చింది. ఆకథ వేరనుకోండి. దేవులపల్లి మొదలైన కవులు గొప్ప కవిత్వాన్ని, గొప్పవచనాన్ని పండించారు. వాడుక భాషోద్యమం వచ్చాక వచనపుపీట మరింత విశాలమైంది. మనిషి బ్రతుకే సంభాషణావచనం. ఇంతకీ గుడిపాటివారు చెప్పిందేమిటంటే "శివారెడ్డిగారు కేవలం కవిత్వం మాత్రమే రాయలేదు. అద్భుతమైన వచనమూ రాశారు. శిల్పం, వైవిధ్యం, భిన్నమైన పోకడలు వారివి శివారెడ్డి పీఠికల్లో చదివి అబ్బురపడతాం' అని.

గ్రంథానికి "ముందు మాటలకు ముందుమాట" అంటూ శ్రీ పెన్న శివరామకృష్ణ వ్రాసిన రచన- శివారెడ్డిగారి ప్రాపంచిక దృక్పథాన్ని, ఆయన రచనాప్రత్యేక వైవిధ్యాలను సకారణంగా వివరించారు. విప్లవ కవిత్వ పరిణామాలు ఆయన పీఠికల్లో ఎలా అంతర్లీనాలయ్యాయో వివరించారు. పీఠికల్లో తనదంటూ ఒక శైలిని ఆయన ఏ విధంగా పాదుకొల్పారో తెల్పడం అభినందనీయం. ఒకానొక వక్తృత్వ లక్షణం విలక్షణమైవుండటం వీరి పీఠిక ఆత్మాంశం.

పీఠికలో ఎదుటివారిని అంచనావేసుకునే పనిని చాలా మంది చేస్తుంటారు.

కానీ ఆయన తన పీఠికలో తన అంచనాను కూడా ఎవరో చేసినంత విచక్షణతో చేయడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఎలాగా?

2010లో విరస సంస్థాపకితులు చలసాని ప్రసాద్‌గారి 'చలసాని ప్రసాద్ రచనలు' గ్రంథం వచ్చింది. శ్రీశ్రీ, కొంకుల సాహిత్యాన్ని పరిశోధించి, సేకరించి వైయక్తిక కీర్తికాంక్షాదూరులై విరసం సాహిత్య సంస్థద్వారా సామాజిక పాత్ర నిర్వహించిన చలసానివారు అందరికీ తెలిసినవారే - వారి రచనలు పుస్తకానికి పీఠిక 'నామనసులో చలసాని' అంటూ రాశారు.

అందులో తనని ఎలా అంచనావేసుకున్నారో సమదర్శినితో చూద్దాం.

"ఇదీ ఈ పుస్తకానికి పెద్ద ముందుమాటేమీగాదు. కాకపోతే నాకు చలసాని అంటే ఏమిటో చెప్పుకునే ఒక అవకాశం మాత్రమే. ఇన్నేళ్ళనుంచి - దరిదాపు నాలుగు దశాబ్దాలు - ఆయన్ని నేనెల ఊహించాను. భావించాను, లోలోపల నిర్మించుకున్నాను, చెప్పుకుంటానికి ఇది ఒక సందర్భం మాత్రమే. పోనీ లోపలున్న మనిషి - గూడుకట్టుకున్న బొమ్మను సాంతం ఆవిష్కరించగలనా? అదీ అనుమానమే. ఒక ప్రయత్నం" అనడంలో ఎంతటి సత్యతపన ఆలోచన! సహజమైన Modesty/ ఒక ప్రయత్నం అని చెబుతూ ఒక ఆరు దశాబ్దాలపాటు నిక్కచ్చిగా నిర్మోహమాటంగా నిజాయితీగా కమ్యూనిష్టుగా బతకడం సామాన్య విషయం కాదు. అంటూ శృతిమించని అంచనాలు తెలుపుతారు.

మళ్ళీమధ్యలో "ఈ నాలుగు మాటలు రాసేటప్పుడు నేనేమన్నా

ఉద్వేగానికి లోనయి సెంటిమెంటల్ అనిపిస్తే క్షమించండి" అంటారు.

కొందరు రచయిత గ్రంథానికి పీఠిక రాస్తున్నప్పుడు రచయితా– పీఠిక రాసే తానూ మాత్రమే వున్నారని భావించి ఏమి రాసినా ఫరవాలేదనుకుంటారు. కానీ శివారెడ్డిగారు రచయితా– పీఠిక రాసే తానూ కాక ప్రజాసమూహాలకి ప్రాతినిధ్యం వహించే ఓ పాఠకవ్యవస్థ వుంది నిత్య స్పృహతో రాస్తారు. కనుకను తానెక్కడైనా అతి అవుతున్నానేమో అనే నిజాయితీతో కూడిన స్వీయభయంతో మాత్రమే ఈ క్షమించండి అని అడగడం.

గ్రంథకర్త చరిత్రను అవలోకిస్తారు. ఆయన సామాజిక పాత్రను గమనిస్తారు. రచనతో ముందు మనిషిగా తాదాత్మ్యం చెందుతారు. తరువాత బుద్ధితో అంచనా వేస్తారు. హృదయంతో తనని తాను పురుచుకుంటారు. ఎలా పరుచుకుంటారో చూడండి. 'మనుషులు పచ్చికుండల్లా పగలిపోతున్న సమయంలో చలసాని ప్రసాద్‌లాంటి మనుషులమధ్య బతకటం స్నేహించటం, చరించటం, సృజించటం గొప్ప అనుభవం... ఒక గొప్ప ఆశ పోరాటపు ఉత్సాహం' అంటారు.

86 పీఠికల పుస్తకంలో అన్నింటి గురించి స్పృశించడమూ కష్టమేమరి. చిన్న పిట్ట చూసే ఈ వ్యాసం.

అలిశెట్టి ప్రభాకర్ 'ఎర్రపావురా'లకు 'ముందుమాట'లో 'ఎరుపు' మాటను సాహిత్యంలో వాడటానికి భయపడి చచ్చేవాళ్ళు చాలామంది కవుల్లో ఉన్నారు. ఎరుపు దేనికి సంకేతమో చెప్పనక్కరలేదు. మరి అలిశెట్టి ప్రభాకర్ కవితా సంపుటి పేరే 'ఎర్రపావురాలు' అంటారు.

ఈ పీఠికలోనే ప్రగతి నిరోధక రచయితల గురించి.

"ఈనాడు ప్రతి రచయితా వంగిపోయి, గూనివాడయి, కబోదయి బతుకుతున్నాడు. నిటారుగా నడవడం చేతగాదు. ఎదురుతిరగడం తెలియదు. భయం వాణ్ణి ఆవరించిన అజ్ఞానం, దయ్యం, వాడు రాజీపడి అందరినీ రాజీ పడమని, తలొగ్గమని, ఓడిపొమ్మని ఉద్బోధ. ఈ రకం వాళ్ళకి ఎన్నైనా సౌకర్యాలు లాభాలు చేకూరవచ్చు' అంటూ 'విద్రోహ సాహిత్య ప్రతినిధులు వీళ్ళు' అని ఖరాఖండీగా చెబుతారు.

'గీతం ఎలా జన్మిస్తుందో – ఎంతటి ధ్యానముద్ర కావాలో లోతుకుపోతే తెలుస్తుంది. అలిశెట్టి కవిత/తను శవమై/ఒకరికి వశమై/ తనువు పుండై/ ఒకరికి పండై/ ఎప్పుడూ ఎడారై.../ ఎందరికో ఒయాసిస్సై/ అనేదాన్నివ్యాఖ్యానిస్తున్న సందర్భంలో టంకం పొడిలా అతుక్కుపోయే కవితను పట్టి చూపారు. అదీ ఎక్కడివాడో అయిన స్వీడిష్‌పొయట్ ట్రాన్స్‌ట్రోమర్‌ది. మోర్నింగ్ బర్డ్స్ కవితలోని.. Fantastic to feel how my poem grows/ while I myself shrink/ It grows, It takes my place/ It pushes me aside/ It throws me out of nest/ the poem is ready సహజకవితా జన్మలెలా వుంటాయో ఈ కవిత చదివిన సత్వర సంస్పందనలో పులకించి తీరుతాం.

ఊరూ, పేరూ, కీర్తి, ప్రతిష్టావంటి విషయాలను దాటడానికి, కవి ఉన్ముఖత్వాలుకాక కవిత్వోన్ముఖత్వాలు పెరగడానికి అహంభావాలుంటే నిట్ట నిలువునా కూలిపోవడానికి దోహదపడే ఇటువంటి విశ్వజనీన కవిత్వజనీన కవిత వ్రాసినందుకు ఆ కవిని అది యీయగల పాండిత్యం ఉన్న కవి శివారెడ్డి గారిని ఇరువురినీ అభినందించాలనిపిస్తుంది. ప్రఖ్యాతకవి గోరటి వెంకన్నగారి 'రేలపూతలు' పాటలకు పీఠికలో "ఆయన పాట కేవలం పాటకాదు; అదొక దృశ్యకావ్యం, జనజీవన దృశ్యకావ్యం. అదొక నాటకం, సంగీతరూపకం... చెట్లు, చేమలు, పొలాలు, కాలువలు, కంచెలు, పొలాల్లో ఎగిరేపిట్టలు. వీటిచుట్టూ అల్లుకున్న ప్రకృతి ఎంకన్నపాటల కూర్పులవుతాయి. తెలిసిన దాన్ని చూసినదాన్ని విన్నదాన్ని సజీవంగా గావించడంలో, ఆత్మవేదనతో దించడంలోనే కవి గొప్పతనం" అంటారు.

'వసీరాలోహనది'కి పీఠికానామకరణం! అతని అక్షరంమీద చెవిపెట్టివినండి శీర్షికే కవితాత్మకం.ఆ వ్యాసాన్ని వసీరా బాధ్యతనూ తెలుపుతూ "మనం క్షణం క్షణం చచ్చిపోతున్న మాట నిజమే/ ఆ చచ్చేదేదో చేతులు కలిపి నవ్వుతూ చచ్చిపోదాం/ ఆ చచ్చేదేదో పిడికిళ్ళు బిగించి అరుస్తూ చచ్చిపోదాం' అనే వాక్యాల బిగింపుతో ముగిస్తారు.

టి. కృష్ణమూర్తి యాదవ్ 'తొక్కుడు బండ'కు పీఠికలో భాషా విషయిక ప్రస్తావనలో "ఏ ప్రాంతం మాండలికమైనా కళ్ళకద్దుకోవాల్సిందే. సృజనాత్మక రచయితలు అన్ని రకాల మాండలికాల్ని అధ్యయనం చేయాల్సిందే. అన్ని రకాల ప్రక్రియలకీ మాండలికం వాడాల్సిందే"నని సూటిగా చెబుతారు. వివిధ కవుల కవితా విశేషాంశాలు విశ్లేషిస్తున్న సందర్భాలలో ఆయన మార్క్స్, కార్ల్‌శాన్‌డ్‌బర్గ్, ఎలాన్‌బాండ్, రసూల్‌గమ్‌రాటోవ్, లెనిన్, ఎ.ఆర్.మాగ్నో, ఆసిఫ్ మాండెల్‌స్టమ్, క్లెరెన్స్‌మేజర్, మహమూద్ దార్విష్, వ్లాదిమిర్ హులావ్, పాల్‌క్లీ, హోచిమిన్, యూజీవా ఆడ్రాదే, పాస్కల్ వంటి వివిధ రంగాల మేధావుల అనుభవజ్ఞుల సందర్భశుద్ధి ఉండే విలువైన వాక్యాలు ఉదహరిస్తున్న నేపథ్యాన్ని పరిశీలిస్తే, కవి, విమర్శకుడు వంటివాటిని మించిన నిరంతర బహుగ్రంథ అధ్యయనం గ్రహించి అంజలి ఘటించాలనిపిస్తుంది. ముప్పిడి ప్రభాకరరావుగారి 'లోకం చూశాక' స్వీయకథాసంపుటి పీఠికలో" కథ నా ఏరియా కాదు' అంటూ "ముప్పిడికథలు ఉబుసుపోకకి చదివే కథలుకావు.ఒక ఆర్తిఅంతటా అల్లుకుని వుంది. దాని వెనకనే ఒక నిరసన స్వరం వుంది అంటారు.

ఎ. విద్యాసాగర్‌గారి 'విశాఖా, నా విశాఖా'కి పీఠికలో "నదిమీదే వుండు కానీ నోరు తడుపుకున్నావో/ నాగరీకుల న్యాయమేదో నగ్నంగా చూపిస్తాం/ ... అడవిలోనే వుండుకానీ ఆకు తెంపితేనేరం/ ఇల్లుకట్టుకో కాని కొమ్మ నరికితే నేరం/ పశువులు మేపుకో, కానీ అడవికి వెళ్ళటం నేరం.../ నీ బతుకు నువ్వు బతుకుకానీ తేనె పట్టడం నేరం... /అడివెవరికి? పైవాడికి/ అలవికాని కష్టాలబతుకు?/ ఇంకెవరికి? అడవి తల్లిబిడ్డలకు; Exploitation కి కవి నిరసనగళ వాక్యాలను ఇలా 'ఆత్మీయంగా' చెప్పడాలు అనేకం ఉండడం శివారెడ్డిగారి పీఠికల్లో మేలుపనులు.

ఏతావాతా చెప్పేదేమిటంటే 'శివారెడ్డి పీఠికలు' గ్రంథం చదివి తీరవలసినదనీ, అది చదివితే శివారెడ్డిగారి శక్తులతో కవిత్వశక్తులు గల అనేకమంది కవుల అనేక ప్రాంతాల గ్రంథ అంతర్దర్శనాలు అంతర్మథనాలు తెలుస్తాయి.

అందుకే శివారెడ్డిగారి పీఠికలు కవిత్వ సమాజ ఆలోచనాపేటికలు. తెరచడం మనవంతు; తరచడాలు ఇవ్వడం శివారెడ్డిగారివంతు అవుతుంది.

రచయిత సెల్ : **9292055531**

బుద్ధ జయంతి ప్రత్యేకం

- డా॥ ఎమ్. రాజగోపాలరావు

# తథాగత: అర్థ నిర్వచనాలు

**బు**ద్ధుని కాలంలోనే బుద్ధునిమీద అనేకరకాల ఆరోపణలు గుప్పిస్తూ బుద్ధుని ధర్మాన్ని అధర్మంగా చిత్రిస్తూ బుద్ధుని అపఖ్యాతిపాలు చేయటానికి ప్రత్యర్థులు చేసిన ప్రయత్నాలన్నిటినీ ప్రసన్న చిత్తంతో ఎదుర్కొంటూ తన ధర్మదేశనలో నిమగ్నమయిన బుద్ధుని నిష్కళంక సర్వసమగ్ర వ్యక్తిత్వానికి నికాయాలు అద్దంబడతాయి. ఒకవైపు దుర్మార్గులు (దుట్ఠోవా) ద్రోహచింతనతో (దోసంతరం) తన ధర్మాన్ని అధర్మంగా నిరూపించటానికి వక్రమార్గాలను అవలంభిస్తూ తాను చెప్పని దానిని (అభాసితం) చెప్పినట్లూ (భాసితం) అనని దానిని (అలపితం) అన్నట్లూ (లపితం); చెప్పిన దానిని (భాసితం) చెప్పనట్లూ, అన్న దానిని (లపితం) అననట్లూ (అలపితం) వక్రభాష్యాలు చేసి (అబ్బాచిక్ఖంతి) అప్రతిష్ఠపాలు చేయాలని చూసేవారు:

"అభాసితం, అలపితం తథాగతేన భాసితం లపితం దీపేతి
భాషితం, లపితం తథాగతేన అభాసితం అలపితం దీపేతి."

మరోవైపు తనమీద, తన ధర్మంమీద (శ్రద్ధాసక్తులు చూపేవారు (సద్ధా) తన ధర్మదేశన యాత్రలో సమయ సందర్భాలను బట్టి, శ్రోతలను బట్టి వ్యాఖ్యానాత్మకంగా ఉపదేశించిన సుత్తంతాలను (నెయ్యత్థ) మౌలికభాషార్థంలో (నీతత్థ) అర్థంజేసుకొని (దుగ్గహితో) తాను మౌలిక భాషార్థంలో (నీతత్థ) ఉపదేశించిన సుత్తంతాలను వ్యాఖ్యానార్థంలో (నెయ్యత్థ) అర్థంజేసుకొని తన ధర్మానికి అపార్థాలు ఆరోపిస్తుండేవారు.

"యోచ నెయ్యత్థం సుత్తంతం నీతత్థం దీపేతి
యోచనీతత్థం సుత్తంతం నెయ్యత్థో దీపేతి."

అందువల్ల తన ఉపదేశాలను సక్రమంగా అర్థంజేసుకొని తాను చెప్పినదానిని చెప్పినట్లుగా అన్నదానిని అన్నట్లుగా, చెప్పనిదానిని చెప్పనట్లుగా, అననిదానిని అననట్లుగాను ఏయే సుత్తాంతాలను ఏయే అర్థాలలో ఉపదేశించానో గ్రహించుకొని ధర్మవిస్తరణకు పూనుకోవటం సద్ధర్మపరిరక్షణకు, అభివృద్ధికి దోహదం జేస్తుందన్నాడు. (అంగుత్తరనికాయ: చతుక్కనిపాత: బాలవగ్గో).

ఆనాటి బుద్ధుని నిర్దేశాన్ని ఈనాటి బౌద్ధ ధర్మప్రచారకులు అనుసరిస్తున్నారో లేదో ఎవరికివారు పరిశీలించుకోవలసి ఉంది.

కాలాంతరాలలో బుద్ధుని (తథాగతుని) సద్ధర్మం దేశదేశాంతరాలలో విస్తరించి ప్రపంచ వ్యాప్తమయి అనేక దేశాలలోని సంస్కృతుల ప్రభావాలతో రకరకాల ఆచార వ్యవహారాలు బౌద్ధ ధర్మంలో అంతర్భాగాలయిపోతున్నాయి. అభివృద్ధి చెందుతున్నాయి. వాటిని పరిశీలించటానికి పూనుకొన్న వారికి వాటిలో గోచరించే విభేదాలు, వైరుధ్యాలు నిరాశా నిస్పృహలు కలిగిస్తున్నాయి. ఇవా బుద్ధుని ఉపదేశాలని విస్తుపోజేస్తున్నాయి. బుద్ధుడు సంబోధిపొంది సమ్యక్సంబుద్ధుడయిన తరువాత ఉపదేశించటం గురించి సందేహిస్తుంటే బ్రహ్మ ప్రత్యక్షమయి లోకంలో అందరూ అవగాహనలేనివారే ఉండరు, కొందరు సక్రమంగా అర్థంజేసుకొనేవారుంటారు. బహుజన హితార్థం, సుఖార్థం, లోకకల్యాణార్థం ధర్మముపదేశించమని కోరినప్పుడు (బ్రహ్మయాచన) తన ధర్మం గంభీరం, అంతుచిక్కనిది (దుర్దృశం) తేలికగా అర్థంగాదు (దురనుబోధం) సూక్ష్మం, నిపుణం, పండితవేదనీయం, అతర్క్యావచరమని తెలిసి గూడ దానిని అందరికీ అర్థమయ్యే విధంగా అందించగలననే అవగాహనతోనే బుద్ధుడు ధర్మదేశనలో సాగాడని గ్రహించుకోవచ్చు. అందువల్లనే బుద్ధుని ఉపదేశాలలో కొన్ని గంభీరమయినఅర్థాలందించేవి ఉంటాయి. కొన్ని సామాన్యుల అవసరాలను సక్రమంగా వివరించేవి ఉంటాయి. వాటిలో ఎంత వైవిధ్యంగా గోచరించినా అన్నీ మౌలికంగా బుద్ధ ధర్మ ప్రతిపాదకాలే అవుతాయి. అందుకే ఉపదేశాలెన్నయినా ధర్మమొక్కటేనన్నాడు బుద్ధుడు. ఆ మౌలిక ధర్మాన్ని రావించుకోవటానికే బౌద్ధులందరూ అంకితం గావలసి ఉంటుంది.

బుద్ధుడు ధర్మాన్ని మూడు విధాలుగా వింగడించాడు. సద్ధర్మం, అసద్ధర్మం, మిథ్యాధర్మం (మిచ్ఛాధమ్మం), బుద్ధని ఉపదేశాలను యథాభూతంగా గ్రహించుకొని ఆచరించటం (పరియత్తి, పటిపత్తి) సద్ధర్మానుసరణం; దానికి విరుద్ధమయిన ధర్మాలన్నీ అసద్ధర్మాలు. బుద్ధుని ధర్మాన్ని సక్రమంగా అర్థంజేసుకోకుండా వక్రీకరిస్తూ అనుసరించటం మిథ్యాధర్మం. ఈ వింగడింపులోని మూలసూత్రం పైన ప్రస్తావించిన బాలవగ్గలో కనిపిస్తుంది. వర్తమాన పోకడలను గమనిస్తుంటే బౌద్ధధర్మం పేరుతో సాగుతున్న ప్రచారాలు ఏకోవకు చెందుతాయో అర్థంగాని పరిస్థితి గోచరిస్తుంది. ఎవరికి వారు తమకు ఇష్టమయిన రీతిలో ధర్మాన్ని అర్థంజేసుకొంటూ అనువయిన రీతిలో వ్యాఖ్యానించుకొంటూ అదే బుద్ధుని ధర్మమంటున్నారు. ఈ గందరగోళంలో ధర్మమూలాలయిన ప్రధాన పదాల అర్థాలే మారిపోతున్నాయి. శీల(సీల), సమాధి, ప్రజ్ఞ (ప్రజ్ఞా), సంస్కార (సంఖార), విజ్ఞాన (విఞ్ఞాణ) వంటిపదాలు దాస్‌గుప్తా ప్రకారం (S.N. Dasgupta) బుద్ధుడు ప్రత్యేకార్థంలో, సాంకేతికంగా (technical) ప్రయోగించిన పదాలు. ఆ పదాల అర్థాలు మారిపోయాయి. కొన్ని పదాలకు అర్థాలే లేవనటం వరకు వచ్చింది. ఆధునిక ధోరణిలో అక్షరతః (literal) అర్థంజేసుకోవటం అలవాటయిపోయింది. అటువంటి పదాలలో "తథాగత" ఒకటి.

నికాయాలలో "తథాగత" ఒకే పదంగా కనిపిస్తుంది. దానిని తథా+ఆగతగానో 'తథా' + గతాగానో విశ్లేషించి వివరించే ప్రక్రియ అట్ఠకథలలో మాత్రమే కనిపిస్తుంది. అంటే మౌలికంగా తథాగతపదం ఒకేపదంగా కొనసాగిందనీ ఆ పదాన్ని ఆనాడు ఆవిధంగానే అర్థంజేసుకొన్నారనీ తెలుతుంది.

తథాగతుడు లోకంలో జన్మిస్తాడు. అర్హతుడయి, సమ్యక్సం బుద్ధుడయి, విద్యాచరణ సంపన్నుడయి. సుగతుడు, లోకవిదుడు, అనుత్తరపురుషధమ్మ సారధి, దేవమానవశాస్త అయి ఆది కల్యాణం,

మధ్యమకల్యాణం, పర్యవసానకల్యాణదాయకమయిన బ్రహ్మచర్యాన్ని (అత్యున్నత ఆచరణను) ప్రకాశింపజేస్తాడు. అంటూ నికాయాలలో అనేక సందర్భాలలో తటస్థపడుతుంది. 'దీఘనికాయం'లోని ప్రప్రథమ సుత్తంతం "బ్రహ్మజాల సుత్తంతం"లో ఆనాడు ప్రచారంలో ఉన్న రకరకాల పాక్షిక దృక్పథాలను తిరస్కరించిన సందర్భాలన్నిటిలోను గంభీరమయిన, అగోచరమయిన, శాంతమయిన, ఉన్నతమయిన, సాధారణ అవగాహనకందనిదీ పండితులకుమాత్రమే అర్థమయ్యే ధర్మాన్ని తథాగతుడు అత్యున్నత జ్ఞానంతో యథాతథంగా దర్శించుకొని అందిస్తాడు అని ఉంటుంది. (ఇమే, ధమ్మాగంభీరా దుద్దసా దురనుబోధా సంతా పణీతా అతక్కావచరా నిపుణా పండిత వేదనీయా యే తథాగతో సయం అభిజ్ఞా సచ్ఛికత్వావవేదేతి యేతథాగత్స యథాభుచ్చం వణ్ణం వదమానా వదేయ్య) తథాగతుడు గ్రహించవలసిందంతా గ్రహిస్తాడు, దర్శించవలసిందంతా దర్శిస్తాడు. చక్షుభూతుడు, జ్ఞానభూతుడు, ధర్మభూతుడు, బ్రహ్మభూతుడు, వక్త, ప్రవక్త, లక్ష్యసాధన దిశగా నడిపిస్తాడు. జన్మరాహిత్యాన్ని అందజేస్తాడు (అమతస్సదాతా) ధర్మస్వామి అంటుంది మధుపిండిక సుత్తంతం (మజ్ఝిమనికాయ) తథాగతుడు నిర్దోషి, నిరాధారంగా ఏమీ చేయడు, నిర్లజ్జ చిత్తుడు, ఉత్తమ పురుషుడు,పరమ పురుషుడు, పారమీల సాధనకు అంకితమవుతాడంటుంది సంయుత్తనికాయ (పారమీ పాళీపదం, దాని సంస్కృతీకరణం పారమితా).

కాలాంతరాలలో అభివృద్ధిచెందిన దార్శనిక, మతాత్మక ధోరణులు ఈ తథాగత పద అర్థాన్ని కొంత గందరగోళపరచినట్లు కనిపిస్తుంది. లోకమే తథాగతుడు, తథాగతుడే లోకం. లోకం శూన్యమయినట్లుగా (పరమార్థంలో) తథాగతుడు గూడా శూన్యమేనంటుంది. 'లంకావతార సూత్రం'. ఈ ధోరణి మరింత ముదిరిపోయి తథాగత పదం భారతీయ పదమేకాదనీ శూన్యమనే అర్థంలో కుమారజీవ చీనీలో "తథాగద" పదం ప్రయోగించాడనీ అదే భారతదేశంలో సంస్కృతపద రూపమంది "తథాగత" అయిందనే వరకు వచ్చింది. (Leon hurvitz). దీనికి "సద్ధర్మ పుండరీక సూత్రం" మరింత ఆజ్యంపోసింది. తథాగతుడు దేశకాలాతీతుడు, స్వయంభువు. అనంతకోటి కల్పాలలో కొనసాగుతాడు. సర్వలోకపిత, నిర్మాత, సర్వప్రాణి విముక్తుడు అంటూ అతీతదైవంగా అభివర్ణిస్తూ తథాగతుని భాష సంధాభాష – అంటే, మార్మికభాష అంటూ తథాగత ఉపదేశాన్ని భాషాతీతంగావిస్తుంది. (సంధా భాషను కొందరు పండితులు 'సంధ్యాభాష'గా గ్రహించారు.) ఇదంతా 'తథాగత' పద అర్థాన్ని సంశయింపజేయటంలో సఫలీకృతమందింది.

అయితే పాళీనికాయాలలో ''తథాగత'' పదం బుద్ధునికి, పర్యాయపదంగా అనేక వివరణలో విస్పష్టంగా వ్యక్తమవుతుంది. తథాగతుని ఎనిమిది ఆశ్చర్యాద్భుత ధర్మాలను పఠమ, దుతియ అచ్ఛరియ అబ్భుతధమ్మ సుత్తాలు (అం.ని:చ.ని) అందిస్తాయి.

1. తథాగతుడు తుషితలోకకాయం వదిలేసి స్మృతితో(సతి), సంప్రజ్ఞతో (సంపజానో) మాతృగర్భంలో ప్రవేశిస్తాడు.
2. అట్లాగే మాతృగర్భం నుంచి నిష్క్రమిస్తాడు.
3. అనుత్తరసమ్యక్సంబోధినందుకొంటాడు.
4. అనుత్తరమయిన ధర్మచక్రం ప్రవర్తింపజేస్తాడు.
5. లోకంలో అలవాటుపడిన వాటితోనే ప్రజలు పేట్రేగిపోతారు. వాటితోనే సంతోషంపొందుతారు. ఉద్వేగం చెందుతారు. దానికి విరుద్ధమయిన ధర్మాన్ని తథాగతుడుపదేశించినప్పుడు వింటారు, చెవొగ్గుతారు, దానిమీద మనసు నిలుపుతారు.
6. ఆధిక్యతాభావంలోనే ప్రజలు పేట్రేగిపోతారు, దానితోనే ఆనందం పొందుతారు. ఉద్వేగం చెందుతారు. తథాగతుడు దాని దమనం ఉపదేశించినప్పుడు వింటారు. చెవొగ్గుతారు, దానిమీద ప్రజలు మనసు నిలుపుతారు.
7. అలవాటయిన దానిని ప్రజలు అణుచుకోలేక పేట్రేగిపోతారు. దానితోనే ఆనందంపొందుతారు. ఉద్వేగం చెందుతారు. తథాగతుడు దానిని ఉపశమింపజేసే ధర్మం ఉపదేశించగానే వింటారు, చెవొగ్గుతారు, దానిమీద మనసు నిలుపుతారు.
8. ప్రజలు అవిద్యలోనే ఉంటారు. అంధభూతులవుతారు, దానిలోనే మునిగితేలుతారు. దాని దమనానికి తథాగతుడు ధర్మం ఉపదేశిస్తుంటే వింటారు, చెవొగ్గుతారు. దానిమీదనే మనసు నిలుపుతారు.

ఇవి తథాగతుని ఆశ్చర్య, అద్భుత ధర్మాలంటాయీ సుత్తాలు.

తథాగతుడు అనటానికి అయిదు హేతువులినన్నా "తస్మాతథాగతోతివుచ్చతి" అంటూ నిర్వచిస్తుంది "పోసాదికసుత్తంత" (దీఘనికాయ)

1. భూతభవిష్యద్వర్తమానాలను గురించి, సత్యాసత్యాలను గురించి, ధర్మంగురించి వినయం గురించి అనువయిన సమయాల్లో ఉపదేశించటంవల్ల తథాగతుడంటారు.
(అతీతానుగత పచ్చుపన్నేసు ధమ్మేసు తథాగతో కాలవాదీ భూతవాదీ అర్థవాదీ వినయవాదీ తస్మాతథాగతోతి వుచ్చతి)
2. దేవమారబ్రహ్మశ్రమణ బ్రాహ్మణ లోకాలలోని ప్రజలలో దేవమానవులలో జరిగే దానిని, వినే దానిని అనుభవించేదానిని, గ్రహించేదానిని, ఆశించేదానిని అంతటినీ మనసుతోనే అన్వేషించి, ఆకళించుకొని తథాగతుడు సమ్యక్సం బుద్ధుడయాడు. అందువల్ల తథాగతుడంటారు.

(సదేవకస్సలోకస్స సమారకస్స సస్సమణ బ్రాహ్మణియాపజాయ, సదేవమనుస్సాయ దిట్ఠం, సుతం, ముతం, విఞ్ఞాతం, పత్తం, పరియేసితం అనువిచరితం మనసా సబ్బంతథాగతేన అభిసమ్బుద్ధతి: తస్మా తథాగతోతివుచ్చతి.
3. తథాగతుడు అనుత్తర సమ్యక్సంబోధినందుకొన్న నాటినుంచి నిరుపాధిశేష మహాపరినిర్వాణమందిన రోజు వరకు – మధ్యకాలంలో వివరించింది. మాట్లాడింది. నిర్దేశించింది. అంతా అదేవిధంగా ఉండిపోయింది. మరొకటి కాలేదు... అందువల్ల తథాగతుడంటారు.

(యఞ్చరత్తిం తథాగతో అనుత్తర సమ్మాసమ్బోధిం అభిసమ్బుజ్ఝ, యఞ్చరత్తిం అనుపాధిసేసాయ నిబ్బాన ధాతుయా పరినిబ్బాయతి, యం ఏతస్మిం అంతరే భాసతి, లపతి, నిద్దిసతి సబ్బంతథేవహోతి నో అఞ్ఞదా. తస్మా తథాగతోతి వుచ్చతి.
4. తాను చెప్పిందే చేస్తాడు. చేసేదే చెబుతాడు. ఆ విధంగా చెప్పిందే చేయటం వల్ల, చేసిందే చెప్పటంవల్ల తథాగతుడంటారు.

(యథావాదీతథాగతో తథాకారీ, యథాకారీ తథావాదీ, ఇతి

యథావాదీ తథాకారీ యథాకారీ తథావాదీ తస్మాతథాగతోతి వుచ్చతి).

5. దేవ మార బ్రహ్మలోకాలలో శ్రమణ బ్రాహ్మణులలో ప్రజలలో దేవమానవులలో తథాగతుడే విజేతగా, అపజయంలేకుండా సర్వాన్నీ దర్శిస్తూ ఆధిపత్యం వహిస్తాడు. అందువల్ల తథాగతుడంటారు.

(సదేవలోకే సమారకే సస్సమణ బ్రాహ్మణి యా పజాయ సదేవమనుస్సాయ తథాగతో అభిభూతో అనభిభూతో అఞ్ఞదత్తుదసో వసవత్తీ తస్మా తథాగతోతి వుచ్చతి.)

ఈ తథాగత నిర్వచనాలు ఆనాడు ఎంతో ప్రాచుర్యమందాయనీ సర్వత్రా ఆమోదం పొందాయనీ వాటిని అంగుత్తనికాయంలో (చతుక్కనిపాతం) యథాతథంగా అక్షరతః ఎటువంటి మార్పులు చేర్పులే లేకుండా ఉటంకించటం నిరూపిస్తుంది. (మళ్ళీ వాటిని రాయటం అవసరమని భావించి వదిలివేశాను). లోకలోకాలనూ తథాగతుడు అవలోకిస్తాడనటానికి భూమిక "లోకసూత్తం" అందిస్తుంది.

తథాగతుడు లోకాన్ని సంపూర్ణంగా గ్రహిస్తాడు. లోకం నుంచి బయటవడతాడు. లోక సముదయం గ్రహించి దానిని క్షయంజేసుకొంటాడు. లోకనిరోధం, లోకనిరోధగామినీ పటిపదాన్ని (ఆచరణాత్మక విధానాన్ని) యథాతథంగా సంపూర్ణంగా గ్రహించుకొని నిరోధమార్గాన్ని తథాగతుడు సంభావించాడు. ఆ విధంగా లోకస్వరూపస్వభావాలను సహేతుకంగా గ్రహించుకొని ఆ నిరంతర పరివర్తనాత్మక లోకంనుంచి విముక్తుడవుతాడు. ఆ విధంగా లోకవిముక్తిని పొందేమార్గాన్ని సంభావించాడు అంటుంది లోకసుత్తం. (పాళీలో భావన అంటే క్రియాశీల అభివృద్ధి).

(లోకో భిక్ఖవే తథాగతేన అభిసమ్బుద్ధో లోకస్మా తథాగతో విసంయుత్తో లోకసముదయో భిక్ఖవే తథాగతో అభిసమ్బుద్ధో లోకసముదయస్స తథాగతో పహీనో, లోకనిరోధో, భిక్ఖవే తథాగతేన అభిసమ్బుద్ధో, లోకనిరోధో తథాగతో సచ్చికతా లోకనిరోధగామినీ పటిపదా భిక్ఖవే తథాగతేన అభిసమ్బుద్ధా లోననిరోధగామినీ పటిపదా తథాగతస్సభావితా).

ఈవిధంగా నికాయాలను సంకలనంజేసిన కాలంలో 'తథాగత' పదం ఒకే పదంగా గుర్తింపు పొందిందే కాని రెండు భాగాలుగా విశ్లేషించి వివరించిన పరిస్థితి కనిపించదు (నేను గమనించినంత వరకు) అప్పట్లో ఆ పదాన్ని శ్రావకులందరూ (సావక) అర్థంజేసుకొనే పరిస్థితి ఉండేదని భావించవచ్చు. ఆ తరువాతి కాలంలో ఆ పదం సంస్కృత రూపం పొంది రకరకాల అర్థాలలో ప్రయుక్తంగావటంతో దానిని విశ్లేషించి అక్షరతహ వివరించవలసిన అవసరమేర్పడి ఉంటుంది. అదే మనకు అట్టకథలలో గోచరిస్తుంది. (అట్లా సంస్కృతరూపాలు రూపాంతరాలు పొంది అర్థాలు మారిపోయిన పదాలు, అర్హన్, సమాధి, సుత్తం వంటివి అనేకమున్నాయి)

దీఘనికాయ అట్టకథ 'సుమంగళవిలాసినీ'లో బుద్ధఘోష తథా – అగత – గత పదాల పరంగా 8 నిర్వచనాలిచ్చాడు.

1. విపస్సిబుద్ధ మొదలుకొని కస్సపబుద్ధుడు, కకుసంధ, కొనాగమన వగయిరా బుద్ధులు అందరూ వచ్చిన మార్గాన్నే తథాగతుడు గూడా అనుసరించి వచ్చాడు (ఆగత).
2. పూర్వ బుద్ధులందరూ వెళ్లిన మార్గంలోనే తథాగతుడు వెళ్లాడు (గత)
3. తథా లక్షణం సత్యం (సచ్చ) అది తథాగతునికుంది.
4. తథా ధమ్మంలో బుద్ధుడు సమ్యక్సంబుద్ధత్వమందాడు.
5. తథాగతుడు తథాను దర్శించాడు.
6. తథాగతుడు తథ ధర్మాన్ని ఉపదేశించాడు.
7. తథాగతుడు తథత్వంలోనే చరిస్తాడు.
8. తథాగతుడు సర్వంజయుడు.

'సుత్తనిపాత'లోని ఆఖరివర్గం 'పారాయణవగ్గ'ను మొదటి ఉరగ వర్గంలో 'ఖగ్గవిసానసుత్త'లోని ప్రధానపదాలను – ధర్మపరంగా – బుద్ధుని కాలంలోనే 'సారిపుత్త' వివరించాడు. మొదటిది 'మహానిద్దేస' రెండోది 'చూళనిద్దేస'. అవి బుద్ధక నికాయంలో అంతర్భాగాలయిపోయాయి. అవి కొంత సంక్షిప్తంగా ఉంటాయి. వాటిని సవిస్తరంగా వివరిస్తూ 'మహానిద్దేస అట్ఠకథ', చూళనిద్దేస అట్ఠకథ' అభివృద్ధి చెందాయి. వాటిలో తథాగత పదవివరణ సమగ్రంగా ఉంది. దానిని వీలయినంత సమగ్రంగా, సంక్షిప్తంగా గ్రహించుకొంటే తథాగత అవగాహనలో మరింత స్పష్టత వస్తుంది.

తథా ధమ్మాన్ని యథాతథంగా గ్రహించి తథాగతుడయ్యాడంటూ (తథాధమ్మోయాథావతో అభిసమ్బుద్ధో తథాగతో) తథ దమ్మమంటే ఆర్యసత్యాలు (తథధమ్మా నామ అరియసచ్చాని) అంటుంది మహానిద్దేస. దానిని సమగ్రంగా విశ్లేషించి వివరిస్తుంది దాని అట్టకథ. తథాగత పదాన్ని తథ+ఆగత, తథా + గత అనే రెండు విధాలుగా విశ్లేషించి వాటి అర్థాలను సమగ్రంగా అందిస్తుంది.

యథలక్షణానికి తథాగతుడు ఎట్లా చేరతాడు (కథం యథ లక్షణం ఆగతోతి తథాగతో) అని ప్రశ్నించి పథవీధాతు (పృథివి) అపోధాతు, తేజోధాతు, వాయోధాతు, ఆకాశధాతు, విజ్ఞానధాతువులను యథాతథంగా దర్శిస్తాడు. కఠినత్వం (కక్ఖళత్త) పృధివీధాతులక్షణం; సమీకరణం (అభిసంఖరణ) అపోధాతు, లక్షణం; ఉష్ణం (ఉణ్హత్త) తేజోధాతు లక్షణం; వర్షణం (విత్థమ్భనం) వాయుధాతులక్షణం. వ్యాపనం (అసమ్ముట్టం) ఆకాశధాతు లక్షణం; విజ్ఞానం (విజానసం) విజ్ఞాణధాతు లక్షణం. ఈ ధాతువులను వాటి లక్షణాలను తథాగతుడు యథాతథంగా గ్రహిస్తాడు.

తథాగతుడెట్లా దర్శిస్తాడు (కథం దస్సితాయ తథాగతో) అని ప్రశ్నించి ఆవిధానం వివరిస్తుంది. దేవమానవ లోకంలో ఉండే అసంఖ్యాక జీవులన్నీ కళ్లతో చూసి గ్రహించే భౌతిక పదార్థాల మూలాలన్నిటినీ (రూపారమ్మణం) తథాగతుడు గ్రహిస్తాడు. అనుభావికంగావించుకొంటాడు (జానాతిపస్సతి).

తథాగతుని దేశనా విధానమేమిటి (కథంతథాగతో వాదితాయహోతి) అని ప్రశ్నించుకొని బోధిమండలంలో (బోధివృక్షం కింద) అపరాజితపర్యంకబంధంలో (బాసింపెట్టు) కూర్చుని నలుగురు మారుల శిరస్సులను మర్దించి అనుత్తరసమ్యక్సంబోధిని అందుకొన్న రోజు (రత్తి) నుంచి రెండుసాల వృక్షాల మధ్య అనుపాధిశేష నిర్వాణ ధాతువును పొంది పరినిర్వాణమందిన రోజు (రత్తి)కు మధ్యకాలంలో భగవానుడు ఉపదేశించిన, సుత్తం, గెయ్యం, వెయ్యాకరణం, గాథ, ఉదానం, ఇతివుత్తకం, జాతకం, అబ్భుతధమ్మం, వేదల్లం (నవాంగాలు) అర్థతః అక్షరతః (బ్యంజనం) నిర్దోషంగా, అన్ని రకాలుగాను పరిపూర్ణంగా కొనసాగుతూ రాగదోష (ద్వేష) మోహాలను నిర్మూలించి వెంట్రుకవాసి (వాలగ్గం) గూడ సంకరంగాకుండా ఒకే లక్షణంతో ముద్రించినట్లు

ఒకేనాళికలో పోసినవిధంగా, ఒకే త్రాసులో తూచిన విధంగా అదే విధంగా (తథమేవ) దానికి భిన్నంగాకుండా (అవితథం) మరో రూపంపొందకుండా (అనఞ్ఞథం) స్థిరంగా ఉన్నాయి.

తథాగతుని చర్యాక్రమమెట్లా ఉంటుంది (తథం యథాకారితాయ తథాగతో) అని ప్రశ్నించి భగవానుడు చెప్పేదే చేస్తాడు. చేసేదే చెబుతాడు. అందువల్ల తథాగతుడు యథాకారీ తథావాదీ, యథావాదీ తథాకారీ అవుతాడు కాని మరోరకంకాదు. పూర్వకాలం నుంచి వర్తమానందాకా తథాగతులందరూ అటువంటివారే. భవాగ్రం నుంచి (పైనుంచి) కింది అవీచిదాకా ఉండే తథాగతులందరూ అట్లాగే ఉంటూ అపరిమాణలోకాలలో జన్మించే ప్రాణులన్నింటినీ శీల (సీల) సమాధి, ప్రజ్ఞలతో (ప్రజ్ఞా) విముక్తులను గావిస్తూ విముక్త జ్ఞానదర్శనాలను అదేవిధంగా – తూకం వేసినట్లుగా అందుకొంటూ ఉంటారు. అసంఖ్యాక రాజులలో రాజాతిరాజులుగా దేవతలలో అతిదేవులుగా, శుక్రులలో అతి శుక్రులుగా, బ్రహ్మలలో అతి బ్రహ్మలుగా తథాగతులందరూ అత్యున్నతపదాలు అందుకొన్నారు. ఆవిధంగా తథాగతత్వం చేరారు.

ఇదీ మహానిద్దేస అట్ఠకథ తథ + అగత వివరణ. దానిలోనే తథా + గత వివరణ గూడా కనిపిస్తుంది.

పూర్వ సమ్యక్సంబుద్ధులందరూ సర్వలోకహితానికీ సుఖానికీ కృషి చేస్తూనే వచ్చారు (ఆగతా). వారందరూ దాన, శీల (సీల) నిష్క్రమణ (నెక్ఖమ్మ), ప్రజ్ఞా (పఞ్ఞా) వీర్య (విరయ) క్షాంతి (ఖంతి), సత్య (సచ్చ), అధిష్ఠాన (అధిట్ఠాన), మైత్రీ (మెత్త), ఉపేక్షా (ఉపెక్ఖ)లతో కూడిన దశపారమితలను (దసపారమియో), దశ ఉపపారమితులను, దశ పరమార్థ (పరమత్థ) పారమితులను మొత్తం 30 పారమితలను నిర్వహిస్తూ అంగ, నయన, ధన, రాష్ట్ర (రట్ఠ) పుత్రదార అనే పంచ మహా పరిత్యాగాలను (పరిచ్చాగ), పూర్వయోగ (పుబ్బయోగ) పూర్వచర్య (పుబ్బ చరియ), ధర్మజ్ఞాన వంటి బుద్ధ చర్యాకోటిని ఆచరిస్తూ వచ్చారు. మన భగవానుడు గూడా (అమ్హాకంభగవా) పూర్వ భగవానులు ఆచరించిన 4 స్మృతి ప్రస్థానాలు (సతిపట్ఠాన) 4 సమ్యక్ప్రవాహాణాలు (సమ్మప్పధానా), 4 వృద్ధిపాదాలు (ఇద్ధిపాద – అతీంద్రియశక్తులు), 5 ఇంద్రియాలు, 5 బలాలు, సప్తబోధ్యంగాలు (సత్తబోజ్ఝంగ), ఆర్య అష్టాంగ మార్గం (అరియ అట్ఠంగిమగ్గ) ఆచరిస్తూ వచ్చినట్లుగా మన భగవానుడు గూడా ఆచరిస్తూ వచ్చాడు. (ఆగతో. ఆవిధంగా ఆ యథార్థ స్థితికి చేరుకోవటంతో తథాగతుడయాడు (ఏవం ఆగతోతి తథాగతో).

దీపంకర బుద్ధ మొదలుకొని పూర్వబుద్ధులందరూ– సర్వజ్ఞతను అభివృద్ధిచేసుకొంటూ ఇక్కడికి చేరుకొన్నట్లు (ఇథాగతా) మన శాక్యముని గూడా చేరుకొన్నాడు. అటువంటి సర్వసంపూర్ణ సాక్షాత్సందర్శనవల్ల తథాగత అంటారు (తథాగతేనవుచ్చతి, తేన చక్ఖుపాతి).

తథాగతుడెట్లా చేరుకొన్నాడు – అని మళ్లీ ప్రశ్నించి పూర్వ బుద్ధుల సంభవించినట్లుగానే (జన్మించినట్లు) భగవానుడు గూడా సమపాదాలతో సంభవించాడు. వెంటనే ఉత్తరాభిముఖంగా ఏడడుగులు వేసి "ఇదే అగ్రజన్మ నాకిక పునర్జన్మలేదు'' (అగ్గోహమస్మి జాతి, నత్థి దానిపునబ్భవోతి) అని ప్రకటించాడు.

ఈవిధంగా తథ + ఆగతా, తథా + గత పదాలను విశ్లేషించి వివరించటం అట్ఠకథలలోనే కనిపిస్తుంది. అయితే నికాయాలలో...మనం గమనించిన నిర్వచనాలలో (స్పష్టతకోసం పాళీ మూలం గూడ జోడించాడు గమనించండి) ఎక్కడా ఎటువంటి విశ్లేషణ కనిపించదు. అట్ఠకథల విశ్లేషణాత్మక వివరణమంతా నికాయాలలోని నిర్వచనాలకు అనుగుణంగానే ఉంటాయి కాని సాంప్రదాయిక వివరణతో విభేదించవు. పదాలను విశ్లేషించి అర్థంజేసుకోవటానికి అలవాటుపడిన పాశ్చాత్య పండితులు దానినే ప్రమాణంగా గ్రహించారు.

పాళీ భాషలో అభివృద్ధి చెందిన తథ – తథాగత పదాల అర్థాలను సంస్కృత ధాతువుల ధోరణిలో విశ్లేషించి వివరించటం ఎంతవరకు సబబు అనే సమస్య తలెత్తుతుంది. బిమల్ చరణ్ లా (B.C.Law) వంటి పాళీ పండితుడు (రాధాకృష్ణన్ సమకాలికుడు కలకత్తా విశ్వవిద్యాలయ ప్రారంభ దశలో సహచరుడు) వాటిని సంస్కృత పదాలుగానే భావించి పాళీపదాలను వివరించే సందర్భంగా (Concepts of Buddism) వీటిని విస్మరించటం గమనార్హం. ఆ పదాలుయథాతథంగా మహాయాన సంస్కృతంలో ప్రవేశించాయి. అంతేకాక మహాయాన సంస్కృత సాహిత్యం "తథతా" అనే పదం తయారయింది. "అష్టసాహసిక ప్రజ్ఞాపారమిత"లో ప్రత్యక్షమయిన ఈ పదం అశ్వఘోషుని "మహాయాన శ్రద్ధోత్పాద"లో రెండు రూపాలు పొంది – బూత తథతా,సంసార తథతా – లోకాతీత శూన్యతను, లౌకిక ఆతీతకతను సంభావిస్తూ రెండింటినీ 'అద్వయ'గా వివరించింది. ఆఖరికి అంతా శూన్యమేనని వివరించింది. ఇది తరువాత అభివృద్ధిచెందిన "అద్వైత" భావ ప్రేరకమయి ఉండవచ్చు.

రచయిత సెల్ : **9866944186.**

**కవిత**

## మూడోకన్ను

చూడాలంటే ఒక్క కన్నుచాలు
అయినా రెండు కళ్లు వచ్చాయి
చూపులో స్పష్టత... దృష్టిలో దక్షత
ఆకలి తీరడానికి పచ్చడి మెతుకులు చాలు.
కడుపాకలి రుచెరగదంటారుగా...!?
అయినా పాడునాలుకకు ఎన్ని రుచులో!!
అదే కదా నాలుక నగ్నసత్యం.
శిశువుకు సేవలు చేయడానికి
ఎందరో ఆయాలు... దాదీలు
ఏడ్చేనోటికి పాలసీసాల్లా
నిద్రుచ్చే రింగులడోలీలా
అన్ని పనులు అయిపోతాయి...కానీ...
'అమ్మ' పంచే నులివెచ్చని పొత్తిళ్లహాయి
ఆమె ఇచ్చే ఆత్మీయలాలి దేనికి సరి??
ఎన్ని భాషలు నేర్చినా మరెన్ని విద్యలు పొందిన
మాతృభాషపై పట్టులేని జీవనం
వెన్నెముకలేని మనిషి చందం
అదో కొయ్యబొమ్మ జీవితం
కోటీశ్వరుడైన నిరుపేదరూపం
అందగత్తె అయిన కురూపి వైనం

**అమ్మిన శ్రీనివాసరాజు**
ఫోన్: 9441317694

చరిత్ర

- శ్రీ బొర్రా గోవర్ధన్

## తెలుగమ్మ ఒడిలో బౌద్ధం - 3

# బౌద్ధాన్ని ఆలింగనం చేసుకున్న నేల



ఒక శాతవాహనరాజు

గత సంచికల్లో బుద్ధుని కాలానికి చెందిన బావరి, అతని శిష్యుల గురించి, బౌద్ధ సారస్వతంలో తెలుగువారి ప్రస్థావనల గురించి, బౌద్ధుల చైత్య సంప్రదాయాల గురించి, పాళీ - తెలుగు పదబంధాల గురించి కొద్దిగా చర్చించాం. ఇప్పుడు మరికొన్ని విషయాలు చూద్దాం.

**జాతి - కులం:**

భారతదేశంలో తప్ప మరెక్కడా 'కులం' లేదు. ఈ 'కులం' అనే ఊసరవెల్లి, 'వర్ణం' అనే తొండ ముదిరి ఏర్పడింది. - ఇతర ప్రపంచంలో జాతి, రంగుల భేదాలతో మానవ సమాజాల విభజన ఉంది. అక్కడ ఆయా జాతుల్లో కూడా ఆర్థిక తేడాల్ని బట్టి 'వర్గా'ల విభజన కూడా ఉంది. వర్గాల్లోగానీ, జాతి విభజనలో అమానుషం ఉంది కానీ, అంటరానితనం లేదు.

ఈ అంటరానితనం భరతఖండంలోనే ఉంది.

ఇలా, హోదాని బట్టిగాక, పుట్టుకను బట్టి, ఉచ్చనీచాలుగా మన సమాజం చీలి పోయింది.

ఐరోపా వర్గ సమాజాల్లో ఒకనాటి ధనహీనుడు-కొంతకాలం పోయాక ధనవంతుడైతే - వాడు ఉన్నత వర్గంలోకి చేరిపోతాడు. దీనికి ఎలాంటి అవరోధాలుగానీ, కట్టుబాట్లుగానీ, నియమ నిబంధనలుగానీ లేవు. కానీ, ఒక తక్కువ కులం వాడు ఎంత ధనవంతుడైనా, ఎంత జ్ఞానవంతుడైనా, ఎంత పేరు పొందినా - వాడు ఎన్నటికీ అగ్రకులంవాడు కాలేడు. ఇదీ ప్రధానంగా ఇక్కడున్న కుల సమాజ కర్కశ నిబంధన.

ఈ హెచ్చుతగ్గుల తేడాలు మరెక్కడా లేని విధంగా ఇక్కడే ఉన్నాయి.

అంటే- ఐరోపా దేశాలకంటే ఇక్కడ మానవ సమాజం ఎక్కువ ముక్కలు ముక్కలుగా విడగొట్టబడి ఉందన్నమాట.

కానీ- ఐరోపా ఖండం జాతుల, భాషల ప్రాతిపదికన చిన్న చిన్న దేశాలుగా విడిపోయింది. ఈ లెక్కనగాని విడిపోతే... మన దేశం ఒక వంద పైచిలుకు దేశాలుగా ముక్కలవ్వొచ్చు. ఎందుకంటే- ఇక్కడి ప్రజలు జాతుల, భాషల పరంగానే కాదు, 'కుల'పరంగా కూడా విభజించబడి ఉన్నారు గదా!

కానీ... ప్రపంచ చరిత్రలో ఒక అద్భుతం జరిగింది!

ఎంతో చిన్న చిన్న భాగాలుగా విడిపోవలసిన ఈ 'భరతఖండం' - భిన్నత్వంలో ఏకత్వాన్ని చూపుతూ ఒకే దేశంగా కొన్ని వేల సంవత్సరాలుగా అలరారుతోంది. రకరకాల పూలను ఒకే ఒక్క దారం ఎలా మాలగా కూర్చుతుందో...అలాగే ఈ దేశంలోని ఎన్నో జాతుల్ని, కులాల్ని ఒకే మాలగా కూర్చిన బృహత్తరమైన శక్తి ఏదో ఈ నేల మీద ఉంది. ఆ శక్తే - బౌద్ధం!

ఇంతగా విడగొట్టబడి ఉన్నప్పటికీ, ఈ జాతి ఈనాటికీ భిన్నత్వంలో ఏకత్వాన్ని చూపుతుందంటే దానికి ఒకే ఒక కారణం బౌద్ధం!

అందుకే చరిత్రకారులందరూ ముక్తకంఠంతో చెప్పింది ఇదే!

"బౌద్ధం ఈ దేశం ఆత్మ" అని.

గురజాడ ఇలా అన్నాడు-

"భారతదేశాన్నుండి బౌద్ధాన్ని వెళ్ళగొట్టి, ఈ దేశం ఆత్మహత్య చేసుకుంది"-అని.

కానీ , నిజానికి భారతీయుల 'ఆత్మ'ల్లోంచి బౌద్ధం తుడిచిపెట్టుకు పోలేదు. పోదు. ఒక 'మాయ' పొర మాత్రం కమ్ముకుంది. అంతే!

ఈ దేశ జవం, జీవం, చేవ, సత్తువ, నడక, నడత, ఆలోచన, ఆత్మ అన్నీ బౌద్ధమే.

ఈ దేశ సమగ్రతకు బౌద్ధతత్త్వం ఎలా పనిచేసింది? ఎంతవరకు పనిచేసింది? – అని తర్కించాల్సిందే!

## వైదికం – బౌద్ధం:

ఈ దేశంలో ప్రధానంగా రెండు భావజాలాలున్నాయి.

ఒకటి: మానవ సమాజాన్ని విభజించే దృక్పథం ఉన్న సిద్ధాంతం. మానవ సమాజంలో హెచ్చు తగ్గులుండాలని చెప్పిన సిద్ధాంతం. ఆ హెచ్చుతగ్గుల్ని శాశ్వతం చేయాలనుకున్న 'అమానవీయ' సిద్ధాంతం. – అదే వైదిక సిద్ధాంతం

రెండు: విడిపోయిన సమాజాల్ని, ఏకం చేయాలనుకునే సిద్ధాంతం. హెచ్చుతగ్గుల్ని రూపుమాపాలనుకునే సిద్ధాంతం– అదే మానవీయ సిద్ధాంతం బౌద్ధం.

ఈ రెండు సిద్ధాంతాలూ– తమ తమ భావజాలాల్ని సృష్టించుకున్నాయి.

మొదటిది, మనిషిలోని 'అమానవీయ స్వార్థ పశులక్షణాల్ని ప్రేరేపించి ఆ లక్షణాల్లో బ్రతుకుతుంటే..... రెండోది, మనిషిని సంస్కరించి, అతని విచ్చలవిడి తనానికి అడ్డుకట్టవేసి, మాననీయునిగా మలిచేందుకు పాటుపడుతూ ఆ మానవీయ లక్షణాల్లో బ్రతుకుతుంది.

కాబట్టి, ఈ రెండు భావజాలాలూ – ఈ నేలమీద...ఖచ్చితంగా చెప్పాలంటే మన సమాజంలో... ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే ప్రతి వ్యక్తిలో సంఘర్షించుకుంటూనే ఉన్నాయి. ఉంటున్నాయి. ఉంటాయి కూడా.

మనం ముందు చెప్పుకున్నట్లు మొదటిది ఏకత్వంలో భిన్నత్వానికి, రెండోది భిన్నత్వంలో ఏకత్వానికి నాంది. పునాది.

బుద్ధునికి పూర్వం ఐదారు వందల సంవత్సరాలనాడు చాలా బలీయంగా మారింది వైదిక సంప్రదాయం. వైదిక సంప్రదాయానికి ముందు భారత ఖండంలో మూలవాసులు జీవిస్తూ ఉండేవారు. వీరు ఏఏ ప్రాంతాలవారు ఆయా ప్రాంతాల్లో జీవనం కొనసాగిస్తూ ఉండేవారు.

మనది సువిశాల భూభాగం కావడం, ఇక్కడ జీవనదీనదాలు ఉండడం, చక్కని వర్షపాతం, అటవీ సంపద, మొక్కధాన్యాలు సంవృద్ధిగా లభించడం, గడ్డిభూముల్లో కావలసినంత పశుసంపద ఉండడం, వృద్ధిచెందడం వల్ల ఇక్కడి మూలవాసుల్లో 'ఆర్థికపరమైన లోటుపాట్లు, దురాశలు బలీయంగా ఉండేవికావు. కాబట్టి 'దురాక్రమణలు'కూడా ఉండేవికావు. అంటే ఇక్కడి జీవనవిధానం భారతదేశ 'మూల' వాసుల్లో శాంతియుత జీవితాన్నే నెలకొల్పింది. ఈ ఆనవాళ్ళు మనకి సింధు నాగరికతలో కన్పిస్తాయి.–

ఈ ప్రశాంత మూలవాసుల జీవితాల్లోకి అశాంతిని రాజేసే తొలి పరాయి వైదిక భావజాలం ఆర్యుల రూపంలో ఈనేల మీదికి అడుగుపెట్టింది. అస్థిరనివాసం, పశుపోషణ, దుర్వ్యసనాలు, మితిమీరిన సారాయి వాడకం, విచ్చలవిడి శృంగారం, దురాక్రమణలు, యజ్ఞాలు, బలులు, యుద్ధాలు, నిరంతర తగాదాలు – ఈ అవలక్షణాలన్నింటినీ మూటగట్టుకొన్న సమాజం అది– దాని రాకతో భరతఖండం 'అశాంతి' నిలయంగా మారింది.

ఈ అభారతీయ ఆర్యులు భారత మూలవాసుల్ని ఓడించడమే కాదు– తమలో తాము కూడా నిరంతరం తన్నుకు చచ్చేవారు. అందరూ ఒకే జాతి వారైనప్పటికీ, వారిలో వర్ణాల్ని బట్టి, రంగుని బట్టి, గణాల్నిబట్టి, పశుసంపదను బట్టి ఎక్కువ తక్కువగా భావించి నిరంతరం కొట్లాటల్లో మునిగితేలేవారు.

దీనికి ఋగ్వేదంలో ఎన్నో సాక్ష్యాలున్నా, ప్రధానంగా కన్పించేది దాశరాజ్ఞ యుద్ధం. ఆర్య గణాలు –పురులు, యదులు, తుర్వశులు, ద్రుహ్యులు, అనులు, ఫక్తులు, భలానులు, విషాణులు, అలినులు, శివులు – అని ప్రధానంగా పది గణాలుగా ఉండేవారు. వారంతా నిరంతరం తగపుల్తో గడిపేవారు. ఈ గణాల్లో పురు గణాలకి చెందిన భరతగణం మిగిలిన అన్ని గణాల్ని ఓడించి, అగ్రగామిగా నిలచి, ఇటు ఇతర ఆర్యగణాలమీదా, అటు మూలవాసులైన ద్రవిడ జాతులమీదా ఆధిపత్యం వహించింది.అందుకే ఆ గణం పేరుమీదుగా మన ఈ భూభాగానికి 'భరతఖండం' లేదా 'భరతవర్షం' అనే పేరు వచ్చింది.

ఈ భరతులు, తమ ఇతర ఆర్యగణాల్నే తక్కువగా చూసేవారు. ఇక, అనార్య జాతుల్ని అయితే మరీ నీచంగా చూశారు.

ఈ క్రమంలో ఇక్కడ 'కుల' వ్యవస్థ పుట్టి బలీయంగా మారింది. ఆర్యులు బ్రాహ్మణ, క్షత్రియులుగా అవతరించారు. అనార్యుల్ని వైశ్య, శూద్ర, అంటరాని వారుగా మార్చారు. కులం పేరుతో కలవ కుండా స్థిరపరచారు. 'విభజించి పాలించారు'. ఇలా ఆర్య పాలక సంస్కృతి 'కులాన్ని' పుట్టించాయి. పెంచాయి. పోషించాయి. పటిష్ఠ పరచాయి.

## ఆర్యులు కానివారు మ్లేచ్ఛులు:

ఆర్యులు అనార్యుల్ని 'మ్లేచ్ఛులు' అన్నారు. మనం సాధారణంగా 'మ్లేచ్ఛ' పదాన్ని 'అపరిశుభ్రంగా ఉండేవారు అనే అర్థంలో ఉపయోగిస్తాం. కానీ మ్లేచ్ఛులంటే 'శుద్ధి' పాటించని వారని అర్థంకాదు – ఈ పదానికి అమరకోశం ఇలా చెప్పింది:

"చాతుర్వర్ణ్యవ్యవస్థానం యస్మిన్ దేశేన అవిద్యతే–" అంటే – చాతర్వర్ణ్యవ్యవస్త తెలియని, కన్పించని ప్రదేశం మ్లేచ్ఛదేశం"– అని .

అంటే– ఆర్యులు చెప్పిన కులవిభజన తెలియనివారు, పాటించని వారే మ్లేచ్ఛులు అన్నమాట.

ఆర్యావర్తనానికి బైట ఉన్న ప్రదేశమంతా మ్లేచ్ఛ ప్రదేశమే.–

ఆర్యగ్రంథాల్లో 'ఆంధ్రుల' ప్రస్తావన ఉంది. ఎలా ఉంది? 'మ్లేచ్ఛజాతుల్లో, మ్లేచ్ఛ రాజ్యాల్లో ఆంధ్రులు కూడా ఒకరిగా ఉంది.

అంటే ఆర్యుల్ని బట్టి చూస్తే మనం 'మ్లేచ్ఛుల'మన్నమాట.

ఆర్య సంస్కృతి ఈ దేశాన్ని ముక్కలు చేసింది.

బుద్ధుని కాలానికి భారతదేశం ఎన్నో చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయింది. 16 గణరాజ్యాల్ని, రెండు ఏక కేంద్రరాజ్యాల్ని బౌద్ధ గ్రంథాలు ఉటంకించాయి. అంగ, మగధ, కాశీ, కోసల, వజ్జి, మల్ల, ఛేతి, వంగ, కురు, పాంచాల, మత్స్య, సూరసేన, అస్సక, అవంతీ, గాంధార, కాంభోజ,వంగ, కళింగ, ఆంధ్ర రాజ్యాల ప్రస్థావన ఉంది.–

అలాగే వైదిక గ్రంథాల్లో (భారతంలో)

బర్బర, శబర, తురుష్క, పౌండ్ర, మాళవ, అగర్త, గాంధార, కాశ్మీర, కాంభోజ, కోసల, లోహిత ,అవంతీ, మహీష్మతి, నిషాద, ద్రవిడ, ఆంధ్ర, గౌడ, కేరళ, సింహళ ,మరు, మాళవ, కర్బర, శిరీషక, కర్ణాట , పాంచాల, ఛేది, విదేహ, దశార్ణ, పుళింద, అయోధ్య, కాశీ, మత్స్య, పౌండ్ర దేశాలు ఉన్నట్లుగా ఉంది–

ఇలా– ఈ భరతవర్షం ఎన్నో చిన్న చిన్న రాజ్యాలుగా చిన్నాభిన్నమైపోయి ఉంది.–

ఆర్యరాజులుగానీ, ఆర్య సంస్కృతికి జీవగర్ర అయిన వైదిక సంప్రదాయాన్ని పాటించే రాజులుగానీ, వాటిని ఈ చిన్నా చితకా రాజ్యాల్ని బలవంతాన ఆక్రమించుకో గలిగారుకానీ ఏకం చేయలేకపోయారు.

## గణతంత్రం- భిన్నత్వంలో ఏకత్వం:

ఆర్యీకరణను అంగీకరించని కొన్ని గణరాజ్యాలు గణతంత్రాలుగా ఉంటూ 'భిన్నత్వంలో ఏకత్వం కలిగి ఉండేవి. వజ్జి, మల్ల, వైశాలి, శాక్య, కొలియ, ఇలాంటి రాజ్యాలన్నీ గణతంత్ర రాజ్యాలే. వీటిలో ప్రతిగణం, తమ గణనాయకుల్ని 'ఎన్నిక' ద్వారా ఎన్నుకొంటాయి. ఇలా ఎన్నిక కాబడిన గణపెద్దలు ఆయాగణాల్ని ప్రజాస్వామ్య పద్ధతిలో పాలిస్తుంటారు. అలా ప్రతిగణంలోని పెద్దలంతా కలసి "గణపతుల్ని" అంటే గణాలన్నింటికీ అధిపతుల్ని 'ఎన్నిక' ద్వారానే ఎన్నుకుంటారు- ఇదీ గణతంత్ర వ్యవస్థ. చిన్నాభిన్నంగా ఉన్న రాజ్యాలన్నీ కలిసి ఒకే పాలన క్రిందకి వస్తాయి. ఈ గణాలమీద అధికారం ఏ ఒక్క గణానిదోకాదు. అన్ని గణాలదీ.

ఆకాలంలో మన తెలుగు నేలమీద ఉన్న ములక, అశ్మక రాజ్యాలు కూడా గణతంత్ర రాజ్యాలే.

ఆర్యగణాల్లో మిగిలిన పదిగణాల్ని జయించి, గణాధిపత్యం, 'భరతగణం' సాధించింది. ఈ విధానం ఏకఛత్రాధిపత్యానికి ఏకకేంద్రరాజ్యాలకీ దారి చూపించింది. నిరంకుశ రాచరికానికి మార్గం వేసింది. సామాజిక విభజనకి పెద్దపీట వేసింది.

కానీ, ఆర్యేతర గణవ్యవస్థ ప్రజాస్వామ్య గణతంత్రానికి దారి చూపింది. భిన్నత్వంలో ఏకత్వానికి నాంది పలికింది.

ఈ గణాల్లో ఒక గణం శాక్యగణం. ఆ గణ యువనాయకుడు, ఆ గణాలన్నింటికీ అధినాయకుడు కాగలిగిన యువరాజు సిద్దార్థుడు బుద్ధునిగా మారాడు. ప్రజాస్వామ్య గణతంత్రానికి ప్రాణంపోశాడు-
మనం ఈ వ్యాసం మొదట్లో చెప్పుకున్న 'జరిగిన అద్భుతం' ఇదే. సిద్దార్థుడు బుద్ధుడు కావడమే!

## ఐక్యతారాగం - బౌద్ధతత్త్వం:

బౌద్ధసిద్ధాంతమే మానవతారాగం. మానవీయ కుసుమ పరాగం. సమాజం విడిపోవడాన్ని బౌద్ధం ఒప్పుకోదు. విడిపోయిన సమాజాన్ని ఏకం చేయాలని చూస్తుంది. అంటే - వైదిక తత్త్వం బోధించిన 'వర్ణ, కులవ్యవస్థను' బౌద్ధం కూకటి వ్రేళ్ళతో పెకలించడానికి పూనిక వహించింది.

వైదిక దృక్పథం ప్రకారం 'వర్ణవ్యవస్థను పాటించదు కాబట్టి బౌద్ధం కూడా ఒక మ్లేచ్ఛ' సిద్ధాంతమే! నిజం చెప్పాలంటే- వైదిక దృక్పథం-

'మానవీయత'ని మ్లేచ్ఛం అంది.
'ఐక్యత'ను మ్లేచ్ఛం అంది.
సహోదరత్వాన్నీ మ్లేచ్ఛం' అంది.

కుల మతాల రొచ్చు అంటని ఈ దేశ మూలవాసుల్ని, బౌద్ధుల్ని, జైనుల్ని, వీరితోపాటు, ఈ దేశం మీదికి ఆ తర్వాత దండెత్తి వచ్చిన యవన, శక, పారశీక, మొగల్, ఆంగ్లేయ వంశాల వారందర్నీ మ్లేచ్ఛులంది.

ఇలా- ఈ భారతదేశంలోని అనార్య రాజులకీ, మూల భారతీయ పాలకులకీ, విదేశీ పాలకులకు - 'వర్ణాశ్రమ ధర్మాల్ని పాతరవేసిన' బౌద్ధమే శరణ్యం అయింది.

అశోకుడు, కనిష్కుడు, హర్షుడు, - గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి- ఇలా ఎందరెందరో చక్రవర్తులకు (మ్లేచ్ఛులకు) బౌద్ధం తన ధార్మిక ఛత్రం కింద నీడనిచ్చింది. భిన్న జాతుల్ని ఏకం చేసింది. భిన్న నాగరికతతో, విభిన్న సంస్కృతులలో, విభిన్న సంప్రదాయాలతో ఉన్న ఈ దేశాన్ని చిన్నాభిన్నం కాకుండా కాపాడింది.

## అశోకుడు ఒక్కడే:

మనం 'భరతవర్షం' , 'భరతఖండం' అని చెప్పుకొంటున్న సువిశాల ప్రాంతాన్నంతా పాలించిన చక్రవర్తి అశోకుడు ఒకేఒక్కడు. అంతకు ముందుగానీ, ఆతర్వాతగానీ అంత ప్రాంతాన్ని పాలించిన చక్రవర్తి గానీ, రాజవంశంగానీ ఈ నాటికీ లేదు. ఇక రాదు. అందుకే అశోకుని కాలంలోనే ఈ దేశానికి రాజకీయంగా, సాంస్కృతికంగా, ధార్మికంగా, నైతికంగా, భావజాల పరంగా భిన్నత్వంలో ఏకత్వానికి పునాది పడింది. అందుకు కారణం అశోకుడు అవలంభించిన బౌద్ధ విధానాలే.

ఆ తర్వాత 1947 స్వాతంత్ర్యానంతరం మాత్రమే (అశోకుని రాజ్యమంత కాకపోయినా) తిరిగి ఈ సువిశాల భారతాన్ని గణతంత్ర దేశంగా చూడగలిగాం. ఇందుకు బౌద్ధుడైన అంబేద్కర్ కృషి మరువలేనిది.

ఈనాటికీ్కూడా మనదేశంలోస్థానిక స్వపరిపాలనలు, రాష్ట్రాల పరిపాలనలు కొనసాగుతూనే అన్ని రాష్ట్రాల్ని కలిపి పాలించే కేంద్ర ప్రభుత్వం (ఇది ఏదో ఒక రాష్ట్రానికి చెందింది కాదు) పరిపాలన, బౌద్ధం ప్రవచించిన ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యానికి ప్రతిరూపమే!

ఐరోపా దేశాల్లా, మధ్య ఆసియాలోని పారశీక దేశాల్లా ముక్కలు చెక్కలు కాకుండా ఈనాటికీ సాంస్కృతికంగానే కాకుండా రాజకీయంగా కూడా భిన్నత్వంలో ఏకత్వం చాటుతుందంటే ఇది బౌద్ధ భావజాల ప్రభావమే! మనదేశమేకాదు, చైనా, వియత్నాం, థాయిలాండ్, కొరియా, జపాన్‌లాంటి తూర్పు ఆసియా దేశాలన్నింటిలో ఇలాంటి భిన్నత్వంలో ఏకత్వమే ఉంది. 'అందుకు కారణం కూడా ఆయా దేశాల్లో బలీయంగా ఉన్న బౌద్ధ భావజాలమే!

## ఆంధ్ర దేశంలో:

ఇదే భావజాలం మన తెలుగు నేలమీద కూడా పరిఢవిల్లింది. వైదికమతం శూద్రులుగా, అతిశూద్రులుగా, అంటరానివారిగా ముద్రవేసిన ఎన్నో నిమ్నకులాలవారు తెలుగునేలమీద తను ప్రాభవాన్ని చూపారు. చాటారు.

ఎందరో రాజులు, మరీముఖ్యం రాణులు, అంటరాని కులాలవారు బౌద్ధాన్ని తను ధార్మిక జీవనానికి చుక్కానిగా ఎంచుకున్నారు. బౌద్ధాన్ని పాటించారు. పూజించారు. - అశోకుని తర్వాత బౌద్ధ ధర్మాన్ని తన పాలనకు మార్గదర్శకంగా ఎంచుకున్న గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి ఇందుకు తిరుగులేని నిదర్శనం. తొలి తెలుగు సామ్రాజ్య మహారాణి గౌతమీపుత్ర శాతకర్ణి కన్నతల్లి బాలశ్రీ గొప్ప బౌద్ధ అనుయాయి. ఇంక ఎందరెందరో రాణులు బౌద్ధాన్ని ప్రేమించారు. ఆరాధించారు. అందుకు కారణం ఒక్కటే: వైదిక సంప్రదాయంలో స్త్రీలకు ఆధ్యాత్మిక లోకంలో స్థానంలేదు. వారు పారలౌకిక మార్గానికి అనర్హులు. ధార్మిక ప్రపంచానికి అంటరానివారు - కానీ, దానికి భిన్నంగా స్త్రీలక్కూడా బౌద్ధం ఆధ్యాత్మిక ద్వారాలు తెరచింది. ధార్మిక హోదా కల్పించింది. స్త్రీ వివక్షతను తుదముట్టించింది.

అలాగే... అంటరాని కులాలవారికి కూడా 'బౌద్ధం ధార్మిక జీవితాన్ని' చూపించింది. ఇందుకు తిరుగులేని నిదర్శనం మన తెలుగునేల మీదే కన్పిస్తుంది.

అమరావతిలో దొరికిన ఒక శాసనం ఈ చారిత్రక సత్యాన్ని

పాట

# వెలుగుల తెలుగు



తెలుగుపలుకు తెలుగయాస-తెలుగు నుడి కూర్పులు
తెలుగుభాష పెన్నిధులు-మన శ్వాసల పరిమళాలు
మన జాతీసంస్కృతుల-విస్తరణకు రహదారులు

గగన పాలపుంతలోన - జలతారు వలవేసి
వెన్నెల మూలాల్ని తెచ్చి - చలువ ముద్దగా చేసి
సిరిమల్లె సంపెంగ - గులాబీ అత్తరులు
చేమంతి పూబంతి - తంగేడు పుప్పొడులు
పరువాలవాణి - అధరామృతాలద్ది
పోతపోసిన సొగసులు - తెలుగక్షరాలు
విశ్వకర్మ ఉలిమలిచిన - పరిపూర్ణరూపాలు

పున్నమిరేయిలో - తేటనీటిసరస్సులో
తేలిఆడు తెల్లకలువ - పూవులనగా...
మలిసంజవేళలో - మందపవనహాయిలో
బారులు తీరిన ప్రశాంత - కపోతాల వరుసనగా
హేమంతఋతువులో - ప్రతి పచ్చిక శిరసుపై
ముత్యాలై మెరిసే - మంచుబిందువులే అనగా...
ప్రకృతిభావాల గనులు - మన వెలుగు తెలుగు పదాలు

చెరకురసములో చిక్కని - తేనెపోసి గిలకరించి
పాలూ మీగడలతోడ - పంచదార రంగరించి
పనసతొనల సరసన - చక్కెరకేళీలు చేర్చి
జామామామిడి వెలగ - గుజ్జులన్ని కలగలిపి
అతిమధురఫలరసాయనాన్ని - అద్భుతంగ వండినా
ధన్వంతరి సరికొత్త - లేహ్యం సృష్టించినా
తెలుగు మాండలికాలకవి - సరిరావు సరిపోవు

ఇతిహాసపురాణాలు - ప్రబంధాలు శతకాలు
నాటకాలు గేయాలు - నవలా అవధానాలు
కథలు కవిత్వాలు - పలు నూతన ప్రక్రియలై
ప్రపంచభాష పదాలెన్నొ - కలుపుకొంటు విస్తరిస్తు
కాలవేగమందుకొంటు - మానవబంధాలల్లుకొంటు
వినసొంపగు ఉచ్చారణ - మన భాషాపదజాలం

ఆ తెలుగు మనది మనది - వారసులం మనం మనం
ఆ సంపద కాపాడుట - అదే అదే మన ధర్మం
మొదట మన తెలుగుభాష - ఆ పిమ్మటె పరభాషలు
ఎన్నయినా నేర్చుకో - విశ్వమంత వెలిగిపో
అమ్మభాష అమ్మమనసు - అమ్మ చేతివంట
ఏ సిరులకు సరితూగని - నిత్య సత్యాలమూట
మనసంత పులకించు - ఆమని కోయిల పాట

**- సడ్లపల్లె చిదంబరరెడ్డి**
ఫోన్: 9440073636

ఆవిష్కరించింది–

'విధికుడు' అనే మాదిగకులస్తుడు, అమరావతి స్తూపాన్ని దర్శించుకునేవాడు. అంతేకాదు, ఆ స్తూప నిర్మాణానికి తనవంతుగా కొంత విరాళంకూడా ఇచ్చాడు.

వైదిక ఆలయాల్లోకి అంటరానివారికి ప్రవేశంలేదు.–

కానీ,

బౌద్ధ ఆరామాల్లోకి ప్రవేశం ఉంది. అంతే కాదు, వారికి బౌద్ధ భిక్షువులై ధర్మప్రబోధం చేసే హక్కుకూడా ఉంది.

అందుకే తెలుగు నేలను పాలించిన వైదికేతర రాజులు, తెలుగు నేలమీద జీవించిన వర్ణ, కుల, లింగ వివక్షకు గురైన ప్రజలందరూ బౌద్ధాన్ని ఆలింగనం చేసుకున్నారు.–

క్రీ.పూ.300నుండి క్రీశ.500 వరకూ ఈ నేలమీద బౌద్ధం అడుగడుగునా నడయాడింది.

అందుకు తొలిద్వారాలు తెరిచిన రాజవంశం 'శాతవాహనులు'– వీరి కాలంలోనే రెండో బుద్ధునిగా కీర్తిగాంచిన ఆచార్య నాగార్జునుడు అవతరించాడు.

(ఇంకా ఉంది)

ఫోన్: 9390600157

పొరుగు తెలుగువారు

శ్రీ అగరం వసంత్

# కోలారు జిల్లా తెలుగు మహనీయుడు

# శ్రీ యోగి ఆంజినప్ప స్వాములవారు.

తెలుగు భాష, సాహిత్యం అంటే, కేవలం ఇప్పటి ఆంధ్ర, తెలంగాణ అనే రాజకీయపు గిరుల తెలుగు వరకవులూ యోగులూ ఆ గిరులకు బయటకూడా కనిపిస్తారు, ఓపికగా వెతకగలిగితే. అటువంటి మహనీయులలో ఒకరు శ్రీ ఆంజినప్ప స్వాములవారు.

ఈయన ఇప్పటి తమిళనాటి హోసూరు తాలూకాలోని సీకనపల్లి అనే ఊరిలో 1869వ ఏడాది పుట్టిరి. వీరి తల్లిదండ్రులపేర్లు కాశమాంబ, గవియప్ప. వీరి చిన్నతనంలోనే వీరి తండ్రి చనిపోయిరి. సరిగ్గా అదే సమయంలో అంటే 1876-77లలో హోసూరు తావులో విషరోగాలు చెలరేగి చాలామందిని బలి తీసుకున్నాయి. దీంతో వీరి తల్లిగారైన కాశమాంబ, కొడుకుతోపాటు హోసూరు తావును విడిచి, ఇప్పటి కర్నాటకోని కోలారుజిల్లా, శ్రీనివాసపురం తాలూకా, అరికేరి పల్లెకు వలస పోయింది. అరికేరికి జమిందారుగా ఉండిన వెంకటప్ప, వీరికి దగ్గర చుట్టం కావడంతో ఈ కుటుంబాన్ని ఆదుకునిరి. కాశమాంబ ఇంటిపనులు చేస్తా, ఆంజినప్ప గొడ్లనుఉ కాస్తా బతుకులను కొనసాగించిరి.

ఆంజినప్పకు పెండ్లీడు రాగానే, వెంకటప్ప తన కూతురైన పాపమ్మను ఇచ్చి వీరి పెండ్లి జరిపించిరి. పెండ్లి అయినాకూడా ఆంజినప్ప, పాపమ్మల సంసారజీవనం, రామకృష్ణపరమహంస, శారదాదేవీల దాంపత్యంలాగానే గడిచిందట.

ఆంజినప్ప కోడెవయసులో ఉన్నప్పుడు ప్రతిదినమూ గొడ్లనుమేతకు విడిచిపెట్టి, ఆ చుట్టుపక్కలున్న మానులనీడల్లోనో బండలమీదనో కూర్చుని ధ్యానంలో మునిగిపోయేవారట. అట్లాంటప్పుడు ఆయన నోటినుంచి వేదాంత, భక్తిపరమైన పాటలూ, పద్యాలూ జాలువారేవట. మెల్లమెల్లగా వాటికి ఆయన అక్షరరూపం కూడా ఇచ్చినారట. అదే తరువాత కాలంలో 'అనుభవ వేదాంత రత్నావళి' అనే 494 పుటల గ్రంథంగా వెలువడి, దక్షిణ కర్నాటక అంతటా పేరు గడించింది.

ఈ గ్రంథంలోని భాష, 450 పుటలకుపైగా తెలుగు, 50 పుటలలోపల కన్నడం. అయితే లిపి మొత్తం కన్నడంలోనే ఉంది. 1946నుంచి ఇప్పటివరకూ ఏడు ముద్రణలు పొందిన ఈ గ్రంథంలో మొత్తం 526 కీర్తనలు ఉన్నాయి. వాటిలో 474 తెలుగు కీర్తనలు అయితే, 52 కన్నడ కీర్తనలు ఉన్నాయి. ఈ గ్రంథం ఇప్పటివరకూ ఒక్కసారి కూడా తెలుగులిపిలో అచ్చుకు నోచుకోలేదు. తెలుగువారి పట్టనితనానికి నిలువెత్తు నిదర్శనం ఇది.

అంజినప్ప స్వాముల ఆధ్యాత్మిక సాహిత్యం, శతకాలుగానూ, (కందపద్యాలతో, ద్విపదలు), తత్వాలూ, కీర్తనలుగానూ ఉంది. తనకు మరుగుజ్జు రూపంలో కనిపించి జ్ఞానాన్ని ఇచ్చిన ఆంజనేయ స్వామిని



అంజనప్ప స్వాములతో బైరారెడ్డి

గురించి ఎక్కువ కీర్తనలు రాసి, ఆయనకే అంకితం చేసి ఉన్నారు. శ్రీ రాముడు, శ్రీకృష్ణుడు, శ్రీదేవి, భూదేవి, శారదాదేవి, గంగాదేవి, శివుడు మొదలైన దేవతలపైన కూడా కీర్తనలు ఉన్నాయి. బడి చదువులు ఎరగని ఆయన, పండితులూ, పామరులూ మెచ్చేటట్లుగా వేదాంతసారాన్ని, భక్తితత్వాన్నీ రాసిరి. తన గురించి ఆంజనేయస్వామికి చెప్పుకున్న తీరును ఈ కింది కీర్తనలో చూడవచ్చు.

"ఒకరి సొమ్ముకు నేను ఆశపడలేదు ఆంజనేయ/చెయ్యెత్తి ఇస్తేను చేతుల్లాడ్డినాను ఆంజనేయ

కడుపుకు కూడు లేక కట్టుగుడ్డలేక ఆంజనేయ/జోలికట్టలేదు ఇండ్లు తిరగలేదు ఆంజనేయ కడుపు సాకుట కొరకు కష్టమెంతో పడితి ఆంజనేయ...."

అట్లాగే "ఏడుకొండలు దాటి ఏకాంతపురమునా, వెంకటేశుని చూడు మనసా...", "ఆంజనేయుని సేవచేసే ఆర్యులెవ్వరు అప్పోరో, ఆత్మలో నిరాత్మలైన ఆర్యులెవవ్వరు అమ్మోరో..." అంటూ పల్లీయుల నుడికారంలో లీనమై రచనలు చేసిరి ఆంజినప్ప స్వాములు. సమాజంలో భక్తిపేరుతో మోసాలు చేసే దొంగస్వాముల గురించీ, కులమతాల పేరుతో గొడవలు పడడం గురించీ ఎత్తి చూపించి వాటిని తెగనరుకుతూ

తత్వాలను రాసి ఉన్నారు. బ్రహ్మంగారిలాగా, కైవారం నారాయణ తాతగారిలాగా వీరు కూడా కాలజ్ఞానాన్ని చెప్పి ఉన్నారు. పిండోత్పత్తి విధానాన్ని కూడా వివరించి ఉన్నారు. మానవ శరీరానికి తెలుగు అక్షరమాలకూ లంకెపెడతా ఇట్లా వివరించి ఉన్నారు స్వాములు.

"ఈ స్థూల శరీరములో గుదమస్థానంబునందు ఆధార కమలంబు/ శషసహ/ అను నాలుగు రేకులతో నొప్పబడియుండును, దీనికి అధిపతి విఘ్నేశ్వరుడు. దానికి రెండంగుళములకు పైభాగమున సప్తసతియను స్వాధిష్ఠాన కవలంబు/బభమయరల/అను ఆరు రేఖలతో నొప్పబడియుండును. సృష్టికర్తయగు అజుండు ఉండును. దానికి ఎనిమిది అంగుళములపైన/ దఢణతథదధనపఫ/ అను అక్షరాన్వితమై పదిరేకులతో నొప్పబడియుండును, దీనికి కర్త విష్ణుదేవుండు. దానికిపైన దశాంగుళంబున హృదయస్థానమునందు/కఖగ ఘఙచఛజఝఞటఠ/ అను పన్నెండు రేకులతో నొప్పబడి యుండును, దానికి అధిపతియై లయకర్త అగు రుద్రుండు ఉండును. ఆ మీదట పన్నెండు అంగుళములకు పై భాగమున కంఠమునందు/ అఆఇఈఉఊఋౠఌౡఎఏఐఒఓఔఅంఅః/ అను పదహారు దళంబులచే విశుద్ధ చక్రంబు వెలయుచుండును.

ఆంజినప్ప స్వాములవారిపై శ్రీ కైవారం నారాయణ తాతగారి ప్రభావం ఉన్నట్లుబాగా కనబడుతుంది. "తొమ్మిది వాకిండ్లదుఃఖములకిది మూలదుంప" అని కైవారం తాతగారు అంటే, "తొమ్మిది వాకిండ్ల తనువిది నెమ్మదేమియు లేక వున్నది" అని ఆంజినప్పస్వాములు అంటారు. "ఎందుండి వస్తివి తుమ్మిద ఏవూరు తుమ్మీద" అని తాతగారుఅంటే, నీవూరి పేరేమ ఇ జీవయ్య నీవు ఎందుకువస్తివి జీవయ్య"అని ఆంజినప్పస్వాములు అంటారు. తతగారుతమ పద్యాలకు వాడిన ఒక మకుటాన్ని కూడా అట్లే వాడిరి స్వాములవారు.

కైవారం తాతగారు 1726వ ఏడాది, ఇప్పటి కర్నాటకలోని కోలారుజిల్లా చింతామణి తాలూకాలో పుట్టినవారు. తాతగారి రచనలు 90% తెలుగులోనూ 10% కన్నడంలోనూ ఉన్నాయి. వీరి రచనలన్నీకూడా కన్నడలిపిలోనే పుస్తకాలుగా అచ్చయి, కర్నాటడా అంతా పేరు గడించాయి. తాతగారి జీవిత ఆధారంగా కన్నడంలో రెండు చలనచిత్రాలకు కూడా వచ్చినాయి.

1914వ ఏడాది బైరారెడ్డి అనే ఆయన స్వాములవారికి శిష్యుడుగా అయ్యిరి. 1935లో స్వాములవారి ఇల్లాలు పాపమ్మగారు కన్ను మూసినప్పటినుచి, 1971 ఏప్రిల్ 30న స్వాములవారు మహాసమాధి అయ్యేంతవరకూ, భైరారెడ్డి తన జీవితాన్ని పూర్తిగా గురుసేవకే అంకితం చేసిరి. తన గురువుగారికి అమిత ఇష్టమైన కుబ్జారూపంలోని ఆంజనేయస్వామి గుడిని, మొదట తన సొంతూరైన ఆవులకుప్పలో కట్టించిరి. ఆ తరువాత ఉప్పుకుంట తదితర ఊర్లల్లో కూడా గుడులను కట్టించిరి.

1938 ఏప్రిల్ 15న అప్పటి ఉన్నత పోలీసు అధికారి అయిన బి.పి.రేవణ్ణ, స్వాములవారిని తొలిసారి కలుసుకొనిరి. అప్పటినుంచీ ఆయన స్వాములవారికి పరమభక్తుడిగా మారిరి. స్వాములవారి రచనలను అన్నిటినీ ఒకచోట చేర్చి 1946లో 'అనుభవ వేదాంత రత్నావళి'గా తొలిసారి అచ్చువేయించింది ఈయనే.

ఆంజనప్ప స్వాములు, కోలారుజిల్లా శ్రీనివాసపురం తాలూకాలోని 'గుట్టపల్లి' అనే ఊరిలో సమాధి అయ్యిరి. ఆ ఊర్లో స్వాములపేరిట ఇప్పటికీ ఒక ఆశ్రమం ఉంది. ప్రతి ఏటా మార్చి/ఏప్రిల్ నెలలో ఇక్కడ ఆరాధన ఉత్సవాలు జరుగుతాయి.

శ్రీ ఆంజినప్ప స్వాములవారి గ్రంథం ఇప్పటివరకు ఏడు ముద్రణలు పొందింది. గుట్టపల్లి ఆశ్రమ నిర్వాహకులు, స్వాములవారి జీవితచరిత్రను కన్నడంలో ముద్రించి ఉన్నారు.

స్వాములవారు పుట్టిన సీకనపల్లినుంచి ఇప్పటి ఆంధ్రప్రదేశ్ ఎల్ల (గుడిపల్లి మండలం) కేవలం 40 కి.మీ.లు ఆ మహనీయుడు బతికిన అరికెరి, సమాధి అయిన గుట్టపల్లి ఊర్లయితే మదనపల్లి మండలానికి కూతవేటు దూరంలో ఉన్నాయి. అయినా ఆంధ్రులకు ఆంజినప్ప స్వాములవారి రచనల గురించి తెలియదు. కానీ సగం కర్నాటకలో వీరి రచనలు బాగానే ప్రచారంలో ఉన్నాయి. కారణం ఏమిటో తెలస్తా ఉంది కదా! ఆంధ్రప్రదేశ్, తెలంగాణా అని తెలుగువారు గీసుకున్న రాజకీయపు గిరులు, బయటి తెలుగును తొక్కిపారేసినాయి. తెలుగు అక్షరానికి దూరం చేసేసినాయి. ఇప్పటి ఆంధ్ర, తెలంగాణాల్లోఎందరు తెలుగువారున్నారో సరిగ్గా అందరు ఆ ఎల్లలకు బయట తెలుగు అక్షరాలకు దూరమై బతుకుతున్నారు. మీరూ మీరూ రాజకీయంగా కొట్లాడుకోండి, కానీ నుడిపరంగా ఇరు రాష్ట్రాలు కలిసి మాకు అండగా నిలవండి. తెలుగు పెంపుకు నడుము కట్టండి. జై తెలుగుతల్లి.

సెల్:09488330209

**కవిత**

## హారతి

అరుదుగా అపురూపంగా లభించే
ఆణిముత్యంవంటి ఏకాంతం
ప్రశాంతి చందమామ
వెలుగువర్షం కురిపిస్తుంటే
అద్భుత భావాల కొబ్బరాకులు
చిరుగాలుల వింజామరలు వీస్తుండగా
గున్నమామిడి చెట్టుమీది శుకపికాలు
స్వరసంగమాలు చేస్తుండగా
మది మారుమూలల్లో
అల్లరి పిల్లల్లా గంతులువేసే అక్షరబాలికలు
ఏకాగ్రతా ఉపాధ్యాయుడు
గాఢానురక్తి బెత్తం పట్టుకోగానే
పురుడు పోసుకున్నాయి
పదాల మాలికలు-గేయాల వినతులు
ఇవేఇవే ఆ సాహితీ సరస్వతికి
నేనొసగే భక్తి హారతులు...!

**- కోపూరి పుష్పాదేవి,**
సెల్‌నం. 9440766375.

కవిత

# మాతృభాషావాదం రావాలి

భాష
కవులకోసం - రాజకీయాలకోసం
శాస్త్రవేత్తలకోసం - రచయితల కోసం
పుట్టిందికాదు సుమా!
ప్రజల గుండె చప్పుళ్ళకోసం పుట్టింది
నాగరికతను అంటుకట్టడానికి పుట్టింది
మానవ సంబంధాల మహత్కార్యాలకి పుట్టింది
వాచికచర్యలో పరువూ బరువూకోసం పుట్టింది
ఇవాళ - అది
చలన చిత్రాలలో మలినమైంది.
మీడియా రంగంలోఅసహజమైంది
రాజకీయాలలో దూషణ, తిరస్కారాలకు ఆటపట్టు అయింది
ఆధిపత్య భావాలవల్ల మాండలికమైంది
పండితమ్మన్యులవల్ల అలగాజనం భాషైంది.
మన అమ్మనుడి
ఆంగ్ల కేన్సర్ వల్ల
వెంటిలేటర్‌పైనే వుంది
ఇపుడు కావాల్సింది
సాయుధపోరాటాలూ, వివాదాలూ కాదు
మాతృభాషావాదం రావాలి

-డా॥ ద్వా.నా. శాస్త్రి
చరవాణి. 98492 93376

## కపిలవాయి లింగమూర్తికి 'పాలగుమ్మి' పురస్కారం



సుప్రసిద్ధ సాహితీవేత్త కథానిక రచయిత పాలగుమ్మి పద్మరాజు శతజయంతి స్మారక పురస్కారాన్ని ప్రసిద్ధ సాహిత్య పరిశోధకులు కపిలవాయి లింగమూర్తికి ప్రదానం చేశారు. ఈ మేరకు రచయిత డాక్టర్ వేదగిరి రాంబాబు ఈ పురస్కారాన్ని అందించారు. పాలమూరు జిల్లా కేంద్రంలోని రెవెన్యూ సమావేశ మందిరంలో జిల్లా అధికార భాషా సంఘం, జిల్లా సాంస్కృతిక మండలి సౌజన్యంతో పాలమూరు సాహితి, వేదగిరి కమ్యూనికేషన్స్, తెలుగు రథం ఆధ్వర్యంలో తెలుగు కథానికాసదస్సును నిర్వహించారు. సభాధ్యక్షులు ఆచార్య కసిరెడ్డి మాట్లాడుతూ తెలుగు సాహిత్యంలో దాదాపు అన్ని ప్రక్రియలమీద రచనలు చేసిన డాక్టర్ కపిలవాయి లింగమూర్తి గొప్ప సాహిత్యవేత్త అని, పాలమూరు ఆణిముత్యమని ప్రశంసించారు. ప్రధాన వక్త డాక్టర్ వేదగిరి రాంబాబు మాట్లాడుతూ తెలుగు సాహిత్యంలో కథానికకు గొప్పపేరు తీసుకువచ్చిన పాలగుమ్మి పద్మరాజు నిత్యస్మరణీయుడిని ప్రస్తుతించారు. పాలగుమ్మి పద్మరాజువ్రాసిన 'గాలివాన' కథానిక అంతర్జాతీయస్థాయిలో రెండవ బహుమతిని అందుకోవడం విశేషమన్నారు. కపిలవాయి లింగమూర్తి రాసిన కపిలవాయి కథానికలు కథానిక సంపుటిని ఎజెసి డాక్టర్ పున్నా రాజారాం ఆవిష్కరించారు. కొంపెల్లి శర్మ పుస్తక సమీక్ష చేశారు.

## పరిశోధనలు సమాజాభివృద్ధికి దోహదపడాలి



సమాజంలోని మనిషి వ్యక్తిత్వ వికాసానికి సాహిత్యం దోహదపడుతుందని, మానసిక ప్రశాంతతను చేకూరుస్తుందని మహబూబ్‌నగర్ జిల్లా అదనపు సంయుక్త కలెక్టర్ డాక్టర్ పున్నా రాజారాం ఉద్ఘాటించారు. పాలమూరు జిల్లాలో సాహిత్య పరిశోధనా కేంద్రం ద్వారా జిల్లాలో సాహిత్యం విస్తృతంగా రావాల్సిన అవశ్యకత ఉందన్నారు. పరిశోధనలు సమాజాభివృద్ధికి దోహదపడేవిగా ఉండాలని ఆయన ఆకాంక్షించారు. జిల్లా అధికార భాషా సంఘం, జిల్లా సాంస్కృతిక మండలి సౌజన్యంతో ఏప్రిల్ 26న జిల్లాకేంద్రంలోని రెవెన్యూ సమావేశ మందిరంలో తెలంగాణ సాహిత్య పరిశోధన కేంద్రం, పాలమూరు సాహిత్య పరిశోధన కేంద్రం సంయుక్త ఆధ్వర్యంలో జరిగిన పాలమూరు సాహిత్య సదస్సు కార్యక్రమంలో ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. అధ్యక్షులు ఆచార్య ఎస్వీ రామారావు మాట్లాడుతూ తెలంగాణ సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకురావడానికి పరిశోధనా కేంద్రాలను ప్రారంభించినట్లు తెలిపారు. త్వరలో సాహిత్య చరిత్రను వెలుగులోకి తెస్తామన్నారు. ఈ సమావేశంలో ఆచార్య కసిరెడ్డి పాలమూరు జానపద సాహిత్యంపై, వైద్యం వెంకటేశ్వరాచార్యులు అలంకార గ్రంధాలుపై, పల్లెర్ల రామ్మోహన్‌రావు పాలమూరు పద్యకవితా వైభవంపై, సంబరాజు రవిప్రకాష్‌రావు పాలమూరు ఆత్మకథలు, జీవిత చరిత్రలపై, డా॥భీంపల్లి శ్రీకాంత్ పాలమూరు పరిశోధకులు పై పరిశోధనా పత్రాలను సమర్పించారు.

# శ్రీలంకలో తెలుగువారి హక్కులు

**మా**నవ హక్కుల గురించీ, మైనారిటీలగురించీ మాట్లాడనివారు అభ్యుదయవాదులే కాదన్నది నేటి రాజకీయాల తీరు. ఉనికి (అస్తిత్వ) పోరాటాలకు దిగి, బలమైన ఉద్యమాన్ని కట్టుబడి చేస్తే గాని ఎవరూ కన్నెత్తి వారివంక చూడరు. తమ హక్కులేమిటో తెలియక, తెలిసినా పోరాడే శక్తిలేక నలిగిపోతున్న, అణగారిపోతున్న వారిని మనదేశంలోనూ, విదేశాల్లోనూ గుర్తించడం మొదలుపెడితే – వాళ్లలో నుడిపరమైన హక్కుల్ని కోల్పోతున్నవారిని గమనించితే – వాళ్లంతా – కనీసం వారిలో ఎక్కువమంది తెలుగువారే అయివుంటారు. ఇదంతా ఎందుకు చెప్తున్నామంటారా?–

తమిళనాడులో తెలుగువారు తమ నుడిపరమైన గుర్తింపును కోల్పోవడం 60 ఏళ్ల క్రిందట ఆంధ్ర రాష్ట్ర ఏర్పాటుతో మొదలైంది. తెలుగు ప్రభుత్వాల పట్టనితనం వల్ల తమిళనాడు లోని తెలుగువారు తమ ఉనికిపై జరుగుతున్న భాషాపరమైన అణచివేతను ఓర్చుకొంటూ ఉండిపోయారు. దీని మరొక కోణం– శ్రీలంకలో మనం గమనిస్తాం. 8 లక్షలమంది తెలుగువారు శ్రీలంకలో ఉన్నారన్న సంగతిని తెలుగు భాషోద్యమ కార్యకర్తలు బయటకు వెల్లడించారు. 'తెలుగువాణి' ఆ తెలుగు తోబుట్టువులకోసం తెలుగువాచకాన్ని రెండు నుడులలో తీర్చిదిద్ది, అచ్చువేసి పంపిన సంగతి 'అమ్మనుడి' చదువరులకు తెలుసు. లోగడ 'నడుస్తున్న చరిత్ర'లోనూ, దినపత్రికలు, టి.వి.ల్లోనూ తెలుగు భాషోద్యమ కార్యకర్తలు వెల్లడించిన సంగతులు పలువురు ఆలోచనాపరుల్లో ఆవేదనను కలిగించాయి.

ఇప్పుడు చెప్పుకోవలసిన సంగతి ఒకటుంది.

'యునెస్కో' అంటే మనకు తెలుసు. ఐక్యరాజ్యసమితివారి–విద్యా, సామాజిక, సాంస్కృతిక వ్యవహారాల విభాగం. అందులో శ్రీలంకకు చెందిన ఆల్‌ఫోన్స్ జీపు డ్రయివర్‌గా పనిచేస్తున్నాడు. అతను శ్రీలంకలోని 'అలిగంబె' అనే ఊరి వాడు. ఆ వూరికి తెలుగు పేరు కూడా ఉంది– 'ఏనిగలూరు' అని.

ఏప్రిల్ 27న మానవహక్కులపై ఐ.రా.స.వారు శ్రీలంకలో ఒక సమావేశం ఏర్పాటు చేశారు. అందులో మైనారిటీల హక్కులపై చర్చ జరుగుతోంది. శ్రీలంకలోని తమిళుల గురించీ, ముస్లింల గురించీ, మలయన్ల గురించీ మాట్లాడుతున్నారు. అది విన్న ఆల్‌ఫోన్స్ నడుమన కలుగచేసుకోవడానికి అనుమతి అడిగాడు. మీరెంతసేపటికీ తమిళులగురించీ, ముస్లింలగురించీ, మలయన్లగురించీ మాట్లాడుతున్నారు. శ్రీలంకలో తెలుగువాళ్లం 8 లక్షలమందికిపైగా ఉన్నాం. మా గురించి ఎందుకు మాట్లాడరు?" అని ఎంతో ఆవేదనతో అడిగాడు.

దానికి వాళ్లు 'ఈ సంగతి మాకు తెలియదు' అంటూ, 'మీకేమైనా సంగం ఉందా?' అని అడిగారు. 'ఏం లేదండీ మావాళ్లు ఏదో పాముల్ని ఆడించుకొంటూ బ్రతుకుతున్నారు!' అన్నాడు. 'మరి–మీకు తెలుగు మెయిన్ ల్యాండ్‌'తో సంబంధంలేదా' అని వాళ్లు అడిగారు.

'లేదు' అన్నాడు ఆల్‌ఫోన్స్.



'దక్షిణాసియాకు సంబంధించిన మా కార్యాలయం భారత్‌లో ఉంది. శ్రీలంకలో 8 లక్షలమంది తెలుగువాళ్లున్నారని అక్కడ రికార్డు చేయించండి' అని వాళ్లు సలహా చెప్పారు.

ఇప్పుడు మెయిన్‌లాండ్‌లోని బలమైన తెలుగు సంగపుశాఖ ఒకటి అక్కడ మొదలు కావలసివుంది. అంతర్జాతీయ పత్రికల్లో వారి గురించి సమాచారం, వ్యాసాలు రావాలి. వికీపీడియా వంటి మాధ్యమాల్లో ప్రచారం కావాలి. పై విషయాలను అమలు చేయాలని ఆల్‌ఫోన్స్ మాప్రతినిధికి చెప్పాడు.

ఇదంతా జరుగుతూనే తెలుగు అక్షరాలు నేర్చుకోవాలనే అక్కడివారి కోరికను తీర్చి వారిని 'తెలుగు అక్షరాస్యుల్ని' చేయవలసివుంది. ఇందుకు 'తెలుగువాణి' ట్రస్టు పూనిక వహించింది.

తెలుగు భాషాభిమానులం అంటూ సభలను జరుపుతూ ప్రచారం చేసుకొనే వారికి ఇలాంటి సంగతులు పట్టవు. ఒకవేళ వారి చెవులకు ఈ వార్తలు సోకినా దీనిని కూడా తమకు అనువుగా చాటుకోవడం తప్ప వాళ్ళకు మరేవిధమైన ఆలోచనా ఉండదు!

అయినా, 'తెలుగుజాతి'గా గుండెలోతుల్లోంచి తలపోసేవారుమాత్రం– వారు కొద్దిమందే అయినా – ఇలాంటి పనులను చేపడతారు. ఇప్పుడు నిర్మాణంలోఉన్న తెలుగుజాతి పునర్వైభవ చరిత్రలో ఇది కూడా భాగం కాబోతున్నది.

**– అమ్మనుడి ప్రతినిధి**

**అమ్మనుడిని ప్రేమించలేనివాడు, అమ్మనూ దేశాన్ని ప్రేమించలేడు.**

---

**కళ్ళుంటే అక్కరనుబట్టీ ఏ కళ్ళజోడయినా పెట్టుకోవచ్చు. తల్లినుడిలో దిట్ట అయితే ఇతర నుడులెన్నయినా తేలికగా నేర్చుకోవచ్చు.**